# పాతికేళ్ళ పత్రికా రచన

## (1965-90)





యువభారతి
రజతోత్సవ
సదస్సు

రజతోత్సవ ప్రచురణ

# పాతికేళ్ల పత్రికా రచన

## (1965 - 1990)

యువభారతి రజతోత్సవ సదస్సు వ్యాస సంకలనం

రజతోత్సవ ప్రచురణ

సంపాదకులు

డాక్టర్ జి. వి. సుబ్రహ్మణ్యం

డాక్టర్ తిరుమల శ్రీనివాసాచార్య

యువభారతి రజతోత్సవ సంఘం

యువభారతి కార్యాలయం

తిలక్ రోడ్, హైదరాబాదు-500 001

# PAATHIKELLA PATRIKAA RACHANA

(1965-1990)

(Twenty five years of Progress in Telugu Journalism 1965 - 1990) - A collection of papers presented at the Seminar held on the same topic on 27-10-1991 as a part of Silver Jubilee Celebrations of Yuva Bharathi.

---



Silver Jubilee Publication No. 138

First Edition : May 1992

Copies : 1000

Cover Design : Sri Seela Virraju

**Price : Rs. 25**

For Copies :

**Yuva Bharathi**

(A literary & Cultural Organisation)
Andhra Saraswatha Parishath Buildings,
Tilak Road, Hyderabad-500 001

Printed at :

**Padmavathi Art Printers**

1-1-517/B/1, New Bakaram,
Gandhinagar, Hyderabad-500 380.
Phone : 611413.

# పాతికేళ్లలో పత్రికారంగం మంచీ–చెడూ

—శ్రీ ఎ.బి.కె. ప్రసాద్

మనిషికి కళ్లు ఎందుకుండాలో తెలుసుకుంటే సంఘానికి సమాచారం ఎందుకు అవసరమో అర్థమవుతుంది! ఈ సత్యం పలకడానికి ఏ రెబెక్కా-వెస్ట్‌నో ఆశ్రయించవలసిన పనిలేదు. ఈ మహా సత్యాన్ని నన్నయ నార దుడితో అనిపించాడు : "వార్తయందు జగము వర్తిల్లుచున్నది / అదియు లేని నాడు అఖిల జనులు / అంధకారమగ్నులగుదురు గావున / వార్త నిర్వహింప వలయు బతికి." అయితే ఏ రకమైన 'వార్త'ను ఎలా నిర్వచించాలి, ఎలా నిర్వహించాలి అన్నది ఆనాటికీ, ఈనాటికీ తెగని ఓ వార్తా సత్యం! ఎందు కంటే, సర్కారీ నిర్వహణకూ, ఆబ్కారీ కాంట్రాక్టుకూ తేడా పాడాలు తెలియ కుండాపోతున్న రోజుల్లో, సర్కారీ వార్తకూ దాదాపు నూటికి 80 వంతుల ప్రజాధనానికి పూచీ పడవలసిన పరపతి సంస్థల పెట్టుబడులపై ఆధారపడి కూడా ప్రజా శ్రేయస్సును అప్రధానం చేసి, "ప్రయివేటైజేషన్" ఉచ్చులతో సొంత ప్రయోజనాలకోసం వార్తాపత్రికలు నిర్వహించే అధిపతులు, శాసించ జూచే వార్తకూ మధ్య కూడా సంహద్దులు చెరిగిపోతున్న ఈ రోజుల్లో - మనం పాతికేళ్ళ పత్రికా రచన గురించి ముచ్చటించుకుంటున్నాం. మనం భోళాగా మాట్లాడుకోవాలి.

వార్త అంటే ఏమిటో ధర్మరాజు కూడా ఏనాడో చెప్పాడు. "భూమే ఒక కుండ, ఆకాశమే దానిపైన మూకుడు, సూర్యుడే నిప్పు, పగలూ రాత్రి కట్టెలు, నెలలూ, ఋతువులూ తెడ్లు, వీటితో కాలం మొత్తం ప్రాణి కోటినే వండేస్తుంది. ఇదే వార్త" అన్నాడు! ధర్మరాజు అప్పటికి ప్రయివేటైజేషన్ పరలోకి వెళ్ళలేదు కాబట్టి ప్రకృతిని పెట్టుబడిగా వాడుకుని, వార్త వైశిష్ట్యాన్ని అందంగా వర్ణించ గలిగాడు!

పాతికేళ్ళ పత్రికా రచన, అంటే 1965 నుంచి 1990 దాకా గడిచిన మొత్తం భారతీయ పత్రికా రంగంలోనే ప్రత్యేకించి తెలుగు పత్రికా రంగంలో ఒక కొత్త శకావిష్కరణకు సాక్షీభూతంగా ఉంది. పాతికేళ్ళ పత్రికా రంగ చరిత్రలో ప్రస్ఫుటించిన పాజిటివ్ ఫాక్టర్స్ - రాష్ట్రంలో మొదటి సారిగా పెక్కు దిన, వార పత్రికలు అవతరించడం, పాత్రికేయుల సంఖ్య పెరగడం, పత్రికా రచనలో వైవిధ్యం పెరగడం రాజకీయ అవినీతిపట్ల, సంఘ దురాచారాలపట్ల, ప్రజావ్యతిరేకమైన పరిణామాలపట్ల ఆగ్రహ భార్గవులుగానే గాకుండా విచక్షణా దృష్టికల ఆలోచనాపరులుగా, విశ్లేషణకర్తలుగా కూడా యువతరం పాత్రికేయులు తన తనాన్ని మొహరు వేసుకో గలుగుతున్నారు; ఒక కేంద్రంనుంచి గాక, వివిధ కేంద్రాల నుంచి మల్టీఎడిషన్స్ అవతరణ ఈ దశలో ఒక శుభపరిణామం. అయితే ఒక జిల్లాలో పరిణామం ఆ పక్క జిల్లా ప్రజలకు అందకుండాచేసే "బాల్కనైజేషన్" వల్ల మన ఇరుగుపొరుగే మనకు దూరబంధువులై పోవడం ఈ దశలో ఓ దుర్దశగా పేర్కొని తీరాలి.

సమాచార రంగంలో ఉరకలు వేసుకుంటూ దూసుకువస్తున్న సాంకేతిక విప్లవానికి ఆహ్వానం పలుకుతున్న మనం, మరొకవైపున ఉపాధి రంగంలో కూడికలకంటే తీసివేతలకు (నిరుద్యోగానికి) దోహదం చేస్తున్న పరిణామాన్ని హర్షించగల స్థితిలో లేము. ప్రయివేట్ పత్రికా యాజమాన్యాలు పరస్పరం కుత్తుకలు త్తరించుకునే ఈ వ్యాపార పోటీలో స్టార్‌వార్స్‌కు ఉజ్జీ అయిన కలర్ వార్‌లో ఉన్నాయి! ఈ పాతికేళ్ళలో వచ్చిన ఈ పరిణామం - ఉత్పత్తి ఖర్చుల భారాన్ని (ప్రభుత్వం అదుపుతప్పిన ఇన్‌ఫ్లేషన్ వల్ల) పాఠకులపైకి నెడుతూ పత్రికల రేటును పెంచివేసుకొంటూ పోడానికి దోహదం చేసింది. ఆరోగ్యకరమైన పోటీలో విలువలు పెరగాలి. ఈ అనారోగ్యకరమైన పోటీలోనే పత్రికా నైతిక విలువలు కోల్పోతున్నాం. రూపాయి విలువ పడిపోవడానికి ఈ విలువలు పతనం కావడానికీ దగ్గర సంబంధం ఉందని గమనించాలి! సుమారు 90 శాతం ప్రజల పెట్టుబడితో (బ్యాంకు పెట్టుబడి ప్రజలది) సాగించే ఈ వ్యాపారాన్ని ప్రజలలో ఆరోగ్యదాయకమైన అభిరుచులను పెంచేందుకు గాక, చౌకబారు నాగరికతనూ, అధమస్థాయి అభిరుచులను, క్షుద్రమైన ఆలోచనలను రేకెత్తించేందుకు కేశాలంకరణ పేరిట, అధరాలంకరణ చాటున (ఇంట్లో నాలుగు గోడలమధ్య జరగవలసిన వ్యవహారాన్ని బజారుపాలుచేసే నాగరికత)

అన్యరుచులకు పాఠకులను బలవంతాన అలవాటు చేసే హక్కును నిరంకుశంగా చెలాయించుకోవడం కూడా ఈ పాతికేళ్ళలో చివరి దశాబ్దంలో ప్రారంభమైన దుర్గతి. చౌకబారు అభిరుచులను పెంచే అధికారాన్ని, హక్కును వీరికి ఎవ రిచ్చారు? ఇది వీరి పుర్రెకు పుట్టిన పుండా లేక ప్రజల మాండేటా? వీళ్ళు సమా ధానం చెప్పరు, చెప్పలేరు. ఆస్తిహక్కు మన కళ్ళకు పొరలు కప్పకూడదు. కాపిటలిజానికి "పీపుల్స్ కాపిటలిజం" అని ఎవరు పేరు పెట్టారు? మీరూ, నేనూ కాదు, కాపిటలిస్టులే పెట్టుకున్నారు! అది మొన్నటి నినాదమైతే, నిన్న, నేడూ వినిపిస్తున్న సరికొత్త స్లోగన్-"ఎన్‌లైటెన్డ్ కాపిటలిజం" అట! ఈ తెలివి ఎవరికోసం? ఆ నవచైతన్యం, ఆ వికాసం ఎవరికోసం? వెర్రితలలు వేస్తున్న అభిరుచులకు మాత్రమే ఈ నేతి బీరకాయ "ఎన్‌లైటెన్డ్ కాపిటలిజం" ప్రాతి నిధ్యం వహిస్తోంది! అరమరికలు లేకుండా చెబుతున్నందుకు ఎవరూ బాధపడ కూడదు. వ్యాపార పోటీలో, ఇంకా ఆదర్శాలు మిగుల్చుకోగలిగిన యువతరం పాత్రికేయులకు ఉన్న స్వేచ్ఛ సాపేక్షమైనదే గాని నిరాపేక్షమూ, పరాక్షేప ణీయమూ అయిన సాధనం కాదు, కాజాలదు!

1965కు ముందు తెలుగు పత్రికలు అంతకుముందు ప్రారంభించిన వ్యావహారిక భాషా ఉద్యమాన్ని మరింత సువ్యవస్థితం చేయడంతోపాటు కొత్త రుచులను అభిరుచులను తెలుగు పాఠకులలో ప్రవేశపెట్టిన దశ అది. క్రమంగా ఆకారంలో, అంతరంగంలో సాంకేతిక స్థాయిలో కొత్త ప్రమా ణాలను ఆవిష్కరించిన కాలం అది; యాజమాన్యాలు పోటాపోటీలుపడి పత్రికా రంగానికి రంగుల హంగులు దిద్ది తీర్చుతున్న కాలం ఇది. అయితే, వాటితో పాటు మరొక దుర్దశకు అంకురార్పణ చేసిన కాలంకూడా అదేనని మరవరాదు. వృద్ధతరం అగ్రశ్రేణి పాత్రికేయులలో ఒకరైన మనికొండ చలపతిరావు చెప్పినట్టు "credibility of Newspaper is a deposit of years" అన్న సూక్తికి అర్థం - కేవలం పత్రికల యాజమాన్యాలు అని కాదు, అహో రాత్రాలు లోకసంచారులై వార్తాహరులుగా, వార్తాసేకరణ వ్యాపారంగా కాకుండా అదే కూడు, గుడ్డగా నిత్య వ్యాపకంగా పనిచేసి పత్రికా వ్యవస్థ ఇంతకాలమూ బతికి బట్టకట్టి అవిరళంగా అభ్యుదయం సాధించడానికి తమ ఆరోగ్యాన్ని కూడా లెక్కచేయకుండా శ్రమించే పాత్రికేయులని విశిష్టార్థం! కాని ఈ శ్రమను కాస్తా కాజేసే పాడుబుద్ధి కొన్ని యాజమాన్యాలలో పాతుకుపోయి,

పెరిగిపోతోంది. నిరుపేదరికం, నిరుద్యోగం పాత్రికేయ వృత్తిలో కూడా ఒక శాపమై "ఘోస్టు రైటర్స్"నూ, "ఘోస్టు సంపాదకు"లనూ యాజమాన్యాలకు సరఫరా చేసే పరికరంగా మారిపోయింది. ఈ విషయంలో యాజమాన్యాలను నిందించి లాభంలేదు! అందుకే మార్క్స్ అన్నాడు: "Money is the galvano-chemical force"! మనిషిని తన అవసరానికి తార్చడం ఆ ఒక్క శక్తికే ఉంది. కురూపిని సురూపిగానూ, సురూపిని కురూపిగానూ చిత్రించి చూపగల శక్తి దాని కొక్కదానికే ఉందన్నాడు! ఈ ఘోస్టు రైటరు ఉన్నంతకాలం అక్షర శూన్యుడయిన యజమానిదే రాజ్యం! టెక్నాలజీ పేరిట "సిలికాన్ చిప్" సింగారాలు, చిద్విలాసాల చాటున చాపకింద నీరులా ప్రవహిస్తున్న ఈ నిశిరాత్రి 'వరద' ప్రమాద సూచికను గుర్తించకపోతే తెలుగు అక్షరమాలలో ఉన్న అక్షర సంఖ్యను కూడా చెప్పలేని, ఉచ్చారణ సౌలభ్యం సౌభాగ్యం కూడా లేని కేవల 'అర్థ' భోగాలు అక్షర శక్తిని శాశ్వతంగా శాసించే ప్రమాదం ఉంది! ఎక్కడి సంగతో నాకు తెలియదుగాని, ఇక్కడి భోగట్టా మాత్రం ఇదే! ఈ పాతికేళ్ళలోపే తెలుగునాట ప్రారంభమైన ఈ వ్యాధి ఒక పత్రికకు కాకుండా అన్ని పత్రికలకూ క్రమంగా సోకింది, సోకుతోంది, సోకుతుంది! ఇకమీదట యజమానులే ఎడిటర్లు, ఇకమీదట సంపాదక వర్గాలు ఉపసంపాదక వర్గాలు కేవల అనువాద గుమస్తాలుగా నమోదు కావచ్చు! "మెకాలే" విద్య యాజమాన్యాల మోకాళ్ళకు కాదు, మెదడులకే పాకిపోతోంది! మూడు నాలుగు తరాలవెనక యూరప్‌లోనూ, మన దేశంలోనూ, మన రాష్ట్రం లోనూ ప్రజాశ్రేయస్సును ఆశించి, ఆశ్రయించిన పలురకాల ఉద్యమాల స్ఫూర్తిలో ఎదిగివచ్చిన పాత్రికేయులూ, సంపాదకులూ వేరు, కొన్ని యాజమాన్యాలూ వేరు. నేటి పరిస్థితి ఇందుకు పూర్తి విరుద్ధం. ఇండియాలో "కేసరి"ని తలచుకుంటే స్వతంత్ర భావాలు, స్వీయరచనా శక్తిగల తిలక్ గుర్తుకొస్తాడు. "హరిజన్", "యంగ్ ఇండియా"ల పేరు వింటే గాంధీజీ, "ది నేషన్" మాట వింటే అనిబిసెంట్, "బొంబాయి క్రానికల్" పేరు వింటే హార్నిమాన్, "ది లీడర్" అనగానే చింతామణి, "ది సెంచరీ" ప్రస్తావన వస్తే కుందూరి ఈశ్వర దత్తు, "నేషనల్ హెరాల్డ్" అంటే చాలు కోటంరాజు రామారావు, ఎమ్. చలపతిరావు, "ఆంధ్ర పత్రిక"కు మారు పేరుగా నిలిచిన కాశీనాథుని నాగేశ్వరరావు, "కృష్ణా పత్రిక"కు సారథిగా ముట్నూరివారు, "గోలకొండ"కు సురవరం ప్రతాపరెడ్డి, "ఆంధ్రప్రభ"కు

న్యాపతి రాఘవరావు, నార్ల వెంకటేశ్వరరావు గుర్తుకు రావలసిందే. కాని ఆ గుర్తింపు, వారిలో కొందరు యజమానులైనప్పటికీ సాహిత్య కళాదిరంగాలలో, రచనాశక్తిలో స్వయం ప్రకాశనంతో వెలుగులు వెదజిమ్మిన వారు. కనుకనే వారిముద్రలు పత్రికాసంస్థలకే అభయముద్ర లయ్యాయి. వారి మాట కొండగా, గోలుకొండగా చెలామనీ అయింది. వారి సేవాదీక్ష, సంఘదృష్టి, సంస్కరణ ప్రియత్వమూ, వారి సదాశయాలూ సంస్థలకు కూడా ఆశీర్వాదా లయ్యాయి. యూరోపియన్ జర్నలిజంలో కూడా అంతే. "పెన్నీ ప్రెస్"కూ, చిలిపి పత్రికలకూ ఆద్యుడైనప్పటికీ అధిపతి అయినప్పటికీ "ది డైలీ మెయిల్" సంపాదకుడుగా పనిచేసిన నార్త్‌క్లిఫ్ "లండన్ ఎక్స్‌ప్రెస్" గ్రూపు పత్రికల అధిపతి బీవర్‌బ్రూక్, ''గార్డియన్'' అధినేత సి. పి. స్కాట్-ఉబుసు పోని కలం స్నేహితులు కారు, స్వయంగానే పాత్రికేయులూ, సవ్యసాచులూ. వారంతా అక్షరసూర్యులేగాని, అక్షరశూన్యులు కారు! కాని సాహిత్యోపాసనకు, రచనా శక్తికీ దూరులైన ఈ అక్షరశూన్యుల ఆర్థిక సామ్రాజ్యాలకు తెలుగునాట ఈ పాతికేళ్ళలోనే పునాదులు పడడం దురదృష్టకర పరిణామంగా పరిగణించాలి. ప్రజల కాయకష్టం కోట్లరూపాయలుగా మారి బ్యాంకులలో డిపాజిట్లుగా రూపాంతరం చెందగా, ఆ డిపాజిట్లు సొంతవ్యాపారాలకు వంత పెట్టుబడిగా వాడుకొంటున్న కొందరు తిరిగి సర్కారీవార్తతో షరీకై తన అభిప్రాయాలనే ప్రజాభిప్రాయంగా చిత్రీకరించుకోజూస్తున్నారు! నేటి పత్రికా రంగం ఒక వైపున సంఘదురాచారాలను ఎండగడుతున్నట్టు కన్పిస్తున్నా, దుయ్యబడుతున్నట్టు అనిపిస్తున్నా వర్ణరాజకీయాలతో వర్గ రాజకీయాలతో ఎక్కడో ఒకచోట చేతులుకలపకుండా ఉండలేకపోతోంది! దానికి కారణం నైతికవిలువల పట్ల, దేశ రాజకీయార్థిక వ్యవస్థ తీరు తెన్నుల పట్ల నిశితమైన అభిప్రాయాలు లేకపోవడం- ఉన్నా మొండైన మాటను చెప్ప లేకపోవడమూ. ఆదర్శం కొరతబడ్డచోట అవకాశవాదం పైచేయి సాధిస్తుంది. నేటి పత్రికారంగంలో పరిస్థితి కూడ అదే. అందుకే ఎమర్సన్ : **"Idealism must be active. There must be an edge to goodness"** అన్నాడు! అక్కరకురాని ఆదర్శాన్ని అవతలకు పెట్టమన్నాడు, మంచికీ హద్దులుండాలన్నాడు.

కనకనే మనం పదే పదే కోరే పత్రికా స్వేచ్ఛను పరిపూర్ణమైన పరిభాషలోకి అనువర్తించుకొని అనుభవంలోకి తెచ్చుకోలేకపోతున్నాం, ప్రయివేటీ

కరణలో ఈ స్వేచ్ఛకు అర్థం చాల పరిమితం. ఎంతసేపూ డిఫమేషన్ చట్టాల పరిధిలోనే పత్రికా స్వేచ్ఛను గురించి ముచ్చటించుకొనే కాలం అంతమయింది. దేశ స్వాతంత్ర్య సమరం నాటి మిలిటెన్సీ ఈనాటి పత్రికలకు లేకపోవడానికీ, ఒకవేళ ఉన్నచోట ఆ మిలిటెన్సీ కాస్తా పెట్టుబడి చట్టాలకు బందీ కావడానికి కారణం — నాటి ఆశయ ఆదర్శాలూ, సేవాధర్మం, నైతికవిలువలూ పూర్తిగా తారుమారై పత్రికా వ్యవస్థ కూడా "నిత్యావసర సరకులు" ఉత్పత్తి చేసే వ్యాపార, వాణిజ్య వ్యవస్థగా మారిపోవడమే. వ్యాపారం వ్యాపారాన్ని ఆశ్రయిస్తోంది. జూట్ పరిశ్రమాభివృద్ధికోసం పత్రికనూ "వొక్కపొడి"నీ ముక్కుపొడినీ ప్రమోట్ చేయడంకోసం వార్తను ప్రమోట్ చేయాలన్న తప్పుడు ఆలోచన ఎప్పుడు పుట్టిందో అప్పుడే పత్రికా వ్యవస్థ పతనం కూడా ప్రారంభమయింది. డబ్బుతో ఈ లోకాన్ని కొని కట్టిపడవేయవచ్చుననుకునే వారి చేతుల్లోని పత్రికలు పత్రికల పాలిట పరసువేదులు కాజాలవు, పరమ శివుడి మూడో నేత్రంగా వర్ధిల్లజాలవు; అవి మూఢ విశ్వాసాలకూ, స్వార్థ చింతనకూ పరంధాములై కూర్చుంటాయి! పాత్రికేయ ప్రపంచంలో ఒక సామెత ఉంది: కుక్క మనిషిని కరిస్తే వార్త కాదు, మనిషి కుక్కను కరిస్తేనే వార్త అని! దానిని ఆసరా చేసుకొని మన చలపతిరావు గారు పత్రికా లోకానికి ఓ మంచి ప్రతిపాదన చేశారు: "సమాజంలో మార్పు అవసరం. ఆ సామాజిక పరివర్తనే నిజమైనవార్త; అలాగే అసలు మార్పులేకుండా స్తబ్దతగా పడి ఉన్నా అదీ వార్తే. సాంఘిక, ఆర్థిక రంగాలలో ఈ మార్పు అవసరం, అత్యంత అవసరం. కానీ బడా పత్రికలలో, వాటికున్న బలమైన ఆర్థిక వనరులతో లేదా పన్నులు ఎగవేయడం ద్వారా కూడబెట్టిన లాభాలు ఆధారంగా జిగేల్ జిగేల్ మనిపిస్తూ మాయపొరల్లా దూసుకువచ్చే మాగజైన్లలో - సాంఘిక విలువలూ, సంఘానికి పనికివచ్చే అంశాలూ బతక జాలవు. కేవలం సెన్సేషన్, అశ్లీలపు సరకూ. ఇంతకూ కావలసిన, రావలసిన అసలు సిసలు సెన్సేషనలిజం - సాంఘిక, ఆర్థికపరివర్తనం. అదీ అసలు సెన్సేషన్" అన్నాడు! పత్రికారంగంలో ఈ విపరిణామం ఎందుకు వస్తోంది? దీనికి కొన్ని దశాబ్దాలనాడే "పాల్‌మాల్ గెజిట్" ఎడిటర్‌గా పనిచేసిన సుప్రసిద్ధ బ్రిటిష్ పాత్రికేయులలో ఒకరైన విక్‌హామ్ స్టెడ్ సమాధానం చెప్పాడు: "వెనుకటిరోజుల్లో పత్రికా యజమానులు ప్రజా ప్రయోజనాలకోసం ప్రభుత్వ నిర్బంధాలనుంచి, జోక్యంనుంచీ పత్రికా స్వేచ్ఛకోసమేగాక,

నిజమైన "స్వేచ్ఛ" అనేపదం విలువనూ అవసరాన్నీ తెలుసుకొని దానిపట్ల భక్తి విశ్వాసాలతో ఆ స్వేచ్ఛకోసం 'నా బొందో' అంటూ పోరాడారు, శ్రద్ధతీసుకొన్నారు. కాని నేడో! వారసలు స్వేచ్ఛా విలువలకే విరోధులు, వ్యాపార ప్రయోజనాలకోసం పత్రికను తార్చి, దిగజార్చి ఆ ఉచ్చులోకి దించడంద్వారా నిజమైన పాత్రికేయ స్వేచ్ఛకే ఎసరు పెడుతున్నారు; తద్వారా ప్రజల భావప్రకటనా స్వేచ్ఛనే బంది చేస్తున్నారు. ఈ యాజమాన్యాల ఆర్థిక, స్వార్థ ప్రయోజనాలే వారిని కొన్ని విచిత్ర సూత్రాల వైపులోకి నెట్టేస్తాయి. వ్యక్తి స్వేచ్ఛారక్షణకంటే ప్రయివేట్ ఆస్తి రక్షణకే వారి నిఘంటువులో విలువ."

["In the old days many proprietors cared not only for the freedom of press - that is, the right of the press to say whatever it thought-the public interest-required, without interference from Governments - but they cared also for freedom as a good in itself. Today they appear to care little for freedom in itself and do not - perceive that by placing the press in bondage to financial or commercial interests, they are helping to destroy Journalistic and to undermine public freedom. The very magnitude of their financial interests renders them peculiarly susceptible to the influence of doctrines which put the defence of property higher than the defence of freedom.'']

అదీ అసలు రహస్యం. కలం మారినా, కాలం మారినా చెరపరాని, చెరిపినా చెరగని చిర సత్యం స్టెడ్ సత్యవాక్కు!

# పత్రికలు–రాజకీయాలు పరస్పర ప్రభావం

—శ్రీ ఆర్వీ రామారావు

భూమి తన చుట్టూ తాను తిరుగుతూనే సూర్యుని చుట్టూ తిరుగుతున్నట్టు పత్రికా రంగం తన రాజకీయాల చుట్టూ తాను పరిభ్రమిస్తూనే రాజకీయ వ్యవస్థ చుట్టూ పరిభ్రమిస్తూ ఉంటుంది. రాజకీయాలు పత్రికా రంగాన్ని కలుషితం చేస్తున్నాయని పత్రికారంగంలోని వారు ఎంత గగ్గోలు పెట్టినా ఏ పత్రిక రాజకీయాలు ఆ పత్రికకు ఉన్నాయి.

ఒక్కో సమాజంలోని సామాజిక చైతన్యం ఒక్కో ప్రధాన రూపం ద్వారా వ్యక్తం అవుతూ ఉంటుంది. ప్రస్తుత సమాజంలో సకల విషయాలు రాజకీయాల ద్వారానే వ్యక్తం అవుతాయి. అందుకే మతసంబంధమైన కార్య కలాపాలలో మతాధిపతులకంటే రాజకీయ నాయకులదే అగ్రాసనం. గుడి కట్టినా, బడి పెట్టినా రాజకీయ నాయకుడు విధిగా ఉండాల్సిందే. శిరోమణి గురు ద్వారా ప్రబంధక్ కమిటీకి, తిరుమల తిరుపతి దేవస్థానం ట్రస్టుబోర్డుకు అధి పత్యం రాజకీయ నాయకులకే దక్కడానికి కారణం ఇదే. బాబరీ మసీదు ఇమాంకు రాజకీయాల్లో అంత ప్రాధాన్యం ఉండడానికి ఇదే కారణం. మిగతా సామాజిక చైతన్య రూపాలైన కళా, సాహిత్య, న్యాయ, తాత్విక, శాస్త్ర రంగాలలో కూడా ఇదే పరిస్థితి. మన పత్రికలనిండా రాజకీయాలు పరుచుకుని ఉండడం ఇందువల్లే.

రాజ్యనిర్వహణలో వివిధ పార్టీలు, వ్యక్తులు, వ్యవస్థలు నిర్వహించే రాజ్యాధికార రూపాలు, లక్ష్యాలు, రాజ్య నిర్మాణ సమస్యలు, దేశ వ్యవహారాల నిర్వహణ, సమాజంలోని వివిధ వర్గాల నాయకత్వం, పార్టీల కార్యకలాపాలు మొదలైన వాటితోపాటు సమాజంలోని సాంఘిక, ఆర్థిక, సాంస్కృతిక రంగాలలోని సమకాలీన ఘటనల్ల పరిణామాల్ల సముచ్చయమే రాజకీయాలు,

ఈ ఘటనలను పరిణామాలను కొంత కాలం తర్వాత వెనక్కి తిరిగి చారిత్రక దృక్పథంతో వింగడిస్తే అది చరిత్ర అవుతుంది. సమాజంలోని సాంఘిక, ఆర్థిక, సాంస్కృతిక రంగాలకు సంబంధించిన సమాచారాన్ని బట్వాడా చేసే బాధ్యత గల పత్రికల్లో అందుకే రాజకీయాలకు పెద్ద పీట ఉంటుంది. ప్రస్తుత సమాజంలో దృగ్గోచర మవుతున్న అవక తవకలు, దిగజారుడు మొదలైనవి సహజంగానే పత్రికలలో కూడా ప్రతిఫలిస్తాయి. వచ్చిన చిక్కల్లా ఎక్కడంటే, సమాజంలోని - ముఖ్యంగా రాజకీయ రంగంలోని దిగజారుడు, అనారోగ్యకర పరిణామాల ప్రభావం పత్రికా రంగంమీద టన్నుల లెక్కన పడుతోంది. అలాగని సామాజిక జీవనం లోని మంచి పత్రికా రంగంలో అసలే ప్రతిఫలించడం లేదని కాదు. పత్రికా లోకం విస్తృత ప్రయోజనాల దృష్టితో సమాజంలోని వివిధ రంగాలలోని - ముఖ్యంగా రాజకీయ, పరిపాలనా రంగాలలోని మంచి చెడ్డలను ప్రతిఫలిస్తే అవి మళ్ళీ రాజకీయ రంగం మీద పరావర్తనం చెందడం లేదు.

ముట్నూరి కృష్ణారావు, మద్దుకూరి చంద్రశేఖరరావులాంటివారు పత్రికా ముఖంగా వ్యక్తం చేసిన అభిప్రాయాలను వేదంగా పరిగణించేవారు. ఇప్పుడు ఆరోజులు పోయాయి. సంపాదకీయ వ్యాఖ్యలు పత్రికలకు ఆరో వేలులాగా తయారవుతున్నాయి.

ఐక్యరాజ సమితిలో హిందూ పత్రికకు ప్రతినిధిగానూ ఐక్యరాజ్య సమితి పత్రికా రచయితల సంఘానికి అధ్యక్షునిగానూ పనిచేసి ఆ తర్వాత హిందూ పత్రికకు సంపాదకులుగా వ్యవహరించిన బలరాం లాంటి వారి అభి ప్రాయాలకు ప్రభుత్వం ఎంతో విలువ ఇచ్చేది. ఐక్యరాజ్య సమితిలో పోగయ్యే దేశదేశాల దౌత్యవేత్తలు, అమెరికా పాలకులు బలరాంలాంటి వారి వ్యాఖ్యలను, అభిప్రాయాలను భారతవాణిగా పరిగణించేవారు. పార్థసారథి, గోపాలస్వామి అయ్యంగార్, కుల్దీప్‌నయ్యర్‌లాంటి వారు పత్రికా రచన నుంచి దౌత్యవేత్తల స్థాయికి ఎదగడానికి వారికి అధికార వర్గాల్లో ఉన్న పలుకుబడి ఒక్కటే కారణం కాదు. వారి అభిప్రాయాలను గణనీయమైన ప్రజా సమూహాల అభి ప్రాయాలకు ప్రతీకగా పరిగణించడమే వారి ఎదుగుదలకు కారణం.

పండిత్ నెహ్రూ పత్రికల్లో వ్యక్తం అయ్యే అభిప్రాయాలకు చాలా విలువ ఇచ్చేవారు. ఆయన దాదాపు రెండు గంటల పాటు దక్షిణాది నాడి

తెలిపే హిందూ, ఉత్తరాది జనాభిప్రాయానికి ప్రతీకగా ఉండే టైమ్స్ ఆఫ్ ఇండియా, తూర్పున వంగసీమ నుంచి వెలువడే అమృత్ బజార్ పత్రికను క్షుణ్ణంగా చదివేవారు. హిందూస్థాన్ టైమ్స్‌ను స్థాలీపులాక న్యాయంగా చూసే వారు. పత్రికలన్నింటినీ చదివి ఇందిరాగాంధీ ఆయనకు వివరించే కార్యక్రమం ఎటూ ఉండనే ఉండేది. తాష్కెంట్‌లో ఒప్పందం కుదుర్చుకున్న తర్వాత లాల్ బహదూర్ శాస్త్రి తన ఆఖరి రోజున పడుకోబోయేముందు తన సెక్రటరీని పిలిచి తాష్కెంట్ ఒప్పందంపై భారత పత్రికల వ్యాఖ్యలు ఎలా ఉంటాయో పొద్దుటే నివేదించమని పురమాయించారు. అంటే పత్రికల అభిప్రాయాలకు వారు అంత విలువ ఇచ్చేవారు. స్వాతంత్ర్యోద్యమ కాలంలో కూడా ప్రధానమైన పత్రికలన్నీ స్వాతంత్ర్య పోరాటానికి, జాతీయ కాంగ్రెస్‌కు బాసటగా నిలిచినా కాంగ్రెస్‌లోని కుమ్ములాటలను, నప్పనప్పుడు కడకు గాంధీజీ అభిప్రాయాలను కూడా నిర్మొహమాటంగా, నిర్ద్వంద్వంగా, నీళ్ళు నమలకుండా విమర్శించేవి. ఇప్పుడు పత్రికల అభిప్రాయాలకు విలువ ఇచ్చే రాజకీయ నాయకులు మరీ నల్లపూసలైపోయారు. అంత నిర్మొహమాటంగా విమర్శించే పత్రికా రచయితలు కూడా కరువైపోయారు. అందుకే పత్రికలు సమాజంలోని క్షీణ లక్షణాలను ప్రతిఫలిస్తున్నాయనీ, పత్రికలను పట్టించుకునే నాథుడు కరువైపోయాడని చెప్పడం. ఒక రాజకీయ నాయకుడు మరో నాయకుడి మీద వాగ్బాణాలు విసిరితే, విమర్శనాస్త్రాలు సంధిస్తే ఎదుటిపక్షం నాయకుడు వెంటనే శర సంధానం చేస్తాడు. కాని పత్రికలు చేసే విమర్శలను, వ్యాఖ్యలను పట్టించుకొని విధానాలు మార్చుకున్న సందర్భాలు ఇటీవలి కాలంలో చాలా తక్కువ. ప్రభుత్వం మీద, పాలనా యంత్రాంగం మీద పత్రికలు చేసే విమర్శలకు సమాధానం రాజకీయ నాయకుల దగ్గర్నుంచి రావడంలేదు. కలెక్టర్లు, డి.జి.పి.లు అధికార వర్గాల దగ్గర్నుంచి మాత్రమే వస్తోంది. అందుకే పీపుల్స్‌వార్ వర్గం నక్స లైట్లలో నాయకత్వంకోసం పోరాటం, కొండపల్లి సీతారామయ్య నాయకత్వానికి ముప్పు మొదలైన వార్తా విశేషాలన్నీ మనం డి.జి.పి. నోట వింటుంటాం.

ఈ దుస్థితికి కారణం ఏమిటి? పత్రికలు ప్రజాభిప్రాయాన్ని మలిచే పాత్రను వదిలేసి Unedited ప్రజాభిప్రాయాన్ని ప్రతిబింబింపడంలో ఆంతర్యం ఏమిటి? రాజకీయ వార్తలు రాయడం అంటే పైన నిర్వచించిన రాజకీయాలలోని వివిధ పార్శ్వాలకు సంబంధించిన ఘటనలను, పరిణామాలను

ప్రతిబింబించడం. దీనిలో రాజకీయ రంగంలోని వ్యక్తుల నడవడికి, కార్య కలాపాలకు కూడా పాత్ర ఉండేమాట నిజమే. కాని అది గౌణమైనదే. కాని ఇప్పుడు రాజకీయ వార్తలు రాయడం అంటే అప్రధానమైన వ్యవహారానికి ప్రధాన స్థానం కట్టబెట్టడంగా మారిపోయింది. రాజకీయ రంగంలోని వ్యక్తుల నడవడి, కార్యకలాపాలలో కూడా రాజ్యం ప్రగతికి తోడ్పడే అంశాలను, ఆర్థిక, సాంస్కృతిక, సామాజిక అంశాల అభివృద్ధికి దోహదం చేసే అంశాలను ప్రతిబింబించడంలో తప్పులేదు. కాని ఇప్పుడు పత్రికల్లో కనిపిస్తున్న వార్తల్లో రాజకీయ వాదుల దూషణ భూషణలు, పరస్పర నిందారోపణలు, ఛీత్కార ఫూత్కారాలే ఎక్కువ. ఇవి సమాజాభివృద్ధికి తోడ్పడక పోవడం అటుంచి విఘాతం కలిగిస్తాయి. రాజకీయ నాయకులు తీసుకునే నిర్ణయాలలో వారి వ్యక్తిగత అంశాల ప్రభావం లేనంత కాలం ఎవరికీ నష్టం లేదు. నాయకుల గత చరిత్ర, అది మంచైనా చెడైనా వారి వ్యక్తిగత జీవనంలోని ఉచ్ఛనీచాలు, వారి వ్యక్తిత్వంలోని వెలుగు నీడలు మొదలైన వాటికి రాజకీయ ఘటనలతోనూ, పరిణామాలతోనూ, వారు చేసే రాజకీయ నిర్ణయాలతోనూ సంబంధం లేనంతవరకు వాటిని పట్టించుకోనక్కరలేదు. ఒక వేళ పట్టించుకున్నా అవి ఉత్సుకత కోసం మాత్రమే. కాని వాస్తవ పరిస్థితి దీనికి విరుద్ధంగా ఉంది.

ఉదాహరణకు- చలనచిత్ర పరిశ్రమను హైదరాబాద్‌కు తరలించాలన్న ప్రయత్నం ఈనాటిది కాదు. బ్రహ్మానందరెడ్డి ముఖ్యమంత్రిగానూ, చెన్నారెడ్డి పరిశ్రమల శాఖ మంత్రిగానూ ఉన్నప్పుడే ఈ ప్రయత్నం మొదలైంది. కాని చలనచిత్ర రంగంలో పుట్టి పెరిగిన వ్యక్తి ముఖ్యమంత్రి అయినప్పుడు ఈ ప్రయత్నాలకు మోకాలు అడ్డం పెట్టారు. ఆయన హైదరాబాద్‌లో చలన చిత్ర పరిశ్రమాభివృద్ధికి చేసిన ప్రయత్నమల్లా థియేటర్లను నిర్మించడమే. స్టూడియోల నిర్మాణం పేర జరిగిన తతంగం చివరకు ఎలా పరిణమించిందో అందరికీ తెలుసు. కాని ఈ సదరు ముఖ్యమంత్రి నిర్ణయాల వెనక ఉన్న ఆయన గత జీవిత సంబంధాల ప్రభావం ఎంత, దానివల్ల హైదరాబాద్‌లో చలన చిత్ర పరిశ్రమాభివృద్ధికి జరిగిన నష్టం ఎంత అని బేరీజు వేసిన పాపాన పోలేదు పత్రికా రచయితలు. అదే వ్యక్తి స్టూడియోలో దొంగతనం జరిగితే దానిలో ఆ వ్యక్తికున్న వలుకుబడిని దెబ్బతీయడం మీద చూపిన ఉత్సాహం

నిజానిజాల్ని వెలికి తీయడంలో ప్రదర్శించలేదు. అంటే ఘటనలకన్నా, వ్యక్తులకు ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చే ప్రలోభంలో పడిపోయామన్నమాట. రాజకీయాల్లో ఉన్న వారి బంధువులు, సన్నిహితులు సర్వసంగ పరిత్యాగులుగా వ్యవహరించాలని ఎవరూ చెప్పరు కాని ఈ రాజకీయ నాయకులు తీసుకునే నిర్ణయాలలో ఈ బంధువుల, సన్నిహితుల పాత్రను పత్రికలు బట్టబయలు చేస్తున్న సంఘటనలు లేవనికాదు. కాని పత్రికా రచయితలు తమ సత్యాన్వేషణకన్నా ప్రత్యర్థివర్గం అందించే సమాచారం మీదే ఎక్కువగా ఆధారపడుతున్నారని గ్రానైట్ గనుల లీజు వ్యవహారం రుజువు చేసింది.

రాజకీయ నాయకులు వెలిబుచ్చే అభిప్రాయాలకు సమాజాభివృద్ధిని ముందుకో వెనక్కో తీసుకుపోవడానికి కచ్చితమైన అంతస్సంబంధం ఉంటుంది. కాని, నాయకుల ప్రకటనలు, ప్రసంగాలు, పార్టీల తీర్మానాలు, పత్రికా విలేకరుల సమావేశంలో వ్యక్తంచేసే అభిప్రాయాలను నివేదించేప్పుడు వీటికీ సమాజాభివృద్ధికీ ఉన్న అంతస్సంబంధాన్ని పత్రికారంగం పట్టించుకోవడం లేదు. ఉదాహరణకు- 1989 ఎన్నికల ప్రచారంలో కేంద్రంలో మంత్రి ఒకరు మన రాష్ట్రంవచ్చి మన రాష్ట్రంలో టైర్ల ఫ్యాక్టరీ పెడతామని వాగ్దానం వల విసిరితే మంగళగిరి టైర్ల ఫాక్టరీని కాకి ఎత్తుకుపోయిందా అని అడిగేపాటి చైతన్యం మన పత్రికా రచయితల్లో కనిపించలేదు.

ఎందుకని?

ప్రజలకు సమాచారం బట్వాడా చేసి, వారు అభిప్రాయాలను ఏర్పరచుకోవడానికి మాధ్యమంగా వ్యవహరించాల్సిన పత్రికలు; ఎవరో వాస్తవాన్ని అణిచిపెట్టి ఉంచాలని చేసే ప్రయత్నాన్ని వమ్ము చేసి సత్యాన్ని బయట పెట్టాల్సిన పత్రికలు చేస్తున్నపనేమిటి? రాజకీయ నాయకులు తమ స్వప్రయోజనంకోసం అందచేసే ఆభాస సమాచారాన్ని తట్టలకెత్తి పత్రికల పేజీల నిండా పరచడమే.

అందుకే ఇప్పుడు పాఠకుడు పత్రికల్లో వచ్చే వార్తలన్నీ నిజమని నమ్మడం లేదు. పత్రికల విశ్వసనీయత రోజు రోజుకూ తీసికట్టు అవుతుండడంతో పాఠకుడు ఏదో ఓ పత్రికని నమ్ముకుని ఉండలేకపోతున్నాడు. ఒకే సంఘటనను విభిన్న పత్రికలు చూసే దృష్టిలో వైవిధ్యం ఉండొచ్చు. కాని ఆ సంఘటనను నివేదించడంలోనే పత్రికల మధ్య పొంతన లేకపోవ

డంతో పాఠకుడు సంశయాత్ముడవుతున్నాడు. పత్రికా రచయితలు తమ Source ని వార్తలకోసం కాకుండా ఇతరత్రా ప్రయోజనాలకు వాడు కోవడం మొదలైన దగ్గర్నుంచి నాయకుల దృష్టిలో పత్రికలు చులకనై పోయాయి. అందుకే ఇప్పుడు పత్రికా విలేకరుల సమావేశాలు ఆషామాషీ వ్యవహారాలై పోయాయి. రాజకీయ నాయకులతో సంభాషణల్లో వార్తల్ని ఏరుకోవడం మానేసి వార్తలకోసం నాయకుల్ని దేవురించడం మొదలైనప్పటినుంచి రాజకీయ నాయకులు విలేకరుల సమావేశాల్లో పత్రికా ప్రకటనను తయారుచేసి ఇచ్చేంత ఓర్మిని కూడా ప్రదర్శించడంలేదు. ఆశువుగా చెప్పేస్తున్నారు. తమకు అనుకూలంగా లేకపోతే మర్నాడు అలా అనలేదు పొమ్మని బుకాయిస్తున్నారు.

మరో వంక కేవలం పైరవీలు వార్తల అవతారం ఎత్తుతున్నాయి. ఫలానా వ్యక్తికి మంత్రి పదవో మరోటో ఇమ్మని ఆయన ప్రమథ గణం ప్రకటనలు గుప్పిస్తుంది. ఆయన ప్రత్యర్థి వర్గం మరోవైపునుంచి వద్దుమొర్రో అని విమర్శలు గుప్పిస్తుంది. ఈ రెంటినీ పత్రికలు మహాప్రసాదంగా భావించి అచ్చొత్తి పాఠకుల నెత్తికెత్తుతున్నాయి.

ఆరోపణలు, దుష్ప్రచారాలు, నిందా ప్రచారాలు వాస్తవాలతోనూ, సత్యాన్వేషణతోనూ నిమిత్తం లేకుండా పత్రికలలో చోటు చేసుకుంటున్నాయి. ఇలాంటి అంశాలను ప్రచురించేముందు అవతలి పక్షాన్ని సంప్రదించి నిజానిజాలు కనుక్కోవాల్సిన బాధ్యతను ఊపిరి సలపని పోటీ కారణంగా పత్రికలు విస్మరిస్తున్నాయి. దీనివల్ల నిందలకు గురైన వ్యక్తే తన నిర్దోషిత్వాన్ని నిరూపించుకోవాల్సిన అగత్యం ఏర్పడుతోంది. Burden of proof నిందారోపకుల నుంచి నిందితులకు బదలాయించడమన్నమాట.

అత్యాచారాలు, మానభంగాలు, మతకలహాలు జరిగినప్పుడు వాటిని human angle నుంచి చూడడం మానేసి, వాటికి కుల మతాలతో లంకె పెడ్తున్నాం. దీనివల్ల ఒకే నేరానికి బాధితుల కులాన్ని బట్టి ప్రచారంలో తారతమ్యాలుంటున్నాయి. తద్వారా సంఘంలో ఉద్రిక్తతలు ప్రబలుతున్నాయి. హరిజన మహిళ మానభంగం అన్న వార్తకు వచ్చినంత ప్రాధాన్యం అగ్రవర్ణాల మహిళలు మానభంగానికి గురైనప్పుడు రాకపోవడానికి కారణం ఇదే. ఇలాంటి సంఘటనలను కుల మతాలనుంచి విడగొడితే ఉద్రిక్తతలు తగ్గుతాయి. అప్పుడు హేయమైన ఆ సంఘటనమీద ఎక్కువ దృష్టి కేంద్రీకరించడానికి వీలవుతుంది. కాని ఇప్పుడు పత్రికా వార్తల్లో ఆ అవకాశం లేదు. ఎందువల్ల?

ఎందుకంటే ఇప్పుడు పత్రికలకు సత్యాన్వేషణ మీద, సమాజం అధః పతనానికి కారణాలైన అంశాలను వెతికి పట్టుకోవడం మీద శ్రద్ధలేదు. ఉన్న శ్రద్ధల్లా ఈ అధఃపతనాన్ని కళ్ళకు కట్టినట్టు చిత్రించి నాలుగు కాసులు చేసుకోవడం మీదే.

దీనికి భిన్నంగా ఆలోచించే పత్రికా రచయితలు లేరని కాదు. కాని వారికి దౌర్జన్యకారుల నుంచి ముప్పు ఉంది. ఈ దౌర్జన్యం తీవ్రవాదులది కావచ్చు. శాంతి భద్రత పరిరక్షణ బాధ్యత బుజాన వేసుకుని చట్టాన్ని తమ చేతుల్లోకి తీసుకునే రక్షక భటులది కావచ్చు. నేరుగా ప్రభుత్వానిదే కావచ్చు. ఇలాంటి హింసా ప్రజ్వలనంవల్లే పంజాబ్ కాశ్మీర్లలో తీవ్రవాదుల తూటాను తలుచుకుంటే పత్రికా రచయితల కలంలోని సిరా ఇంకిపోతుంది. ఈ భద్రతా రాహిత్యాన్ని అడ్డుకోకపోతే మన రాష్ట్రంలో కూడ ఇలాంటి పరిస్థితి తప్పదు.

పత్రికా రంగం పరిశ్రమగా మారి పోయినందువల్ల లాభార్జన అనివార్యం అయింది. దీనితో మానింది మందులాగా అమ్మింది పత్రిక అయి కూర్చుంది. ఈ అమ్మకాలకోసం అనారోగ్యకర పోటీ పెరిగిపోయింది. పత్రికా రచయితలు అటు రాజకీయ నాయకుల చదరంగంలోనూ, ఇటు పత్రికాధిపతుల చేతిలోనూ పావులుగా మారిపోతున్నారు.

ఈ సుదీర్ఘచర్చ సారాంశం ఏమిటంటే - రాజకీయ రంగంలోని అనారోగ్యకర పరిణామాల ప్రభావం పత్రికలమీద ఉంది కాని పత్రికా రంగంలోని ఆరోగ్యకర పరిణామాల ప్రభావం రాజకీయ రంగంమీద కనిపించడం లేదు. దీనిలో పత్రికా రచయితల పాత్రను గురించి ఆత్మ పరిశీలన చేసుకోవాల్సిన అవసరం ఉంది. లేకపోతే మరింత పతనం తప్పదు. దానివల్ల నష్టం ప్రతికా రంగానికే కాదు. మొత్తం రాజ్య తంత్రానికే.

# రాజకీయాలు పత్రికలను శాసిస్తున్నాయి

—శ్రీ ఎం.వి.ఆర్. శాస్త్రి

ప్రాత్రికేయులదీ, పొలిటీషియన్లదీ బావ, బావమరదుల వరస అని మా మిత్రు డొకాయన ఛలోక్తిగా అంటారు. పత్రికలవాళ్ళు కట్టుకథలు పుట్టిస్తున్నారని రాజకీయ నాయకులూ, పొలిటీషియన్లు ఫలానా ఫలానా తప్పుడు పనులు చేశారని పత్రికలవాళ్ళూ ఎంత దూషించుకున్నా దైనందిన జీవితంలో ఒకరిని వదిలేసి ఒకరు ఉండలేరు. రాజకీయాలఊసు లేని పత్రిక ఉప్పులేని చప్పిడి! పత్రికాప్రతినిధి లేని రాజకీయసభ చంద్రుడు లేని వెన్నెల! పత్రికలు, రాజకీయాలు అన్యోన్యాశ్రయాలు కాబట్టి వీటి ప్రభావం వాటిమీద, వాటి ప్రభావం వీటిమీద ప్రసరించడం సహజం.

ఒకప్పుడు పత్రికల వ్యాప్తి చాలా తక్కువగా ఉండేది. ప్రధానంగా నగరాలకూ పట్టణాలకూ పత్రికల ప్రాచుర్యం పరిమితమయిఉండేది పల్లెలకూ, కుగ్రామాలకూ అరుదుగా తప్ప పత్రికలు వెళ్ళేవి కావు. ఏ సాయంత్రానికో, మరునాడో, మూడోనాడో ఒకటీ అరా పేపరు ఊళ్ళోకి వస్తే ఆ ఒక్క కాపీనే పదిమందీ చదువుకుని అందులోని వార్తల్నీ, సంపాదకీయాల్నీ రచ్చబండల మీద చర్చించుకునేవారు. సర్క్యులేషను తక్కువైనా పత్రికల రాతలకు రాజకీయనేతలు ఎనలేని విలువ నిచ్చేవారు.

ఇవాళ పత్రికల పరిధి, ప్రాచుర్యం ఊహాతీతంగా పెరిగాయి. అధునాతన సాంకేతిక హంగులు, పోటాపోటీ మార్కెటింగువ్యూహాలు, సంచలనాత్మక రచనావిధానాలు ఇత్యాది అనేక అంశాలవల్ల పత్రికలు చదివే అలవాటు అన్ని ప్రాంతాల్లో, అన్ని వయోవర్గాల్లో, అన్ని రంగాలవారిలో విశేషంగా పెరిగింది.

పెద్ద పత్రిక లనుకున్నవే ముప్పై నలభై వేల సర్క్యులేషన్తో మిడికిన రోజుల్లోనే పత్రికలరాతలు రాజకీయపరిణామాలను ప్రభావితం చేయగలిగి

నప్పుడు సర్క్యులేషను అంతకు మూడింతలు మించిన ఈ రోజుల్లో పత్రికల, రాజకీయాల పరస్పర ప్రభావం విశేషించి పెరిగి ఉండాలి. పెరిగిన మాట నిజమే. ఎటొచ్చీ అది ఎంతవరకు ఆరోగ్యకర మన్నదే ప్రశ్న.

ఒక రాజకీయ పార్టీని ఎన్నికల్లో గెలవనివ్వరాదని ఒక పత్రిక కాంపెయిన్ నడపడమూ, ఒక ముఖ్యమంత్రికి వ్యతిరేకంగా ఒక సంపాదకుడు ధ్వజమెత్తడమూ, గిట్టని పత్రికకు అధికారంలోని రాజకీయనాయకులు అడ్వర్టయిజ్‌మెంట్లను నిలిపి బ్లాక్‌లిస్ట్ చేయడమూ ఆంధ్రదేశానికి కొత్తకాదు. అయితే వెనుకటి రోజులలో రాజకీయాలపై పత్రికల ప్రభావమనేది మొత్తంమీద నైతికంగా, మేధాపరంగానే ఉండేది. ఇటీవలి కాలంలో అది మరీ క్రియాశీలమై బజారు స్థాయికి దిగింది.

తెలుగువాళ్ళు చిరకాలంగా విసిగి వేసారిన రాజకీయపార్టీని ఒక అగ్రశేణి దినపత్రిక పగబట్టినట్టు వెంటాడి, ప్రత్యామ్నాయంగా ఊడిపడ్డ పార్టీని, ఆ పార్టీ లీడరును భుజంమీద వేసుకుని గెలిపించినప్పటినుంచీ తెలుగు పత్రికా రంగంలో ఈ రకమైన పోకడ ప్రబలమైందని చెప్పవచ్చు. వెన్నుపోటురాజకీయాల మూలంగా ప్రజాస్వామ్యబద్ధమైన ప్రభుత్వం కూలిపోయి కుట్రలూ కుహకాలతో కీలుబొమ్మమంత్రివర్గం గద్దెనెక్కిన తరుణంలో మళ్ళీ అదే పత్రిక కిందపడ్డపార్టీకి ఊతయిచ్చి, ప్రజాగ్రహాన్ని ప్రజ్వలింపజేసి చరిత్రగతిని మార్చగలిగింది. పత్రికలశక్తికి ఈ రెండు చారిత్రక సన్నివేశాలూ తిరుగులేని ఋజువులు. అయితే ప్రజాస్వామ్య ప్రస్థానంలో ఏ ఏ ఘట్టాలెతే మైలురాళ్లు అనదగ్గవో సరిగ్గా ఆ సందర్భాల్లోనే తెలుగు పత్రికా ప్రమాణాల అధఃపతనమూ ప్రారంభమైంది.

ఫలానా పార్టీ ప్రజాకంటకమని యావన్మందీ అప్పటికే దృఢనిశ్చయానికి వచ్చిన దశలో ఆ పార్టీ నేతలమీద, వారి చేతలమీదా ఫలానాపత్రిక అదే పనిగా చేసిన దాడులను పాఠకలోకం హర్షించింది. అలాగే ప్రజాస్వామ్య వ్యవస్థకు 1984లో జరిగిన అత్యాచారానికి యావత్ప్రజానీకం ఉద్విగ్నమైన సమయంలో ఆ త్రిమూయిత్యాన్ని ఎదిరిస్తూ అదే పత్రిక రాసిన విద్వేషభరితమైన రాతలనూ సామాన్య పాఠకులు మెచ్చుకున్నారు పత్రిక 'పాలిసీ' ప్రజల అభిమతానికి అనుగుణ్యంగా ఉన్నందుచేత ఆ పత్రిక తనకు కావలసినరీతిలో కొన్ని వాస్తవాలను [illegible]ణచివేసినా, తిమ్మిని బమ్మి చేసినా శీలహననానికి పాల్పడినా జనం అంతగా పట్టించుకోలేదు.

దురదృష్టవశాత్తూ ఇదే పత్రిక 'ఆదర్శాన్ని' కొన్ని ఇతర పత్రికలు కూడా పుణికి పుచ్చుకున్నాయి. పాలక వర్గంతో బాహాబాహీ పోరుకు దిగి, ఫలానా పత్రిక పెద్ద సర్క్యులేషన్ సంపాదించింది కనక, అదే రకమైన పద్ధతులను తామూ అనుసరిస్తే తమ పంట పండుతుందని కొన్ని పత్రికలు భ్రమపడ్డాయి. ప్రభుత్వాల్ని కూల్చడంలో, పార్టీలను పవర్లోకి తేవడంలో పత్రికకున్న శక్తిని గుర్తించి రాజకీయ పార్టీలు, రాజకీయ గ్రూపులు ఒక్కో పత్రికను ప్రత్యక్షంగా, పరోక్షంగా ప్యాట్రనైజ్ చేసి పత్రికా స్వాతంత్ర్యాన్ని తమ చెప్పుచేతల్లోకి తెచ్చుకోబూనడంలో పత్రికారంగం స్వరూపస్వభావాలు మారిపోయాయి. వాస్తవాలను వెలుగులోకి తెచ్చి, ఆయా 'ఇస్యూల' గుణదోషాలను, విభిన్న దృక్పథాలను ప్రజలముందు పెట్టి, ప్రజాభిప్రాయాన్ని నిష్పాక్షికంగా పరిరక్షించాల్సిన పత్రికలు ఇల్లలికే సందడిలో పేరు మరచిపోయిన ఈగలాగా తమ అసలు నైజాన్ని విస్మరించాయి. మరాఠీ దిన పత్రికలు చాలా మటుకు రాజకీయ నాయకుల పెత్తనంలోకి ఇప్పటికే వచ్చాయి. ముఖ్యమంత్రి సోదరుడు ఒక పత్రికను, అసమ్మతినాయకుడు ఒక పత్రికను, కేబినెట్ మంత్రులు ఇంకొన్ని పత్రికలనూ వశపరచుకోవడంతో మరాఠీపత్రికాలోకం రాజకీయరణస్థలంగా మారింది. పార్టీరాజకీయాలకు అతీతంగా ఉండాల్సిన పత్రికలు పార్టీబుజకీర్తులను, రాజకీయపుగంతలను తగిలించుకునే దుష్పరిణామం మన రాష్ట్రంలోనూ మొదలైంది. దీని దుష్ఫలితాలు ఇప్పటికే కొట్టొచ్చినట్టు కనిపిస్తున్నాయి.

ఒకప్పుడు కాశీనాథుని నాగేశ్వరరావు, ప్రకాశం పంతులు, సురవరం ప్రతాపరెడ్డి లాంటి మహామహులు జాతీయోద్యమస్ఫూర్తితో, ప్రజాసేవా కాంక్షతో పత్రికలను పెట్టారు. జాతిపట్ల పరమోత్కృష్టమైన బాధ్యతగా, అసిధారా వ్రతంగా కష్టనష్టాలకు వెరవక ఒత్తిళ్ళకు లొంగక పత్రికలను నిర్వహించారు. నేటి రాజకీయ ప్రముఖులు పత్రికల మీద చల్లని చూపును ప్రసరింపజేస్తున్నది దేశంమీది భక్తితో గాదు. పత్రికారంగంమీద మక్కువతోనూ కాదు. మీడియా చేతుల్లో ఉంటే రాజకీయంగా తమకు గుర్తింపు, ప్రాముఖ్యం పెరుగుతాయన్న ఆశతోటే అమాంబాపతుమనుషులు కూడా పత్రికారంగాన్ని పావనం చేస్తున్నారు. సొంత వ్యాపారాలు నిరాఘాటంగా జరిగేట్టు చేసుకోవడా

నికి, గ్రూపుబలం పెంచుకోవడానికీ, పదవులు అందుకోవడానికీ, ప్రత్యర్థి వర్గాన్ని దెబ్బతీయడానికి పత్రికాశక్తి ఉపకరిస్తుందన్న ఉద్దేశంతోటే కుంభ కోణాల కంట్రాక్టర్లు, సారావ్యాపారులు, ఆఖరికి స్మగ్లర్లు కూడా పత్రికలను పెట్టేందుకూ, తెరవెనకనుంచి పత్రికలను లోబరుచుకునేందుకూ ఉత్సాహంతో ముందుకొచ్చారు. దాంతో రాజకీయ, సామాజిక రంగాల్లోని కల్మషమంతా పత్రికారంగాన్నీ కలుషితం చేసింది. సత్యనిష్ఠ, ప్రజాప్రయోజనాల చింతన, సామాజికస్పృహ వగైరా లక్షణాలు నేటి పత్రికా నిర్వాహకులు చాలా మందిలో కంచుకాగడాతో వెదికినా కానరావు. కాంగ్రెసులో ఈ గ్రూపుది ఒక పేపరు; ఆ కులానిది ఒక పేపరు; తెలుగుదేశం ఇలాకావారిది ఒక పేపరు; కమ్యూనిస్టుల దింకో పేపరు; లిక్కర్ లాబీది మరో పేపరు అని ముద్రలు వేసు కుంటే ఏమవుతుందో, ఎక్కడికి దారితీస్తుందో తెలుసుకోవాలంటే ఈ కాలంలో ఏ రోజు పేపర్లు తిరగేసినా చాలు.

లక్షల సర్క్యులేషను లేకపోతేనేమి-ఒకనాటి ఆంధ్రపత్రికలో పి.వి.ఆర్. శర్మగారు సాధికారికంగా, సమగ్రంగా రాసినవార్తలు రాజకీయ నాయకులకు సైతం కరదీపికగా భాసించేవి. ఆంధ్రప్రభలో నీలంరాజు వెంకట శేషయ్య గారు, పండితారాధ్యుల నాగేశ్వరరావుగారు, ఆంధ్రజ్యోతిలో నార్ల వెంకటేశ్వర రావుగారు, ఆంధ్రభూమిలో గోరాశాస్త్రిగారు నిర్మొగమాటంగా, నిష్పాక్షికంగా చేసిన సంపాదకీయ వ్యాఖ్యలు రాజకీయ వర్గాల్లోనూ, జనజీవితంలోనూ విలక్షణ ప్రభావం చూపేవి. ఎవరిని తెగడినా, ఎవరిని పొగడినా ఆ సంపాదకులు అంద రికీ ఆదరణీయులు ఎందుకయ్యారంటే వారు ప్రత్యేకంగా ఒక పార్టీని ఆకాశాని కెత్తాలనో, ఒక కులాన్ని ప్రమోట్ చేయాలనో కలం పట్టలేదు. రాజకీయ నాయకులు సలహాకోసం వారివద్దకు వెళ్ళారే తప్ప ఈ రోజుల్లో కొందరు సంపా దక మహోదయులవలె రాజకీయనాయకుల ప్రాపకానికి వారు వెంపర్లాడలేదు. అలాగే వెనుకటి రోజుల్లో పత్రికల యజమానులకు రాజకీయ లంపటాలు, ఇత రేతర స్వార్థాలకు పత్రికను వాడుకోవాలన్న దురుద్దేశాలూ అంతగా ఉండేవి కావు. అందుకే పత్రికా సంపాదకులు నమ్మిన నిజాన్ని నిర్భయంగా, నిష్క ర్షగా రాయగలిగేవారు.

ఇవాళ్టి పరిస్థితి వేరు. గతంలో పత్రికలు రాజకీయాలను ప్రభావితం చెయ్యగా ఈనాడు రాజకీయాలు చాలా పత్రికలను శాసిస్తున్నాయి. ఒక పత్రిక

ఏమి చూస్తుంది, ఏమి రాస్తుంది అనేవి కట్టెదుటి వాస్తవాలనుబట్టిగాక, ఆ పత్రిక యజమాని ఏ పార్టీ వాడు, ఏ రాజకీయ వర్గాల కొమ్ము గాస్తాడు, ఆయన ఏ కులంవాడు, తెరవెనక నుంచి ఆ పత్రికను చెప్పుచేతుల్లో ఉంచుకున్న వారిది ఏ పార్టీ, ఏ గ్రూపు, ఏ కులం, ఆ పత్రిక సంపాదకుడికి ఎవరితో మొగమాటం, ఎవరంటే ద్వేషం వగైరా వగైరా అంశాలను బట్టి నిర్ణయమయ్యే దిక్కుమాలిన రోజులు అనేక పత్రికల్లో దాపురించాయి.

ఒకప్పుడు పత్రికలో వచ్చిన వార్తలను రాజకీయవాదులు చదివి ఎక్కడ నలుగురుకూడినా చర్చించుకునేవారు. ఇప్పుడు ఎమ్మెల్యేక్వార్టర్స్‌లో, అసెంబ్లీ లాబీల్లో, గాంధీభవన్లో, ప్రతిపక్షవర్గాల్లో చెప్పుకునే కబుర్లు, వినవచ్చే పోచుకోలు పుకార్లు కూడా మరునాడు పత్రికావార్తలుగా గౌరవనీయ రూపం సంతరించుకుంటున్నాయి. మునుపు పత్రికల్లో వచ్చిన పరిశోధకవార్తలపై అసెంబ్లీ లోపలా వెలుపలా దుమారం రేగేది. ఇప్పుడు ముఠా ప్రయోజనాలను ఆశించి, రాజకీయకక్షలను కడుపులో పెట్టుకుని, ఎదుటి పక్షాన్ని దెబ్బతీసేందుకు రాజకీయ నాయకులు పనిగట్టుకుని పొక్కించే సమాచారమే కొన్ని పత్రికల్లో ఇన్వెస్టిగేటివ్ జర్నలిజంగా, ఎక్స్‌క్లూజివ్ న్యూసులుగా చలామణీ అవుతున్నవి. రాజకీయరొచ్చు యావత్తూ పత్రికలకెక్కి పాఠక జనానికి కంపు గొడుతున్నది. ఈ రొచ్చు ఇదివరకూ ఉన్నదే. అయితే పత్రికలు రాజకీయ దుర్భాషలను వడపోసి సభ్యతాయుతంగా వార్తలను రాసేవి. ఇప్పుడు రాజకీయ వాదులు కూసింది కూసినట్టు, కక్కింది కక్కినట్టు పత్రికల్లో వస్తున్నది. పారిశ్రామిక, జల, వాయు కాలుష్యాల్లాగే పత్రికల్లో రాజకీయ కాలుష్యమూ ప్రజాజీవనానికి హాని చేస్తోంది.

సంపాదకు డనేవాడు ఒకప్పుడు పత్రికకు గుండెకాయ. ఇప్పుడు ఆరో వేలు. కొన్ని పత్రికలకు సంపాదకులే లేరు. ప్రొప్రయిటర్లే ఎడిటర్లు - శకారులూ పైరవీకారులూ అంగుష్ఠమాత్రులూ కొన్ని పత్రికల భాగ్యవిధాతలు. ఎడిటరనే పదార్థవిశేషం అంతరించిపోకుండా మిగిలిన పత్రికలన్నిటిలోనైనా సంపాదకుడికి నిర్నిబంధ స్వేచ్ఛ ఉందని చెప్పలేము. సంపాదకు డొకరు, ఏ వార్తను ఎలా మలచాలో, ఎలా చెరచాలో, ఎడిటోరియల్‌లో ఏ విషయాన్ని ఎలా రాయాలో నిర్ణయించేది యింకొకరు. ఆ 'ఇంకొకరు' రాజకీయ రాగ ద్వేష పూరితులైనప్పుడు పత్రికారంగంలో రాజకీయాలప్రభావానికి ఏమికొదవ?

కొన్ని పత్రికల తీరుతెన్నులనూ, పత్రికారంగంలో అవి తెచ్చిపెట్టిన అనారోగ్యకర ధోరణులనూ, వాటి దుష్ఫలితాలనూ చూస్తే బాధ కలగడం సహజమే. అలాగని తెలుగుపత్రికారంగం యావత్తూ రాజకీయచీడ పట్టి చెడిపోయిందని నిస్పృహ చెందాల్సిన అవసరం లేదు. చిమ్మచీకటిలో చిరుదివ్వె వలె ఉత్తమ సంప్రదాయాలను నేటికీ కొనసాగిస్తున్న పత్రికా నిర్వాహకులు, అంతరాత్మను అమ్ముకోకుండా ధైర్యంగా విద్యుక్తధర్మం నిర్వహిస్తున్న సంపాదకులు కొందరైనా ఉన్నారు. అయితే పక్షపాతరాజకీయాల రాక్షస కోలాహలంలో వారి ప్రభావం, ప్రాచుర్యం పరిమితమయ్యాయి. నీతికి నిలబడి, వృత్తిధర్మానికి నిబద్ధమైన పత్రికలవారిసంఖ్య ఇతోధికంగా పెరిగి సమాజంలో కొత్త వెలుగులు నింపాలనే అందరి కోరిక. ఇది నెరవేరేంతవరకూ - పత్రికలు రాజకీయాల్ని చెడగొట్టాయా, రాజకీయాలు పత్రికలను పాడు చేశాయా అన్నది శేషప్రశ్న.

# రాష్ట్రంలో ఉన్నత విద్యారంగం – రాజకీయాలు పత్రికలు–పరస్పర ప్రభావం

—శ్రీ ఎ. రాంమోహన్ రావు

పత్రికల, రాజకీయాల పరస్పర ప్రభావం వల్ల తీవ్ర పరిణామానికి లోనవుతూ వున్న రంగాల్లో ఉన్నతవిద్యారంగం ముఖ్యమయింది. పాఠశాల విద్య వలె విస్తారమయిన విభాగం కాకపోవటం, మేధావులకు, పలుకుబడిగలిగిన వారికి కేంద్రమవడంతోపాటు తమకుకూడాసన్ని హితమయినందున ఈ రంగానికి సంబంధించిన లోటుపాట్లనుగూర్చి పత్రికలు నిరంతరం ప్రతిస్పందిస్తూ వచ్చాయి. ఉన్నత విద్యారంగంపైన, తద్వారా సమాజానికి మార్గదర్శకులైన మేధావులపైన, తమ పలుకుబడిని పెంచుకొనేందుకు, తమ పాలనాకాలానికి శాశ్వత గుర్తులుగా మిగిల్చేందుకు రాజకీయవేత్తలు ఉన్నత విద్యారంగంలో మార్పులు చేయటానికి, కొత్త సంస్థలు ప్రారంభించటానికి కృషి చేస్తూవచ్చారు. దీనిలో భాగంగానే వారు పత్రికలలో ఉన్నత విద్యారంగానికి సంబంధించి వచ్చే వార్తలు - వ్యాసాలు-సంపాదకీయాలలోని సూచనలు-విమర్శలకు ప్రాధాన్యత నిచ్చి ప్రతిస్పందిస్తున్నారు. అయితే నిర్ణయాలు తీసుకొనే సమయంలో, మార్పులు చేసేటపుడు మాత్రం చాలా సందర్భాలలో అధికారంలోవున్న పార్టీ, వారి మద్దత్తుదార్ల ప్రయోజనాల పరిరక్షణే ప్రాధాన్యత పొందుతూ వస్తున్నది. లేదా 'నూతన విషయాలను ఆచరించటంలో అగ్రగాములం' అన్న కీర్తిని పొందేందుకుగాను జాతీయస్థాయి కమిటీల సిఫార్సులకు హడావుడిగా అన్ని రాష్ట్రాల కన్నముందే ఆమోదించి అరకొరగా అమలుచేస్తూ గందరగోళం సృష్టిస్తున్నారు. దీనివల్ల గడిచిన నలభై సంవత్సరాల కాలంలో రాష్ట్ర ఉన్నత విద్యారంగంలో జరిగిన ప్రధాన మార్పులను ఒకసారి పరిశీలిస్తే ఒక ప్రభుత్వం చేసిన నిర్ణయాలను తదుపరిప్రభుత్వం తిరుగదోడటం, ఒక ప్రభుత్వం నూతన సంస్థను ఏర్పాటు చేసి తన పాలనాకాలానికి గుర్తుగా నిలపదలిస్తే మరో ప్రభుత్వం

అదేబాటలో నడిచి మరో సంస్థను స్థాపించటం కనిపిస్తుంది. ఇందుకోసం అదనంగా కోట్లాది రూపాయలు వెచ్చించటంతోపాటు ప్రాధాన్యతక్రమాల్ని త్రోసిరాజని కూడా వ్యవహరించటం కూడా జరిగింది.

స్వాతంత్ర్యానంతరం మొదటి పది సంవత్సరాలు కొద్ది మార్పులతో బ్రిటిష్‌వారు వదలివెళ్ళిన ఉన్నత విద్యావిధానాన్నే మనరాష్ట్రమూ అనుసరించింది. అయితే తదుపరి జాతీయస్థాయిలో రాధాకృష్ణన్ కమీషన్, మొదలియార్ కమీషన్, కొఠారి కమీషన్ రిపోర్టులను ఆధారం చేసుకొని అన్ని రాష్ట్రాల కంటే ముందు భారీ మార్పులు తీసుకొచ్చారు. ఒక ప్రభుత్వం కులపతి (వైస్ ఛాన్సలర్) పదవీకాలాన్ని ఐదేళ్ళనుంచి మూడు సం॥కు తగ్గించి కోర్టుకెళ్ళి అభాసుపాలైతే మరో ప్రభుత్వం కులపతి వయఃపరిమితిని 65 సం॥ నుంచి 60 సం॥కు తగ్గించి అదే విధమయిన అనుభవాన్ని పొందింది. ఒక ప్రభుత్వం ఇంటర్ బోర్డును తెలుగు అకాడమీని సృష్టిస్తే మరో ప్రభుత్వం కాలేజి సర్వీస్ కమీషన్‌ను రాష్ట్ర ఉన్నత విద్యామండలి (స్టేట్ కౌన్సిల్ ఫర్ హయ్యర్ ఎడ్యుకేషన్) ను స్థాపించింది. ఒకరు విద్యాశాఖను అనేక విభాగాలుగా చీల్చి ప్రతి దానికో డైరెక్టర్ పదవిని సృష్టిస్తే, వేరొకరు విశ్వవిద్యాలయంలో ఒక్క రిజిస్ట్రార్ చాల దన్నట్టు అదే హోదాతో అనేకమంది 'డీన్స్' పదవులను ప్రవేశపెట్టింది. ఒకరు విశ్వవిద్యాలయాలపైన ఆర్థిక ఆంక్షలు విధిస్తే ఇంకొకరు అసలు విశ్వవిద్యాలయాలలో ఉద్యోగాలను భర్తీ చేయవద్దని నిబంధనలు పెట్టారు. ఒక ప్రభుత్వం విశ్వవిద్యాలయాలలోని సిండికేట్లను ఎగ్జిక్యూటివ్ కౌన్సిళ్ళుగా నామకరణం చేస్తే తదుపరి ప్రభుత్వం వాటిని మేనేజ్‌మెంట్ బోర్డ్స్‌గా మార్చివేసింది. ఇలా మార్పులు చేర్పులు చేయటంలో అధికారంలోకి వచ్చిన పార్టీలు, పార్టీలోని వేర్వేరు గ్రూపులు తమ అభీష్టానికి అనుగుణంగా వ్యవహరిస్తూ వచ్చినప్పటికీ అంతకుముందు అమల్లో వున్న విధానంలోని లోటుపాట్లను గూర్చి పత్రికల్లో వచ్చిన విమర్శలను పూర్వరంగంగా పేర్కొని మార్పులను ప్రతిపాదించాయి. విశ్వవిద్యాలయాల పాలనకు సంబంధించి జరిపిన మార్పుల్లో ఈ విషయం కొట్టొచ్చినట్టు కనిపిస్తుంది. మొదట సెనేట్ - సిండికేట్ ఏర్పాటు, ప్రజాస్వామ్యబద్ధంగా కులపతి (వి.సి.) ఎన్నిక జరిగేవి. ఏభై నుంచి వందమంది సభ్యులుండే సెనేట్‌లో ప్రొఫెసర్స్, అనుబంధ కళాశాలల ప్రిన్సిపాళ్ళతోపాటు విశ్వవిద్యాలయ పరిధిలోని ఓల్డ్

గ్రాడ్యుయేట్స్ తమ ప్రతినిధులుగా ఎన్నుకొన్న పదిహేనుమంది కూడ ప్రతి నిధులుగా వుండేవారు. ఏటా రెండుసార్లు జరిగే ఈ సమావేశాలు తరచు వివిధ గ్రూపుల - వర్గాల బలాబలాల ప్రదర్శనవేదికలయ్యేవి. ఈ సమా వేశాలలో విసి ఎన్నికజరిపే సయమంలో పరిస్థితి మరింత రాజకీయమయి విశ్వవిద్యాలయం రాజకీయరణరంగంగా కనిపించేది. ఈ సమావేశాలకు సంబంధించిన తగాదాలు - విభేధాలు తదితర అంశాలు అన్ని పత్రికల్లో వార్తలుగా వచ్చేవి. ఉన్నత విద్యా కేంద్రాలలో రాజకీయ రగడలను గూర్చి పత్రికల సంపాదకీయాల్లో ఆందోళన వ్యక్తమయ్యేది. విశ్వ విద్యాలయాల పరిధిలో అనుబంధ కళాశాలల సంఖ్య — విద్యార్థుల సంఖ్య ఏటేటా పెరిగిపోతుండటంతో సెనేట్‌కు తమ ప్రతినిధులను ఎన్నుకోవలసిన ఓల్డు స్టూడెంట్స్ సంఖ్య కూడా అపారంగా పెరిగింది. దీంతో ఈ ఎన్నికల నిర్వహణ శాసనసభస్థానాల ఎన్నికలకు ధీటుగా తయారయి యూనివర్శిటీ సిబ్బందిపై పెద్దభారంగా రూపొందింది. ఈ ఇబ్బందులు, సమస్యలు, వీటిలోని రాజకీయాలను గూర్చి పత్రికల్లో అనేక వార్తలొచ్చాయి. సెనేట్ సమావేశం లోనే విశ్వవిద్యాలయ వి. సి. ఎన్నికయి రావాల్సి వుండటంచేత పదవిని చేపట్టిన తరువాత ఆయనపై ఒత్తిళ్ళు పెరుగుతున్న విషయంగా పత్రికలలో ప్రతిఫలించింది. దీనికితోడు విద్యారంగంలో యిపుడు, నిజాయితీ పరులైన విద్యావేత్తలు వి. సి. పదవికి పోటీ చేసేందుకు ఆసక్తి కనబరచకపోవచ్చు నన్న అభిప్రాయం కూడ వ్యక్తమయ్యింది. ఈ విషయాలన్నింటినీ ప్రస్తావిస్తూ 1960 తరువాత 'విశ్వవిద్యాలయాలలో అనవసర రాజకీయాలకు తావులేకుండా విద్యావేత్తలకే అప్పగించేందుకు' గాను వి. సి. నియామకం (నామినేషన్) బాధ్యతను ప్రభుత్వము చేపట్టింది. అయితే మొదట విద్యావేత్తలకే పరిమిత మయినా క్రమంగా పదవీ విరమణచేసి ప్రభుత్వానికి సన్ని హితులైన ప్రభుత్వ ఉన్నతాధికారులు — న్యాయమూర్తులను నామినేట్ చేయటం ప్రారంభించారు. దీంతో విశ్వవిద్యాలయాల కులపతి పదవి మొత్తం మీద రాజకీయ నియామకంగా తయారయ్యింది. 1975 - '76లో విశ్వవిద్యాలయ సంస్థల్లో నామినేటెడ్ సభ్యులే వుండాలని కూడ నిర్ణయించారు. దీనిద్వారా ప్రభుత్వానికి యిష్టమయిన వాళ్ళనే విశ్వవిద్యాలయ సంస్థల్లో సభ్యులుగా వేయటమే కాకుండా, ప్రతి విశ్వవిద్యాలయానికి కనీసం ఒక పార్ల

మెంట్ సభ్యుడిని, ఒక శాసన సభ్యుడిని నామినేట్ చేశారు. ఈ నామినేషన్లవల్ల విశ్వవిద్యాలయాల్లో రాజకీయాలు పెచ్చు పెరిగిపోయాయి. ఇందుకు సంబంధించి వార్తలు - వాఖ్యలు-విమర్శలు పత్రికల్లో చోటు చేసుకున్నాయి. దాంతో 1978లో విశ్వవిద్యాలయ సంస్థలకు మళ్ళీ ఎన్నికలు జరిపించారు. విశ్వవిద్యాలయ సంస్థలకు ఎన్నికలను తప్పనిసరిచేస్తూ 1982 చట్టాన్ని సవరించినా అమలు చేయలేకపోయారు. ఎలక్టొరల్ రోల్స్ తయారు చేయటానికే తొమ్మిది నెలలు పట్టింది. 1983లో తొలిసారిగా నూతన పార్టీ అధికారంలోకి వచ్చాక ఒక ఏడాది అదే పరిస్థితి కొనసాగించి, 1984లో విశ్వవిద్యాలయ చట్టానికి చేయాల్సిన సవరణలను సూచించేందుకు శ్రీ ఆదిశేషయ్య నేతృత్వంలో ఒక కమిటీ వేసింది. అయితే ఆయన దాన్ని చేపట్టలేదు. కార్యదర్శి శ్రీ డి. ఆదినారాయణ, సభ్యులు ఆచార్య రామకృష్ణారావు-ఆచార్య నవనీతరావు ఈ బాధ్యతను స్వీకరించారు. విశ్వవిద్యాలయగ్రాంట్ల సంఘం కార్యదర్శి మాధురీషా విశ్వవిద్యాలయాలలో ఎన్నికలు అనవసరమంటూ చేసిన సిఫార్సును ఉటంకిస్తూ రాష్ట్ర కమిటీ కూడా యూనివర్సిటీల్లో ఎన్నికలు రద్దుచేయాల్సిందిగా ప్రభుత్వానికి సూచించింది. విశ్వవిద్యాలయాలకు రాజకీయనాయకులను ప్రభుత్వ అధికారులను కాకుండ కేవలం విద్యావేత్తలనే నామినేట్ చేయాలన్న ఈ వాదనకు పత్రికారంగంనుంచి కూడ మంచి మద్దతు లభించింది. ఈ ఊపుతో ఇటీవలి రాష్ట్ర చరిత్రలో తొలిసారిగా రాష్ట్రంలోని అన్ని విశ్వవిద్యాలయాలకు విద్యావేత్తలే కులపతులుగ నియమితులయ్యారు. విద్యారంగంతో సంబంధంలేనివారు, రాజకీయనాయకు లెవ్వరినీ విశ్వవిద్యాలయాలకు నామినేట్ చేయలేదు. ఈ విధంగా మార్పులు చేర్పులు జరుపుతుండటంలో అధికార పార్టీ ఏదైనా ప్రధానంగా తన అభీష్టానికి అనుగుణంగానే వ్యవహరిస్తూ వచ్చింది. అయితే అదే సమయంలో ఉన్నత విద్యారంగానికి సంబంధించి పత్రికల ప్రతిస్పందన ఆయా ప్రభుత్వాల నిర్ణయాన్ని కొంతమేరకయినా ప్రభావితం చేసింది. వి.సి.ల నియామకంలో ఇటీవల జరిగిన విపరీత జాప్యంగూర్చి వార్తలనేకం రావటంతో ప్రభుత్వం ఒకేసారి పలు వి.సి. సర్చ్ కమిటీలను ఏర్పాటు చేసి కొన్ని నియామకాలు పూర్తి చేసింది. అదేవిధంగా విశ్వవిద్యాలయాల వ్యవహారాలకు సంబంధించి వివిధ పత్రికల స్థానిక ఎడిషన్లలో 'కాంపస్ కాలం' క్రింద వచ్చే వార్తలను, విశేషాలను ప్రభుత్వం సమాచార పౌరసంబంధాలశాఖ ద్వారా

ఎప్పటికప్పుడు సేకరించి విశ్లేషిస్తున్నది. ఆ విశ్వవిద్యాలయానికి సంబంధించిన నిర్ణయాలు తీసుకొనే సమయంలో వీటి ప్రభావం తప్పనిసరిగా వుంటూనే వుంది. ఉన్నత విద్యారంగానికి సంబంధించి ప్రభుత్వం తీసుకొనే నిర్ణయాలు జాప్యం చేస్తున్న నిర్ణయాలను గూర్చి పత్రికలు ఎప్పటికప్పుడు ప్రతిస్పందిస్తూనే వున్నాయి. వివిధ విశ్వవిద్యాలయాలు-వాటిలో భాగాలయిన విభాగాలకు సంబంధించి ఇటీవల ఈనాడులో, ఆంధ్రప్రభలో సీరీస్‌గా వచ్చిన వార్తలు తాజా ఉదాహరణ.

# జర్నలిస్టుల్లో ఆత్మవిమర్శ అవసరం

## —శ్రీ దాసు కేశవరావు

తమ సంస్థ రజతోత్సవ సందర్భంగా "పత్రికలు, రాజకీయాలు-పరస్పర ప్రభావం"అనే అంశంపై చర్చలో పాల్గొనే అవకాశమిచ్చినందుకు యువభారతి నిర్వాహకులకు నా కృతజ్ఞతలు.

గత **15** సం॥లుగా "ది హిందూ" దిన పత్రికకు, అంతకు ముందు మరో ఏడేళ్ళు "ఇండియన్ ఎక్స్‌ప్రెస్", "డెక్కన్ క్రానికల్" మొదలైన ఇంగ్లీషు పత్రికలలో పనిచేసిన నాకు, తెనుగు రచనలో ప్రవేశం అంతంత మాత్రమే. **1969** నుంచి **1975** వరకు ఆకాశవాణిలో "శాసనసభ సమీక్ష", క్రీడారంగం వార్తలు మినహా, తెనుగు రచనలో చాలాకాలం తర్వాత చేసిన ఈ సాహసాన్ని సహృదయతతో స్వీకరిస్తారని, తప్పులుంటే క్షమిస్తారని ఆశిస్తున్నాను.]

పత్రికలు, రాజకీయాలు - పరస్పర ప్రభావం : నా అవగాహన (**Perception**), స్పందన (**Reaction**) ఏమిటంటే : ఒక జర్నలిస్టుగా రాజకీయాలుకానీ, రాజకీయవేత్తలు కానీ నన్ను ప్రభావితం చేయలేదు. నేను ఏనాడైనా ఆ రెంటికీ ఆమడ దూరమే.

అయితే వృత్తిరీత్యా మడికట్టుకోలేం కదా. అందుకని నా సంబంధాలు కేవలం పత్రికా గోష్ఠులు, సదస్సులు, ప్రారంభోత్సవాలు, బహిరంగసభలు, ఎన్నికల ప్రచారాలకు మాత్రమే పరిమితం చేసుకున్నాను.

ఈనాడు రాజకీయాల ప్రభావం పత్రికా రచయితలపై, తద్వారా వారి రచనలపై ప్రస్ఫుటంగా కన్పిస్తున్నది ఈ ప్రవృత్తి హద్దులు దాటి, శ్రుతి మించి రాగానపడుతున్నదా అనే భయం కూడా కలుగుతున్నది. అందుకేనేమో ఫలానా మనిషి, ఫలానాపత్రికకు చెందినవాడని తెలిసినంతనే సగటు పాఠకుడు కూడా "ఓహో మనది తెలుగుదేశం అన్నమాట" అనో, లేదా "మీరు కాంగ్రెసుకు "pro" అన్నమాట అనో అంటున్నాడు. ఈ ధోరణి ఈనాడు ఎంత ముదిరిందంటే పత్రికారంగం ఐక్యతకే విఘాతం కలిగే ప్రమాద

మేర్పడింది. రాజకీయాల పుణ్యమా అని కులాలపేరిట, పార్టీలపేరిట జర్న లిస్టులు చీలిపోతున్నారు, ఒకటవుతున్నారు.

జర్నలిస్టుల ప్రథమకర్తవ్యం-Objectivity,నిష్పక్షపాతవైఖరి. దీనిని పక్కకునెట్టి ఈ పార్టీకో, ఆ పార్టీకో వత్తాసు పలుకుతున్నారు. నాయకులతో వృత్తి అవసరాలకు మించిన సాన్నిహిత్యం పెంచుకుంటే Objectivity, neutrality వంటి profesional norms, వృత్తి నియమాలకు తిలోద కాలే మరి.

నా ఉద్దేశంలో రాజకీయ ప్రభావం కంటే మరింత ప్రమాదకర ధోరణి మరొకటి ఉంది. దాన్ని గురించి మీ దృష్టికి తీసుకువస్తాను.

పత్రికారంగంలో కాకలు తీరిన ఎడిటర్లు, Columnists నుంచి నిన్న కాక మొన్న చేరిన "Cub reporters" కూడా వృత్తికి సంబంధించిన వేదాలు కొన్ని వల్లిస్తూంటారు. "పత్రికా స్వేచ్ఛ", "Freedom of the Press" "Press-watchdog of Democracy", "Press - the Fourth Estate", "Pen is mightier than the Sword" వగైరా.

అందర్లో తప్పులు ఎత్తిచూపే మనకు కూడా నీతి, నియమావళి అవసర మని గుర్తించినా, పాటించేవారు ఎంతమంది? అందుకే మరి వారి రచనల్లో accountability (జవాబుదారి) అనేది కొరవడింది. బాధ్యతగల పత్రికల్లో కూడా బాధ్యతారహితమైన రచనలు చూస్తున్నాం ఈనాడు.

ఈ ధోరణిని అరికట్టాలి. పత్రికా స్వేచ్ఛ అనేదానిలో నేనెవ్వరికీ తీసి పోలేదు. అయితే పురుషులలో పుణ్యపురుషులు జర్నలిస్టులు అంటే అది సమంజసం కాదంటాను. సమాజంలో మనమూ భాగమే. మన వృత్తి ఏమిటో వాటి నీతి, నియమావళి, ప్రవర్తనాసరళి ఏమిటో రాజకీయ నాయకులు, మంత్రులు బోధించనవసరంలేదు. మనకు తెలియనివి కావు. పాటిస్తే చాలు.

దేశంలో కానీ, అంతర్జాతీయంగా కానీ పత్రికా రంగంలో పరిస్థితి ఒక సారి చూద్దాం. అంటే గత 25 ఏళ్ళుగా. పత్రికలకు సంబంధించి కొన్ని శాసనాలు, నిబంధనలున్నాయి. ఉదాహరణకు Defamation Bill, Libel, Sedition, Official Secrets Act, Press Objectionable matters Act. వీటిమేరకు చాలావరకు పత్రికలు జాగ్రత్తపడినా,

మరికొన్ని పత్రికలు కొన్ని చర్యలకు పాల్పడుతున్నాయి. ఈ చర్యలు చట్ట రీత్యా నేరాలు కాకపోయినా, నైతికంగా ఏవిధంగాను సమర్థనీయం కానివి.

ఇటీవలే Press Council రక్షణ, భద్రతగురించి రాసేటప్పుడు వాస్తవాలను నిర్ధారించుకోకుండా (Verification) ప్రచురించవద్దని పత్రికలకు సూచించింది. ఒక వార్త నిజానిజాలు తెలుసుకోకుండా దానిపై వ్యాఖ్యానించినందుకు ప్రముఖ జర్నలిస్టు అరుణ్ శౌరిని Press Council వారు మందలించారు. మరో ప్రముఖుడు, ప్రితీష్‌నందీని సభకు పిలిపించి మందలించాలని తమిళనాడు శాసనసభ నిర్ణయించింది. అప్పటి ఒరిస్సా ముఖ్యమంత్రి J.B. పట్నాయక్‌పై చేసిన కొన్ని ఆరోపణలకు, ప్రితీష్ నందీ అధ్వర్యంలోని Illustrated Weekly of India నలుగురిలో తప్పు ఒప్పుకొని, క్షమాపణ చెప్పాల్సివచ్చింది.

మేం పత్రికల వాళ్ళం చాలా సున్నితం విసిరేవి బాణాలు, బల్లాలైనా, వారు తిరిగి "సూది" విసిరినా తట్టుకోలేం. చాలా thin-skinned. తప్పులు సాధారణంగా ఒప్పుకోం. ఏమంటే పత్రికాస్వేచ్ఛ అంటాం. సవరణలు వివరణలు వేసుకున్నా ఎక్కడో ఏ మూలో. అందుకే మొదట్లోనే జాగ్రత్త మంచిది కదా?

పత్రికా రంగంలో నానాటికీ పోటీ పెరిగి పోతున్నది. మనుగడకోసం అడ్డదార్లైనా తొక్కి ముందుండాలి. అలాంటప్పుడు నిజానిజాల నిర్ధారణకు వ్యవధి ఏది?

తెలిసో, తెలీకో మనం రాసే వార్తలు కొందరికి తీవ్రమైన మనస్తాపం, అపారమైన నష్టం కల్గిస్తాయి. ఈ కోవకు చెందినవే మానభంగాలు, స్త్రీలపై ఇతర అత్యాచారాలకు సంబంధించిన వార్తలు. ఇటీవల నల్గొండజిల్లా చలకుర్తిలో వివాహిత స్త్రీని నడివీధుల్లో నగ్నంగా ఊరేగించారు. ఖమ్మంజిల్లాలోని పాల్వంచలో ఐదుగురు మహిళలు మానభంగానికి గురి అయ్యారు. వారి పేర్లు, ఫోటోలు, ప్రత్యేక interviews ప్రచురించి బాధితులను మరింత బాధకు గురిచేస్తున్నారు. అగ్నికి నీరుబదులు. ఆజ్యం పోస్తున్నామేమో? చివరికి ఒక మంత్రిగారికి కూడా ఈ బాధ తప్పలేదు, శ్రీమతి డా॥ కుతూహలమ్మ, స్త్రీ, శిశుసంక్షేమ మంత్రిపై ఆమె భర్తచేసిన వ్యాఖ్యలు అన్ని పత్రికలు ప్రచురించాయి. అవి కేవలం వారిద్దరికీ సంబంధించినవే మరి.

ఉద్దేశం మంచిదైనా, కొన్ని సార్లు వార్తలు చెప్పలేని రాద్ధాంతానికి దారి తీస్తాయి. ఉదాహరణకు నాలుగు సం॥ల క్రితం ఒక తెలుగు పత్రికలో ఆదిలాబాద్ జిల్లా ఉట్నూరు నుంచి ఒక వార్త వచ్చింది. ఆ ప్రాంతంలోని ఒక బాలికల హాస్టల్ నుంచి ఓ అమ్మాయి ఓ అబ్బాయితో లేచిపోయిందని. ఇది సృష్టించిన దుమారం ఇంతా అంతా కాదు. అసలుసంగతి ఆ అమ్మాయితమ్ముడు వచ్చి తల్లిదండ్రులు బెంగెట్టుకున్నారు, చూచి వద్దామని ఇంటికి తీసుకువెళ్ళాడు. ఆ సమయంలో Hostel matron లేనందువల్ల (ఉన్నా అనుమతించదేమోనన్న భయంవల్ల) మరో అమ్మాయికి ఈవిషయంచెప్పి వెళ్ళిపోయారు. Communication gap వల్ల సదరుఅమ్మాయి తప్పించుకొని పోయిందని కంగారు పడ్డారు Hostel వారు. అయితే ఆమె తిరిగి వచ్చేసరికి, వార్తల కెక్కనే ఎక్కింది. నిజమని నమ్మిన Matron తీసుకోటానికి నిరాకరించింది. అమ్మాయి మొర వినలేదు. ఉన్నతాధికారుల సూచనమేరకు తీసుకొందామంటే మాపిల్లల్ని వెనక్కి తీసుకుంటామని వారి తలిదండ్రులు బెదిరించారు. మరీ ఘోరం ఏమంటే దిక్కుతోచక ఇంటికి వెళితే కన్నవారే వార్తను నమ్మి పొమ్మన్నారు. అప్పటి Colloctor చొరవతో ఆ అమ్మాయిని మరో Hostelలో గుట్టు చప్పుడు కాకుండా చేర్పించారు.

పాపం, ఆమె గిరిజన బాలిక. వార్త సృష్టించిన అలజడి తెలియదు. Press Council ఉంటుందని అంతకంటే తెలియదు. వచ్చిన సమాచారం ఎంతవరకు నిజం అని ఒక్కసారి చెక్ చేసుకుంటే ఇంత తుఫాను రేగేది కాదు.

ఈనాడు తిండి, పని లేక చస్తున్నారు చేనేత కార్మికులు. కానీ పత్రికారంగంలో వార్తలల్లే "అల్లికార్జున స్వాముల"కు మటుకు గిరాకీ బాగానే ఉంది. Pulitzer Prize అనేది అమెరికాలో పత్రికారంగంలో అత్యున్నత పురస్కారం. ఇంతటి మహాపురస్కారాన్ని ఓ మహిళామణి - Washington Postకు చెందిన Janet Cooke - హాయిగా ఇంట్లో కూర్చుని రాసిన Inveitigative Write-upకు ఇచ్చారు. ఇది బయటబడి, సదరు పురస్కారగ్రహీత ఇబ్బందులలో పడి, దానిని తిరిగి ఇచ్చివేసింది. అటు Prize యొక్క విశిష్టత, ఇటు Washington Post యొక్క పేరు, ప్రఖ్యాతులు గంగలో కలిశాయి. ఇలాంటి ఉదాహరణలు ఇటు మన దేశంలో కానీ, అటు అమెరికా, ఇంగ్లండులాంటి దేశాల్లో కాకొల్లలు. "The News

At Any Cost, How Journalists compromise their ethics to shape the news" అని ఒక పుస్తకమే రాశాడు అమెరికాకు చెందిన TOM GOLDSTEIN. Press Council ముందు ఈ సంవత్సరం కనీసం 400 ఫిర్యాదులున్నాయి. ఇవన్నీ పత్రికలు వృత్తి నియమాలు ఉల్లంఘించినందుకే. కేవలం మందలించే అధికారం తప్ప, వేరే అధికారంCouncil కు లేదు.

పత్రికా రచనలో విలువలు పెరగాలంటే బయటి నుంచి సవరించే వ్యవస్థ మంచిది కాదు. దానిని మనం పత్రికా స్వేచ్ఛలో జోక్యంగా భావిస్తాము. అందుకని జర్నలిస్టుల్లోనే ఆత్మ విమర్శ అవసరం. పత్రికా సంపాదకుల సంస్థ జర్నలిస్టులకు ఓ ప్రవర్తనా నియమావళి రూపొందించినట్లు విన్నా చూసిన దాఖలాలు లేవు.

అయితే యూరపు, అమెరికా, జపాన్‌లలో OMBUDSMAN అనే ఒక వ్యవస్థను పత్రికలలో ప్రవేశపెట్టారు. ఇది మన లోకఅయుక్త వంటిది. పత్రికలో ఒక భాగంగా ఉంటూ అది ఎంతవరకు నియమాలను పాటిస్తున్నది ఎప్పటికప్పుడు కనిపెడుతూ, తగు సలహాలిస్తూంటారు. పాఠకులు ఇతరుల నుండి వచ్చిన ఫిర్యాదులను పరిశీలించి, తగు చర్యలు తీసుకుంటారు. ఆ చర్యలను తిరిగి ఫిర్యాదుదారులకు నివేదిస్తారు.

మన దేశంలో ప్రప్రథమంగా Times of India వారు ఈ వ్యవస్థను సృష్టించి, Supreme Court మాజీ ప్రధాన న్యాయమూర్తి శ్రీ P. N. భగవతిని Ombudsman గా నియమించారు.

దేశంలోని మిగతా పత్రికలు కూడా ఇదే విధంగా చేస్తే వృత్తికి గౌరవ మర్యాదలు చేకూర్చినవా రవుతారు.

# తెలుగు పత్రికలు–మారుతున్న విలువలు

—శ్రీ గోవిందరాజు చక్రధర్

ఒకనాడు పత్రికలలక్ష్యం వేరు. ఈనాటిపత్రికల లక్ష్యం వేరు. స్వాతంత్ర్యాన్ని సాధించాలన్న లక్ష్యం ఆనాటి పత్రికలకు ఉండేది. దేశాభిమానంతో, మాతృభూమి విముక్తికోసం ఎందరో మహానుభావులు పత్రికలను ఆలంబనగా చేసుకొని నిస్వార్థంగా పత్రికా రచనా వ్యాసంగాన్ని సాగించి స్వాతంత్ర్యఉద్యమానికి బాసటగా నిలిచారు. ప్రజలను పత్రికలద్వారా సమాయత్తపరిచారు. ఆనాటి పత్రికల్లోని సంపాదకీయాలు ప్రజలపై ప్రగాఢ ముద్రవేసి కార్యోన్ముఖుల్ని చేసేవి. ఇప్పుడూ పత్రికల్లో సంపాదకీయాలు ఉన్నా అవి స్ఫూర్తిదాయకాలుగా మాత్రం లేవు. ఇవాళ పత్రికాధిపతే ఎడిటర్ చొక్కా వేసుకుని కథ నడిపిస్తున్నాడు. ఇప్పటి పత్రికాధిపతులు ప్రజలను ఉద్ధరించాలనో లేక ఉత్తమ ప్రాతికేయవిలువలకు తమ పత్రికల్లో పట్టం కట్టాలనో పత్రికలు నడపడం లేదన్నది నిష్ఠుర సత్యం. యజమానుల స్వీయ వ్యాపార ప్రయోజనాల పరిరక్షణకు పత్రిక ఒక సాధనంగా మారింది. ఎప్పుడైతే పత్రిక తమ వ్యాపార ప్రయోజనా పరిరక్షణ కవచం అయిందో అప్పుడే పత్రికలు ఉన్నత ప్రమాణాలను గాలికొదిలేసి నేలబారుకు దిగిపోయాయి.

తమ చేతిలోని ఆయుధం పదునుగా ఉన్నంతకాలం తమను తాము పరిరక్షించుకోగలుగుతారు. పత్రిక అనే తమ చేతి ఆయుధం పదునుగా ఉండటమంటే సర్క్యులేషన్ పరంగా సమున్నతంగా ఉండాలి. ఎక్కువ సర్క్యులేషన్ ఉన్న పత్రికాధిపతికే పాలక వర్గాల్లో బార్‌గెయినింగ్ పవర్ ఉంటుందన్నదీ నగ్నసత్యం.

ఈ బార్‌గెయినింగ్ పవర్ కోసం సర్క్యులేషన్ వెంపర్లాట మొదలైంది. దాంతోటే పత్రికల మధ్య పోటీ పెరిగింది. పరుగు పెరిగింది. ఎడిషన్లు విస్తరించాయి. ఆధునిక టెక్నాలజీ ప్రవేశించింది. రంగుల హంగులు వచ్చాయి. ఒకరికి మించి ఒకరు ఎదగాలన్న తపనలో ప్రాంతీయవార్తల జిల్లా స్పెషల్స్,

సిటీస్పెషల్స్ ప్రారంభించారు. ఈ జిల్లా స్పెషల్స్‌లో నోళ్ళు తెరిచిన పేజీలకు మేత వేయటానికి ఊరూరా, పల్లె పల్లెలో, ఇంకా చెప్పాలంటే వీధివీధిలో రిపోర్టర్లను నియమించారు. ఈ విస్తరణ, ఈ పోటీ, ఈ ప్రాంతీయ వార్తల పెరుగుదల మంచికి మార్గం వేస్తే తప్పు పట్టాల్సిందేమీలేదు. గ్రామీణ వార్తల సంఖ్య పెరిగినా వాసి పెరగలేదు. వార్తకు అర్థాలు మారిపోయాయి. విలువలు మారిపోయాయి. రిపోర్టర్లకు వార్తలకోటాలు నిర్దేశిస్తున్నారు. ఎవరెన్ని ఎక్కువ వార్తలు పంపితే అతను అంత మొనగాడు. ఆ వార్త ఓ చోటా నాయకుడి విజ్ఞప్తి కావచ్చు. ఓ బంకు ప్రారంభమే కావచ్చు. అది ఆ రిపోర్టర్ గారి వార్తల సంఖ్యాపరంపరలో అందంగా ఒదిగిపోయి అతగాడి విజయ గర్వానికి కారణం అవుతోంది.

వార్తలు ఎక్కువ పంపమనీ, ఫలానా వార్త ఫలానా పత్రికలో వచ్చింది. మీరు పంపలేదేమని తాఖీదులు పంపే పత్రికా ప్రభువులకు లేదా వారి ప్రతినిధులకు ఆ రిపోర్టర్‌కు వార్త రాసే ఒడుపుల విషయంలో శిక్షణ ఇప్పించాలన్న ఆలోచనే రావడం లేదు. మానవవనరులను ఉపేక్షించడం అనేది ఈనాటి పత్రికల్లోని పెద్ద ట్రాజడీ. లక్షలు, కోట్లు ఖర్చుపెట్టయినా సరే ఏ విదేశాలనుంచో ఆధునిక మిషనరీ తెప్పించుకోవటానికి చూపుతున్న తాపత్రయం తమ పత్రికకు ప్రాణాధారమైన జర్నలిస్టులకు చట్టబద్ధంగా ఇవ్వాల్సిన వేతనాలు చెల్లింపు పట్లో సంక్షేమంపట్లో చూపడం లేదు. తెలుగు పత్రికల్లో జీవంలేని యంత్ర పరికరాల కున్నపాటి విలువ పాత్రికేయులకు లేదని చెప్తే ఎవరూ తప్పు పట్టనక్కరలేదు. ఎ. సి. ఉంటే కానీ కదలనని మొరాయిస్తోంది కంప్యూటర్. మానవ మేధ మాత్రం ఉక్కపోతల మధ్య సెగలు కక్కే రేకు షెడ్లకింద ఉసూరంటోంది. పాత్రికేయ వృత్తి వ్యాసంగం అనేది సృజనతో జతపడిన వ్యవహారమన్న స్పృహ చాలామందికి లేదు. ఓ పత్రికాఫీసులో పని చేసే గుమస్తాకంటే ఆ పత్రికలో పనిచేసే పాత్రికేయుడు ఎందులో అధికుడు అనే వాదనలూ అందుకే వినవస్తున్నాయి. ఓ తల్లి ప్రసవవేదనలానే, ఓ రచయిత మేధో మథనంలానే ఓ జర్నలిస్టు కూడా మంచి శీర్షిక చెక్కటానికి నరాలు చిట్లిపోయేలా ఆలోచిస్తాడన్న వాస్తవాన్ని గుర్తిస్తే అతడిపట్ల సానుభూతి పెరుగుతుంది, సదవగాహన పెరుగుతుంది.

ఆధునిక టెక్నాలజీ రాకతో మానవ వనరుల ప్రాముఖ్యం చావుదెబ్బ తింటోందని చెప్పటానికి ప్రూఫ్ రీడింగ్‌ను ఎత్తివేయడాన్ని చక్కని ఉదా

హరణగా పేర్కొనవచ్చు. ఇప్పుడు తెలుగు పత్రికల్లో అచ్చుకు సిద్ధమైన కాపీలో తప్పులను సరిదిద్దే ప్రూఫ్‌రీడర్లు లేరు. ఒకప్పుడు భాష బాగా తెలిసిన పండితులు కళ్ళు చారడంత చేసుకునితప్పులు శోధించేవారు. ఒకనాటి ప్రూఫ్ రీడర్లు ఇప్పుడు అదేపత్రికల్లో మరేదో సెక్షన్లలో పనిచేస్తున్నారు. వారి ఉపాధికేమీ తక్షణ ప్రమాదం ముంచుకురాలేదు. కానీ ఆ ప్రూఫ్‌రీడర్లు లేని లోటు ఏ పత్రిక తిరగేసినా కొట్టవచ్చినట్లు కన్పిస్తోంది. అచ్చుతప్పులు పెరిగి పోయాయి. జేసీస్ వారోత్సవాలు కాస్తా కంపోజిటర్ పుణ్యమా అని జీసస్ వారోత్సవాలుగా దర్శనమిస్తోంది. ఈ భాషాదోషాలసందర్భంగానే మరో విషయమూ చెప్పాలి. మనకు తెలుగు చదువులు వచ్చినా తెలుగు పాండిత్య మేదీ పెరక్కపోగా రెంటికీ చెడిన రేవడి చందం అయింది. అటు ఇంగ్లీషు ముక్కారాక ఇటు తప్పుల్లేకుండా తెలుగూ రాయలేక మూసపోసుకున్న విద్యార్థి అన్ని వృత్తుల్లో చేరుతున్నట్లే పత్రికల్లోనూ చేరుతున్నాడు. నండూరి రామ మోహనరావు గారన్నట్లు మనం ఇంగ్లీషులో స్పెల్లింగ్‌లను పట్టించుకున్నంత తీవ్రంగానే తెలుగులో భాషాదోషాలను పట్టించుకుంటే భాషావిషయకంగా తెలుగు పత్రికలకు పట్టిన దుర్దశ కొంతవరకైనా తప్పుతుంది.

## యాజమాన్యాల జోక్యం :

పత్రికా యజమానులందరికీ, మన ప్రజాస్వామ్య వ్యవస్థలో పత్రికల పాత్ర గురించిన పూర్తి అవగాహన ఉండచ్చు. ఉండకపోవచ్చు. పత్రికలనేవి సమాజానికి మార్గదర్శి. పత్రికా రచన అనేది రేపాకనాడు చరిత్రగా మిగల నున్న వర్తమాన దర్పణం అనే స్పృహ ఉందో లేదో మనకైతే తెలియదుగానీ స్వీయ వ్యాపారాపేక్ష ఈ ఉన్నత ప్రమాణాలను మాత్రం కప్పిపెడ్తోందన్న విషయం సత్యం. యజమానికి తాను అభిమానించే వ్యక్తులు, వ్యవస్థలు ఉంటాయి. తన ప్రయోజనాలను నెరవేర్చే పాలకవర్గ కూటములుంటాయి. ఈ పాలక వర్గానికి కన్నెర్ర కాకుండా చూసుకుని ఉన్నంతలో ఒడిదుడుకులు లేకుండా సాఫీగా, పత్రికను నడుపుకోవడం మంచిదనే రాజీధోరణి ఇప్పుడు దాదాపు పత్రికాధిపతులందరిలో వచ్చినట్లు కన్పిస్తోంది. ఒకానొక దశలో కుంభకోణాల కూపీలన్నీ లాగి తమ పత్రికల ద్వారా వెలుగులోకి తెచ్చినవారు సైతం ఇప్పుడు మిన్నకుండి పోతున్నారు. ప్రస్తుతం ఏ తెలుగు పత్రికలోనూ

ప్రభుత్వాన్ని ఇబ్బందుల్లో పెట్టే 'అవినీతి కథలు' వెలికి తీయడాలు లేవు. ఈ కథలు వెలికి తీయడం వెతలు కోరి కొని తెచ్చుకోవడమేనని అనుకోబట్టి రంగులు అద్దుకున్న తెలుగు పత్రికలు పరిశోధనా వార్తలకు తవ్వినకొస్త పునాదినీ పూడ్చేశాయి. కొన్ని పత్రికలు చాలామంది పాఠకులు చదవడం మానేసిన సంపాదకీయాల్లో పాలక వర్గాలపై చండ ప్రచండంగా చెలరేగి పోయి వార్తల్లో మాత్రం పక్షపాతాలు చూపిస్తున్నారు. ఇవన్నీ తాము ఏ పక్షాన్నీ భుజానికి ఎత్తుకోలేదని పాఠకులను తెలివిగా మభ్యపెట్టే ఎత్తుగడలే తప్పించి వీటివల్ల ఉన్నత పత్రికా ప్రమాణాల దిశగా ఒరిగేది ఏమీ ఉండదు. ఉన్నమాట నిర్మొగమాటంగా చెప్పుకోవాలంటే మనకు ప్రజల పత్రిక ఒక్కటీ లేదు. ఈ తెలుగు పత్రికలన్నీ పార్టీ పత్రికలే. కాకపోతే ఒకటో అరో పత్రికలు తమది ఫలానా పార్టీపత్రిక అని సగర్వంగా ప్రకటించుకున్నాయి. మిగతావి పైకి ప్రకటించుకోలేదు. అంతే తేడా.

ఇప్పుడు పత్రికలను వేధిస్తోన్న అసలు సమస్య అస్తిత్వం. ఇంటింటికీ టీవీలు విస్తరించేస్తున్నాయి. ఆ టీవీలో రేడియోలో పూటకోసారి గంటకోసారి దేశ విదేశీ వార్తలు చూపిస్తున్నారు. విన్పిస్తున్నారు. టీవీలో క్రికెట్ ప్రత్యక్ష ప్రసారాలు, విద్యార్థులకు పోటీ పరీక్షల తాకిడులు సాధారణ పఠనాభిలాషను దిగజార్చేస్తున్నాయి. మరోప్రక్క న్యూస్‌ప్రింట్ ధరలు ఆకాశాన్నంటుతున్నాయి. మారుతున్న ప్రజల అభిరుచులు, ముంచుకొస్తున్న కొత్త పరిణామాల ముప్పులతో పత్రికాధిపతులు తమ సర్క్యులేషన్లు ఎలా కాపాడుకోవాలా అని వెంపర్లాడుతున్నారు. వార్తలు ఇచ్చి ఆకర్షించ లేమనుకున్నారో ఏమోకానీ సినిమా తారల అర్ధనగ్న రంగుల చిత్రాలతో పాఠకుల కళ్ళను జిగేల్‌మనిపిస్తున్నారు. ఈ పోకడ ఇంకా వెర్రితలలు వేసి పత్రిక మొదటి పేజీలోనే సినిమా బొమ్మలు అచ్చొత్తినా ఆశ్చర్య పోనక్కర్లేదు. ఇవన్నీ చూస్తుంటే తెలుగు వార్తాపత్రికలు హుందాగామెలిగే గృహిణిఅవతారం వదిలేసి ఆకర్షణే ప్రధాన ధ్యేయంగా పౌడర్లు అద్దుకుంటున్నాయేమోననే అనుమానమూ కలుగుతోంది. విలువలపరంగా ఇంతటినిరాశామయపరిస్థితుల్లోనైతం ఓ ఆశాదీపం ఉండనేఉంది. జర్నలిజం అంతఃశక్తికి తిరుగన్నది లేదు. వృత్తికే నిబద్ధులైన జర్నలిస్టుల పాళీలనుంచి జాలువారే ప్రతి సిరా చుక్కా వేగుచుక్కై ప్రభవిస్తుంది.

# పత్రికలు – రచయితలు

—శ్రీ బుర్రా సుబ్రహ్మణ్యం

'పత్రికలు - రచయితలు' అనే అంశం గురించి చెప్పబోయేముందు వాస్తవమే అనిపించే జోక్‌ను ముచ్చటిస్తాను. ఓసారి ఓ పత్రికా ప్రతినిధి నెపోలియన్ బోనపార్టీని" మీరు గొప్ప యోద్ధ కదా! ప్రపంచం మొత్తం మీద నెంబర్‌వన్ అనిపించుకోగల యోద్ధ ఎవరు?" అని ప్రశ్నించాడట. వెంటనే ఏమాత్రం తడుముకోకుండా "బహుశా నెంబర్ టు స్థానం జూలియస్ సీజర్‌కు ఇవ్వొచ్చననుకొంటున్నాను" అని జవాబిచ్చాడట నెపోలియన్.

ఇది అహంభావానికి సంబంధించిన లౌక్యమూ కావచ్చు., తనను తాను గౌరవించుకోలేకపోతే ఇతరులను ఎలా గౌరవించగలుగుతాం అనే ఆత్మాభిమానమూ కావచ్చు. కాని ప్రస్తుతం పత్రికలు - రచయితల ధోరణి నూటికి 99 పాళ్ళు ఇదే పంథాలో ఉందని చెప్పటానికి బాధగానే ఉంది. మిగిలిన ఆ ఒక్క శాతం సహృదయతకు అద్దం పడుతూ సంతోషించాల్సిన విషయం.

ఈ నేపథ్యంలో 'పత్రికలు - రచయితలు' అనే అంశాన్ని చర్చిస్తాను. పత్రిక అంటే వార్తా పత్రిక లేదా వార, పక్ష, మాస, ద్వైమాసిక, త్రైమాసిక తదితర పత్రికలను "A MODERN PRESS HAS A DUAL ASPECT; PRIMARILY, IT IS A MEDIUM OF EXPRESSION AND COMMUNICATION OF INFORMATION AND IDEAS, IT IS ALSO AN INDUSTRIAL AND BUSINESS ESTABLISHMENT" అని నిర్వచించారు.

పత్రికలకు సంబంధించి వ్యాపారాత్మకత గురించి కాక 'జర్నలిజం-రచయితలు' గురించి మాత్రమే ప్రస్తావిస్తాను. ఇకపై 'పత్రికలు' అని పేర్కొన్న ప్రతిచోట 'జర్నలిజం' అనే భావించాల్సిందిగా అభ్యర్థిస్తున్నాను.

పత్రికలకు రచయితలకు గల సంబంధం 'పూవు-తావి'కి గల సంబంధంగా గుర్తించవచ్చు. సువాసనగల పువ్వును అందరూ అభిమానిస్తారు. అలాగే పువ్వు పేరుతో సువాసనకు ఓ ప్రత్యేకత లభిస్తుంది. ఈ పోలిక ముచ్చటించుకోవటం వరకూ బాగానే ఉన్నా వ్యవహారంలో ఈ సయోధ్య ఏ మేరకు ఉన్నదనేదే ప్రస్తుత చర్చనీయాంశం.

పత్రికలు తరచుగా "రచయితలకు సూచనలు" ప్రచురిస్తూంటాయి. నిజానికి ఆ సూచనలు నిబంధనలే. కాని "తెలివైన" రచయితలు ఆ సూచనలు పట్టించుకోరు. ఆ నిబంధనలు వారు తమకు వర్తింప చేసుకోరు. పత్రికలు రచయితలకు సూచనలు ఇచ్చేది వీలయినంత ఎక్కువమందికి అవకాశం ఇవ్వాలనే! అంటే చిన్న చిన్న వ్యాసాలకు, రచనలకు ప్రాధాన్యం ఇవ్వాలని పత్రికల ఉద్దేశం. పలుకుబడిగల రచయితలు మాత్రం తాము రాసినన్ని పేజీలూ అచ్చు అయ్యేవరకూ నిద్రపోరు. మళ్ళీ ఆ రచనలో పత్రికలకు అభ్యంతరకరమైన అంశాలున్నా 'ఎడిట్' చేయకుండా ముందే జాగ్రత్త పడతారు. "నా వ్యాసంలో లేదా "రచనలో ఫలానా అంశం ప్రత్యేకంగా కొత్త తరహాలో రాశాను! దయచేసి దాన్ని తొలగించకండి" అని ముందరి కాళ్ళకు బంధాలు వేస్తారు. ఇలాంటి ఇబ్బందులు అధిగమించటానికే ముందు జాగ్రత్త కోసం కొన్ని పత్రికలు "రచయితల అభిప్రాయాలు పత్రిక అభిప్రాయాలుగా భావించనవసరం లేదు" అని పాఠకులకు విన్నవిస్తూ ఉంటాయి.

కాలం విలువ ఆయా మనుషుల సంస్కృతి, హోదా, స్థాయివంటి కోణాల నుంచి ఆలోచిస్తే ఒక్కొక్క విధంగా ఉంటుంది. కొందరు రచయితలకు పత్రికలలో "కాలం" రాయాలనే ఉబలాటం తప్ప కాలంవిలువ తెలియదు. పైగా చాలామంది రచయితలకు అసలు ఏం రాయాలో తెలియదు. "నేను కూడా ఏదేనా రాయాలనుకొంటున్నాను! ఏం రాయమంటారు?" అంటూ వచ్చి పత్రికలను ఇబ్బంది పెడుతుంటారు. ప్రతి పత్రికకు ఓ ప్రత్యేక లక్షణం ఉంటుంది. నిర్ణీత విధానం ఉంటుంది. మామూలు పరిభాషలో దానినే 'పాలసీ'గా వ్యవహరిస్తారు. ఆ 'పాలసీ' ని అవగాహన చేసుకోవలసిన బాధ్యత రచయితలకు ఉంది. ఏ రచయిత అయినా తాను రాసినది ఏ పత్రిక లక్షణాలకు అనుగుణంగా ఉందో ఆ పత్రికను సంప్రదిస్తే ఆ రచన అచ్చవటానికి అవకాశము ఉంటుంది. అంతేతప్ప ఒక పత్రికలో తనకు తెలిసినవారున్నారు కనుక ఆ

పత్రికలోనే తన రచన అచ్చవ్వాలని తాపత్రయపడటం ఆ పత్రికతో తనకు గల పరిచయాన్ని దుర్వినియోగం చేసుకోవటమే అవుతుంది.

నిజం చెప్పాలంటే పేరున్న రచయితలు, రచయితలుగా స్థిరపడిన వారు పత్రికలతోగల పరిచయాలను, సంబంధ బాంధవ్యాలను ఎక్కువగా దుర్వినియోగం చేసుకొంటారు. అంతేకాదు. వారి అనుచరవర్గం చేత తమ అభిమాన విషయాలనే రాయించి పత్రికలకు సిఫార్సుచేసే ధోరణి సైతం ఇటీవలి కాలంలో పెరిగిపోయింది. "ఇవన్నీ ఆయా పత్రికలు ఎందుకు అచ్చువేయాలి?" అని ఎవరైనా అడగవచ్చు. ఇందుకు సమాధానం రెండు దశలలో ఉంటుంది. ఏ విషయానికి సంబంధించిన రచననైనా పాఠకులలో కొంత శాతం లేదా ఒక వర్గం అభిమానిస్తుంది. ఆ వర్గాన్ని, ఆ పాఠకులను తృప్తిపరచటానికి ఈ కొత్త రచయితల రచనలను పత్రికలు అచ్చువేస్తాయి. అలాగే, కొత్త రచయితలను ప్రోత్సహించాల్సిన బాధ్యత సైతం పత్రికలకు ఉంది.

మాటల సందర్భంలో శ్రీ జి. వి. సుబ్రహ్మణ్యం గారు ఇటీవల కొత్త రచయితల గురించి ప్రస్తావించిన అంశాన్ని ఈ సమయంలో నేను గుర్తుచేసు కొంటున్నాను. "ఇటీవల కొత్త రచయితలు పాత తరం రచయితల్లా ఊక దంపుడు ఉపోద్ఘాతాలు లేకుండా కొత్త ఆలోచనలతో సరాసరి విషయంతో ప్రారంభించి క్లుప్తంగా రచనలను ముగిస్తున్నారు. ఇది చెప్పుకోతగిన పరిణామం" అన్నారు శ్రీ జి. వి. సుబ్రహ్మణ్యంగారు. ఆయన చెప్పినట్టు అలా ఉన్న రచనలకు ఏ సిఫార్సులూ, పరిచయాలూ అక్కరలేదు. విషయ ప్రాధాన్యంవల్ల ఆ రచనలు సహజంగానే అచ్చుకు నోచుకుంటాయి. అలా కాని వాటిగురించే నా బాధ. కొత్త రచయితలను ప్రోత్సహించాలనే పత్రికల బలహీనత కారణంగా కాని, లబ్ధప్రతిష్ఠులైన రచయితలు పరిచయం చేస్తున్నారన్న నమ్మకం కారణంగాకాని, వారి నేతృత్వంలో రూపొందిన రచన కదా అని కాని ఆయా రచనలు అచ్చులో కనిపిస్తూ ఉంటాయి. అన్ని పత్రికలూ ఇలా చేస్తున్నాయని కాదు. కొన్నైనా ఇలా చేస్తున్నాయి. ఆ కారణంగానే రచనల స్థాయి దిగజారుతోంది.

మరోవర్గం రచయితల గురించి కూడా చెప్పుకోవాలి. M.Phil,Ph.D. చేసే రిసెర్చ్ స్కాలర్స్ తాము చేపట్టిన అంశానికి సంబంధించి ఒకటి రెండు రచనలు ముందుగా అచ్చు కావాలనే ఆకాంక్షతో చేసిన రచనలు - వారు

తీర్మానించబోయే విశేషాలు నిర్ధారణ కాకుండానే ఎలా అచ్చువేయాలో పత్రికలకు అర్థంకాని పరిస్థితీ ఉంది. అలా అచ్చయిన రచనలూ ఉన్నాయి. ఆ తరువాత "ఆకులు పట్టుకొన్న" పత్రికలూ ఉన్నాయి. ఇదంతా వేరే కథ.

ఇలా చెప్పుకొంటూపోతే ఎంతసేపైనా ఈ సంబంధ బాంధవ్యాల గురించి ముచ్చటించుకోవచ్చు. అసలు రచయితలలో చాలామందికి తమ రచనను ఎలా Post చేయాలో సైతం తెలియదంటే ఏమంటారు? రచనకు సంబంధించిన కాగితాలు కవరుకు అంటుకుపోయి, ఆ కవరును ఏ వైపునుంచి తెరవాలో తెలియని దుస్థితిలో రచనలు పంపుతారు కొంతమంది. ఆ కవరును ఎలా చింపాలో పరిశోధించేందుకు తగిన సమయం పత్రికల వారికి ఉంటుందా?

ఇంక పత్రికల గురించి కూడా కొన్ని విశేషాలు చెబుతాను. మానవ సహజమైన బలహీనతలవల్ల రచయితలకు చులకనయిన పత్రికలూ ఉన్నాయి. కేవలం పత్రికలకు గల నిబద్ధత, ఔన్నత్యంవల్ల ఆ పత్రికలలో రచనలు ప్రచురితం అయిన కారణంగా ప్రాచుర్యం పొందిన రచయితలూ ఉన్నారు. వ్యక్తిత్వంగల సంపాదకులవల్ల పత్రికలకు పేరు ప్రతిష్ఠలు పెరుగుతాయి. సచ్ఛీలుడైన సంపాదకుడు ఏ ప్రలోభానికీ లొంగడు. పత్రిక పాలసీ మేరకే రచనలు స్వీకరిస్తాడు. అందుకు అనుగుణంగా రాసే రచయితలనే ఆదరిస్తాడు. పేరున్న రచయితల రచనలపై ఆధారపడడు.

ప్రతి పత్రికా తనకంటూ ప్రత్యేకంగా పాఠకులను సృష్టించుకొంటుంది. ఆ ప్రత్యేక పాఠకులకోసం రచనలు అందిస్తుంది. అవసరాన్ని బట్టి అలాంటి రచనలు చేయగల రచయితలను సృష్టించుకొంటుంది. ఇదంతా సంపాదకుని సామర్థ్యంపై అధారపడి ఉంటుంది. సంపాదకుడు సర్వజ్ఞుడు కాకపోయినా తనకు అవసరమైన సమాచారం ఎక్కడ, ఎవరిదగ్గర లభిస్తుందో తెలిసినవాడై ఉంటాడు. అలా కాక, అనేక కారణాలవల్ల ఆయా వ్యక్తులను సంపాదకులుగా నియమించిన పత్రికలూ ఉన్నాయి. అలా నియమితులైన తరవాత విషయ సంగ్రహణం ప్రారంభించిన సంపాదకులూ ఉన్నారు.

ఇప్పుడు మళ్ళీ ఓ జోక్‌లాంటి వాస్తవం చెబుతాను. ఓ ఉప సంపాదకుడు "వింత ప్రపంచం" శీర్షికకు ఓ అంశంరాస్తూ "రాముడు శూర్పణఖ ముక్కూ చెవులూ కోసినట్లు" అని ప్రారంభించాడు. ఆ విభాగాన్ని పర్యవేక్షించే "ఎడిటర్" ఆ చిన్న వ్యాసాన్ని 'ఎడిట్' చేస్తూ కేవలం 'రాముడు' అని

ఉండటం భరించ లేక ఆ పదానికిముందు 'శ్రీ' చేర్చాడు. ఇలాంటి సంపాద కులూ ఉన్నారు మనకు. ఏ కంబోడియా రామాయణంలోనో, జైన రామాయ ణంలోనో శూర్పణఖకు 'శ్రీరాముడు' ముక్కూ, చెవులూ కోసి ఉండవచ్చు. ఆ విషయాన్ని ప్రత్యేకంగా పరిశోధించాలి.

ఎప్పటికైనా ఒక్క విషయం మనం గుర్తుంచుకోవాలి. మంచి పత్రిక అంటే మంచి సంపాదకుడు, మంచి రచనలు, మంచి రచయితలు, మంచి పాఠకులకు పరోక్షంగా సంబంధం కల్పించే పత్రిక అని అర్థం

Accuracy is the most Elementary thing in Journalism. రచయితలకూ ఇది వర్తిస్తుంది. అప్పుడే ఏ పత్రిక అయినా ఎక్కువ విషయాలు అందించ గలుగుతుంది. ఎక్కువ మంది రచయితలను ప్రోత్సహించగలుగుతుంది. రచనలలో క్లుప్తత, స్పష్టత చాలా ముఖ్యం. రచయితలు ఈ లక్షణాలు అలవరచుకోవాలంటే ఎక్కువగా చదవాలి. చదివినది అవగాహన చేసుకొని, రచనలు చేస్తే ఆ రచనకు ప్రత్యేకత లభిస్తుంది. అలాంటి రచనలనే పత్రికలు ప్రోత్సహిస్తాయి. ఈ విషయాన్ని రచయితలు గుర్తించుకొంటారని ఆశిస్తున్నాను.

రచయితలను కాని, పత్రికలను కాని విమర్శించటం, వారికి నీతులు చెప్పటం నా ఉద్దేశం కాదు. ప్రస్తుతం అటు పత్రికలూ ఇటూ రచయితలూ ఏ ధోరణిలో ఉన్నాయో నా దృష్టికి వచ్చిన అంశాలను ప్రస్తావించటం మాత్రమే నా ఉద్దేశం.*

---

* ఈ ప్రసంగ వ్యాసం 1990 ఆగస్టు 5 వ తేదీ ఆదివారం నాడు జరిగిన యువభారతి రజతోత్సవ 'సమాలోచనం' సమావేశంలో సమర్పింప బడింది. విషయ సామ్యంవలన ఈ వ్యాససంకలనంలో సంపుటీకరించడ మైంది. —సంపాదకుడు.

# పాతికేళ్ళ పత్రికా రచన

**—శ్రీ పిరాట్ల వెంకటేశ్వర్లు**

గత పాతికేళ్ళలో మన పత్రికల్లో వచ్చిన మార్పులు గత వంద సంవత్సరాలలో వచ్చిన మార్పులకంటే శక్తివంతమైనవి. పత్రికా ప్రచురణకు భారీ స్థాయి పెట్టుబడి అవసరమై కేవలం అంత పెట్టుబడి పెట్టగలిగినవారు మాత్రమే పత్రికలను ప్రచురించగలిగే స్థితి ఏర్పడింది. పత్రికలు పెరుగుతూనే ఉన్నాయి. ఒక కేంద్రంనుండి మాత్రమే కాకుండా అనేక కేంద్రాల నుండి ప్రచురించబడడం వలన పాఠకులకు తాజా వార్తలను చదివే అవకాశం కూడా కల్గింది. పత్రికా ప్రచురణలో ముఖ్యంగా ఈ పాతిక సంవత్సరాలలో ముద్రణా సౌకర్యాలు పెరగడం వలన రంగుల ప్రభావం కొట్టవచ్చినట్లుగా కనబడుతోంది. అల్పుడు అందలం ఎక్కితే అర్ధరాత్రి గొడుగు పట్టమన్నట్లుగా ఉంది ఈ రంగుల ప్రభావం. ప్రమాదాలలోకానీ, సహజంగా కానీ మరణించిన వారి ఫోటోలను కూడా మొదటి పేజీలో రంగులలో ముద్రించడం ప్రారంభించారు. ఒకరకంగా ప్రజలను అలరించే ప్రధాన సాధనమైన సినిమా రంగపు ప్రభావం దీనిలో కొంతవరకు ఉన్నదని చెప్పవచ్చు. జిల్లాలవారీగా, ఏరియాల వారీగా వస్తున్న అనుబంధాల వలన వార్తలకు అర్థంకాని విషయాలుకూడా చోటు చేసుకోవడం జరుగుతోంది. మొత్తం ప్రాంతం అంతటికీ సంబంధించిన వార్తలను పాఠకులకు అందించడంలో అంతగా సఫలం కావడంలేదు. అయినప్పటికీ ఈ పాతికేళ్ళలో పత్రికల సంఖ్యతోపాటు పత్రికను కొని చదివే పాఠకుల సంఖ్యకూడా పెరుగుతూనేవుంది. ఆ ప్రభావం వలన రాజకీయమైన మార్పులకుకూడా పత్రికారంగం దోహదమవుతున్నది.

## రాజకీయ కాలుష్యం :

పత్రికలలో భాషాస్థాయి అంత సంతృప్తికరంగా లేదని చెప్పవచ్చు. అందుకు కొంతవరకు విద్యావిధానం కూడా కారణం. ఎం. ఎ. తెలుగులో

ఉత్తీర్ణుడైనటువంటి అభ్యర్థి వేమన శతకంలోని ఒక పద్యాన్ని చదివి అర్థం చెప్పలేని పరిస్థితి ఏర్పడింది. అందువలన వార్తలు వ్రాసేవారిలో స్థాయి లేకపోవడం సంభవిస్తున్నది. బహుశా ఈ పరిస్థితి మున్ముందు మరింత దిగజారినా ఆశ్చర్యపడాల్సిన పనిలేదు.

ముద్రణావిధానంలో అధునాతనంగా వచ్చిన కంప్యూటర్ల వలన తెలుగు భాషలోని అక్షరాలు కొన్ని కనుమరుగయ్యే ప్రమాదమేర్పడుతోంది. అయితే పత్రికా రచన అంటే వేగవంతమైన సాహిత్య రచన అని కూడా ఒక అర్థం ఉండడం వలన భాష విషయంలో కొంతవరకు జరిగే లోపాలపై భాషాశాస్త్రవేత్తలకు ఆగ్రహం వచ్చినా సర్దుకుపోక తప్పని పరిస్థితి.

వ్యాపార పరంగా పత్రికలను నడపడం జరుగుతున్నందు వలన సామాజిక ప్రయోజనం తగ్గి కేవలం లాభార్జన దృష్టితో పత్రికలను తయారు చేయడంలో, ప్రకటనలను తెచ్చేవారు పత్రికల స్వరూప, స్వభావాలను నిర్ణయించడంలో సంపాదకులకంటే అధిక్యత కల్గివుంటున్నారు. ఇందుకు దృష్టాంతం వార్తల మధ్య ప్రకటనలు చొప్పించబడడం. ఒక్కొక్కసారి ప్రకటనలకే సముచిత స్థానం కల్పించి పేజీలలో మిగిలిన స్థానాన్ని భర్తీ చేయడానికి మాత్రమే వార్తలను వినియోగించుకునే స్థితి ఏర్పడింది. ఇట్టి పరిస్థితి పేరుకు మాత్రమే సంపాదకులైన వారి యాజమాన్యంలో అనివార్య పరిణామంగా రూపొందవచ్చు.

ఒకనాడు స్వాతంత్రోద్యమంలో ఆ ఉద్యమానికి ఆలంబనగా మొక్కవోని దీక్షతో, త్యాగ సేవా భావనతో మన పత్రికలు నడపబడ్డాయి. ఆనాటి సంపాదకుల కలాలు విదేశీయ పాలకుల దౌష్ట్యాన్ని, కుటిల నీతిని ఖండించడమే కాకుండా తాము నమ్మిన స్వాతంత్ర్య దీక్ష కోసం ప్రభుత్వ నిర్బంధాలను సహితం ఎదిరించి నిలువబడ్డాయి ఆనాటి బ్రిటిష్ వారి నిర్బంధకాండకు జరిమానాలకు జంకకుండా కేవలం స్వాతంత్ర్య సముపార్జనే లక్ష్యంగా పత్రికలు నడిపిన మహామహులు ఎందరో ఉన్నారు. పరీక్ష వస్తేకాని అసలు సంగతి తెలియదన్నట్లుగా గత పాతిక సంవత్సరాల కాలంలో 1974-77 మధ్యలో అత్యవసర పరిస్థితి ప్రకటితమై పత్రికలపై విధినిషేధాలు విధించబడినపుడు పత్రికా స్వాతంత్ర్యం కోసం, ప్రజల ప్రాథమిక హక్కుల కోసం మన తెలుగునాట పోరాడిన వారిని వేళ్ళమీద మాత్రమే లెక్కపెట్టవచ్చు.

గత పాతికేళ్ళ పత్రికా రచనను పరిశీలించాల్సి వచ్చినపుడు పెరిగిన రాశితో వాసి పెరగలేదని అనిపించకమానదు. అందునా మన పత్రికల్లో అత్యధిక భాగం సామాజిక ప్రయోజనం కంటే వ్యాపార ప్రయోజనం మాత్రమే ప్రధాన మవుతున్న స్థితి అంత సంతోషదాయకమైనది కాదు. ఒకనాడు పత్రికలకు ప్రాణం సంపాదకులు. ఆ సంపాదకుడు నేడు కేవలం సంపాదకీయాలు రాయ డానికి పరిమితమవుతున్నాడు. ఒక్కొక్కసారి తనకు విశ్వాసం లేనిదాని గురించి రాయడానికీ సిద్ధపడాల్సివస్తున్నది. సంపాదకులకు సంపాదకుడైన ముట్నూరి కృష్ణారావుగారు ఈనాటికీ ఆరాధ్యనీయుడే. ఆయన సంపాదకత్వం వహించిన 'కృష్ణాపత్రిక'కి భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు ఆప్తమిత్రులే కాకుండా పత్రికను అనేక సమయాల్లో ఆర్థికంగా కూడా ఆదుకున్న వ్యక్తి. అట్టి పట్టాభి సీతారామయ్యగారిని త్రిపురలో జరిగిన కాంగ్రెస్ మహాసభలలో మహాత్మా గాంధీ, సుభాష్ చంద్రబోస్‌కు పోటీగా కాంగ్రెస్ అధ్యక్షునిగా నిల బెట్టారు. ఆ సందర్భంగా కృష్ణారావుగారు తన సంపాదకీయాలలో పట్టాభి సీతారామయ్య గారిని, మహాత్మా గాంధీని కూడా విమర్శించారు. ఆ విమర్శల వలన పట్టాభి సీతారామయ్య గారికి కృష్ణారావుగారికి ఎక్కడ మనస్పర్థలు ఏర్పడతాయేమోనని భయపడిన గొట్టిపాటి బ్రహ్మయ్యగారిలాంటి వారు కృష్ణా రావుగార్ని కలిసి ఈ విషయాన్ని ప్రస్తావించారు. అందుకు సమాధానంగా కృష్ణారావుగారు తన తలపాగాను తీసి ప్రక్కనపెట్టి "సీతారామయ్యగారి స్నేహితుడుగా ఆయనమీద ఈగను కూడా వాలనీయను" అని అంటూ, తల పాగాను తిరిగి ధరించి, "సంపాదకుడిగా బ్రహ్మరుద్రాదులకు కూడా వెరువను" అని చెప్పారుట. ఈ పాతికేళ్ళ పత్రికా చరిత్రలో అట్టి సంపాదకుల సంఖ్య, పత్రికల్లో పనిచేసేటటువంటి వారి సంఖ్య, ఇతరుల సంఖ్య పెరుగుతున్నదా? అని ప్రశ్న వేసుకుంటే కృష్ణారావుగారు మనకు ధృవతారగానే మిగిలిపోతారు.

# పత్రికలూ, ఫీచర్లూ

## వాకాటి పాండురంగరావు

బ్రిటీషు యువరాణి, అంటే ఎలిజబెత్ రాణి గారి కోడలు పిల్ల, ప్రిన్సెస్ డయానా చాలా అందగత్తె. మరి వాళ్ళాయన సాక్షాత్తూ యువరాజా వారు, ప్రిన్స్ ఛార్లెసు గారు. వాళ్ళిద్దరూ ఈ మధ్యన మన దేశానికి వచ్చారు. మన భాగ్యనగరానికీ విచ్చేశారు.

[క] వాళ్ళు రావడం, పోవడం, ఇతర విశేషాలను ఎప్పటికప్పుడు దినపత్రికలు ఫోటోలతో సహా ప్రచురించాయి. వార్తలుగా వాటిని లక్షలాది పాఠకులు చదివే వుంటారు.

[కానీ]

[ఖ] ఈ దంపతులు రాకముందున్నూ, వారు వచ్చి వెళ్ళింతర్వాతా కొన్ని వార, పక్ష పత్రికలు ఆ దంపతుల అభిరుచుల గురించి, మొదట వుండిన అన్యోన్యం గురించి, ఇటీవల వారిమధ్య పొడసూపిన పొర పొచ్చాలను గురించి కాస్త వివరాలు అవీ సేకరించి రాసేసరికి వేడివేడి మిరపకాయ బజ్జీలు తిన్నట్టుగా ఆనందించారు జనం.

[క] చెప్పింది వార్త.

[ఖ] ఫీచరు.

** **

అసలు ఈ వార్త మాస పత్రికలు అనే కుటుంబం వుందే దీని గోత్ర మూలం వెతుకుతూ వెళ్ళితే ఇంగ్లండులో డేనియల్ డెఫో అన్న నవలాకారుడు నడిపిన 'ది రివ్యూ' అన్న పత్రిక దగ్గరకు వెడతాము. అది 17 వ శతాబ్దిలో మొదటి దశకం.

1789లో 'చిల్డ్రిన్స్ మేగజిన్' వచ్చింది. అమెరికాలో 'సాటర్ డే ఈవెనింగ్ పోస్టు' (1821) 'లేడీస్ హోం జర్నల్' (1880) 'రీడర్స్ డైజెస్టు'

(1922), టైమ్ (1923), న్యూయార్క్ (1925), లైఫ్, (1936) - ఇట్లా సాగిందీ కుటుంబం.

తెలుగులో ఆంధ్ర సచిత్ర వారపత్రిక అద్యస్థానం. తర్వాత ఆంధ్ర ప్రభవారపత్రిక, ఆంధ్రజ్యోతి వారపత్రిక, ఆంధ్రభూమి వారపత్రిక, స్వాతి - ఇంకా వారపత్రికలు వర్ధిల్ల సాగాయి. కాలగర్భంలో కలసిపోయిన వాటిలో 'ఆనందవాణి' 'ఢంకా' 'చిత్రగుప్త' లాటి వెన్నో వున్నాయి. 'యువ' మాస పత్రిక పెద్ద వెలుగే వెలిగింది. అలాగే 'భారతి' కూడాను. ఇప్పుడు 'ఆంధ్రభూమి' 'స్వాతి' వంటి మాస పత్రికలు పాఠకులను అలరిస్తున్నాయి.

మరి కథలు, నవలలు, కాక ఈ వార, మాస పత్రికలల్లో ఫీచర్ల శీర్షికలు చాలానే వుంటున్నాయి, చాలా మంది తాము రాస్తున్నవి ఫీచర్లు అని తెలియకుండానే రాస్తున్నారుకూడా.

కనుక ఫీచర్ అనగా నేమి? ఈ రచనా విశేషము యొక్క గుణ గణాదులు ఎట్టివి - అని కనుక్కుందాము.

* ఫీచరంటే వార్తకాదు; వార్తా వ్యాసం కాదు; వార్త ఆధారంగా కలదే కాని అంతకన్న విస్తృతమైన పరిధిలో, రంగు రుచి వాసనలతో, అదనపు విశేషాలతో వ్రాసినది అన్నమాట. (ఈ వ్యాసం మొదట్లో మనకు పరిచయమయిన 'క', 'ఖ' లను పరిశీలిస్తే ఈ విషయం 'అరిచిన ఒలిటి పండే' (సారీ) ఒలిచిన అరటిపండే సుమండీ!)

* ఫీచర్‌కు రాగద్వేషాలుంటాయి. ఉద్వేగం 'పక్షపాతం' వుంటాయి. పాపం వార్తల్లో అలాంటివాటికి చోటులేదు. ('ముగ్గురు సోదరీమణులు చార్మినార్ మీద నుండి దూకి ఆత్మహత్య చేసుకున్నారు' అని తెలుపుతుంది వార్త : అదే ఫీచరయితే "ఎంత దుర్మార్గపు సమాజం ఇది! పచ్చని జీవితాల్లోకి అడుగిడవలసిన అమ్మాయిలు పేదరికానికి ఆహుతి అయిపోయారు. ఎందుకు అట్లా చేశారు వారు! ఇలాంటివారికి పరిష్కారం చూపే సంస్థలు, విధానాలు లేవా? మనం నాగరికులమేనా!" అని నిలదీస్తుంది. ఆ పిల్లల తల్లిదండ్రులను, వారి స్నేహితురాళ్ళను కలిసి కూర్చుని ఆ పిల్లల ఆశలు, కలలు, కథలు అన్నీ కనుక్కుని రాసిన కదంబమే ఫీచరు!)

* వార్తలో వ్యాఖ్యానం జోడించడం అపచారం. (కొన్ని ప్రధానమైన పత్రికలు దీనికి రోజూ పాల్పడుతున్నాయి. అది వేరే సంగతి.) ఫీచర్లకు

వ్యాఖ్యానం ప్రాణం; అభిప్రాయ ప్రకటన ఆత్మలాంటిది. అలాగని బండగా, కటువుగా వుండనక్కరలేదు.

* ఫీచర్ల శైలి సరళంగా ఆకర్షణీయంగా వుండాలి. చదివించే గుణం ఈ వంటకం పాలిటి లవణం!

** **

ఇహపోతే —

ఫీచర్లను ఎవరయినా రాయవచ్చు. దేనిమీదనయినా రాయవచ్చు. కుక్కపిల్లా, అగ్గిపుల్లా, సబ్బుబిళ్ళా, పనిపిల్లా, స్టాంపుబిళ్ళా, చీపురుపుల్లా-దేని మీదయినా ఫీచర్ రాయవచ్చు; ప్రతిభావంతులు అనేకులు రాస్తున్నారు కూడా.

అక్షరాస్యత పెరిగి సమాజంలో వ్యక్తుల అభిరుచుల వైవిధ్యం పెరిగిన కొద్దీ ఈ ఫీచర్ల వైవిధ్యం విస్తరిస్తుంటుంది.

స్త్రీలు, బాలలు, ఆర్థిక విషయాలు, సినిమాలు, క్రీడలు, వినియోగదారులు, వైజ్ఞానిక విషయాలు (కొందరు పత్రికల వారికి 'వైజ్ఞానికం' అనగానే సెక్స్, అందులోని రతికార్యం ఒక్కటే విషయం తప్ప మరొకటి గుర్తు రాదను కోండి!) ఆరోగ్యం, సంప్రదాయం, కళలు - ఇట్లా వివిధ విషయాల మీద ఫీచర్లు రాయవచ్చు.

కావలసిందెల్లా - ఆసక్తి, పఠనశీలత, ఆకర్షణీయమైన రచనాశైలీ! ఈ మూడు పాదాలతో దిన, వార, మాసపత్రికల జగత్తును జయించ వచ్చును.

నిజం!

# పత్రికల్లో సినిమా ఫీచర్

**శ్రీ పి.యస్.ఆర్. ఆంజనేయశాస్త్రి**

తెలుగువారు ఆరంభశూరులనే మాట అపవాదమే కాని, అనుకరణ వీరులనే మాట సిద్ధాంతమే ననిపిస్తుంది. తెలుగు జర్నలిజం పాతికేళ్ళ పోకడలు గమనించగలిగితే, ఫీచరింగ్‌లో ఒక పత్రిక వీరవిజృంభణ సాగిస్తోంది.

తెలుగు పత్రికారచనకు ఆదిపీఠం గోదావరి ప్రాంతమా, రాయలసీమా, చెన్నపురమా అనే చర్చ, దానిపట్ల భిన్నాభిప్రాయాలూ అప్రస్తుతం. మన జర్నలిజం పీరియాడికల్స్‌గా మొదలై మాస, పక్ష, వార, దినపత్రికలుగా విశ్వరూపం తాల్చింది. ఈ విశ్వరూపానికి- ఒకే దినపత్రిక ఉదయం ఎడిషన్, మధ్యాహ్నం ఎడిషన్, సాయంత్రం ఎడిషన్‌గా త్రిగుణీకృతమయ్యే అవకాశాల్ని గురించి ఇకమీదట ఆలోచించవచ్చు. గోదావరీ కృష్ణా నదుల పుట్టుక వంటి స్వల్పరూపంలో ఉద్భవించి పవిత్రంగా సాగిసాగి, ఉపనదుల్లాంటి వివిధ శీర్షికలతో కలిసి విస్తరించి, వ్యాపారకశ్మలాలు చేరినా పోరాటస్ఫూర్తి చెదర కుండా ప్రవహిస్తూ, అభిరుచుల్ని కరప్ట్ చేసే కాపిటలిస్ట్ ధోరణులు వరదల్లా వచ్చిపడి పాఠకుల్ని ముంచెత్తినా మళ్ళీ సర్దుకుపోతున్న జీవవాహిని తెలుగు జర్నలిజం.

మాస, పక్ష, వారపత్రికలు ప్రధానంగా సాహిత్య స్ఫూర్తితో నడక ప్రారంభించాయి. 'భారతి' వంటి కొన్ని పత్రికలు పండిత పత్రికలుగా నడిచాయి. ఈ పండిత పత్రికల్లో కొన్ని, పండితుల వాదోపవాదాలకు వేదికలుగా పనికి వచ్చాయి. ఆ స్థాయిలో వాటికి విలువ ఎక్కువే అయినా పాప్యులారిటీ తక్కువగా ఉండేది. ఇప్పుడు మాసపత్రికలు కొన ఊపిరితో నడుస్తున్నాయి గాని సాహిత్య వాసనకు దూరం కాలేదు. వ్యాపార పరంగా అభిరుచులు మారి మాస పత్రికలు కథా సంకలనాలుగానూ, నవలా సంకలనాలుగాను సాగాయి, కొన్ని ఇంకా సాగుతున్నాయి. నూకలు చెల్లిన మాసపత్రికలు చెల్లిపోగా, మరికొన్ని మిగిలి ఉన్న ఉత్సాహంతో కదుల్తున్నాయి. మాస

పత్రికల రీడర్షిప్ గ్రంథాలయాలకు, సర్క్యులేషన్ లైబ్రరీలకు పరిమితమై పోయిందేమోనని అనుమానించవలసిన వాతావరణం కనిపిస్తోంది.

పక్షపత్రికలు కూడా దాదాపు ఇదే పరిస్థితి నెదుర్కొంటున్నాయి. సిద్ధాంతవాద సాహిత్య పత్రికలుగా, రాజకీయవాద పత్రికలుగా కొన్ని కొన సాగుతున్నాయి. వాటిలో శీర్షికల వైవిధ్యానికి కృషి అవసరం అంతగా కని పించదు. ఇండియా టుడే, సుప్రభాతంవంటి పత్రికలు వారపత్రికల్లాగా ఆకర్షించుకుంటున్నాయి వివిధ శీర్షికలతో.

మార్కెట్లో తోరణాలు కట్టి నేత్రాకర్షణ కలిగిస్తున్న జర్నలిజం ముఖ్యంగా వీక్లీ జర్నలిజం.

మన జర్నలిజం ప్రభు సమ్మితంగా నడవాల్సిన అవసరం మొదటినుంచీ ఎదురు కాలేదు. మిత్ర సమ్మితంగా జర్నలిజం నడిచిన రోజులు గతించాయి. కాంతా సమ్మితంగా పత్రికారచన సాగుతున్న యుగం ఇది. వారపత్రికలు జర్నలిజంలో గ్లామర్ తెచ్చిపెట్టాయి. అబాల వృద్ధులకూ పనికివచ్చే వార పత్రికా నిర్వహణ శ్రీకారం చుట్టుకుంది. అందరికోసం అన్ని శీర్షికలూ వార పత్రికల్లో కనిపిస్తాయి. వారపత్రికలనే పదంలోని మొదటి రెండక్షరాలూ, కాంతా సమ్మితం అనే పదంలోని మొదటి రెండక్షరాలూ కలిసి పత్రికలకు విశేషణంగా వాడుకోదగిన స్థాయి సాహిత్యాన్ని అందించే లక్షణం అబ్బిందని కొందరైనా బాధపడే వ్యాపార దృక్పథం విస్తరించింది. వారపత్రికలవల్ల రచయితలకు ఎక్కువ ఊపు లభించింది. రచనలకన్న రచయితలకు గ్లామర్ పెరిగింది. కథల్ని వెనక్కు నెట్టేసి నవలలకు బ్రహ్మరథం పట్టడంతో స్టార్స్ పేరుతో సినిమా వ్యాపారం జరుగుతున్నట్లు రచయితల పేరుతో పత్రికలు అమ్ముడయ్యే దశ వచ్చింది. పత్రికల్నిబట్టి రచయితలుకాక, రచయితల్ని బట్టి పత్రికలనే వైఖరి వారపత్రికా నిర్వహణలో చోటు చేసుకుంది.

జర్నలిజంలో ఫీచరింగ్ వారపత్రికలతో వ్యాప్తి చెందింది. క్విజ్‌ల నుంచి సినిమాలవరకూ వారపత్రికల్లో అలవాటు చేసిన ఫీచరింగ్ ఇప్పుడు దినపత్రికలకు కూడా విస్తరించింది. మాస పక్ష వార దినపత్రికల్లో ఏవైనా లేకపోవచ్చుగాని సినిమా ఫీచర్ లేకుండా గడవదు. వారానికి పరిమితమై వచ్చిన సినిమా జర్నలిజం ఇప్పుడు దైనిక పత్రికా రచనగా కూడా మారి పోయిందంటే, మరో ఒకటి రెండేళ్ళలో సినిమా డైలీ రావడానికి అవకాశాలు

లేకపోలేదు. రాజకీయాలతో బతికే పత్రికలు కూడా సినిమాలమీద బతుకు వెళ్ళదీసే పరిస్థితి వచ్చింది.

విలువల విషయం బేరీజు వేసుకుంటే రాజకీయాలు, సినిమాలు, పత్రికలూ ఒకే స్థాయిలో ఉన్నాయి. ఈ మూడు రంగాలూ పరస్పరాశ్రితాలయ్యాయి. రాజకీయాల్లోని చాలామందికి సినిమాలపట్ల ఆసక్తి, సినిమారంగంతో బినామి సంబంధాలూ ఉన్నాయి. సినిమాల్లోని వారు చాలామంది రాజకీయవాసము, రాజకీయపరపతి కలవారే. రాజకీయాలకూ, సినిమాలకు ప్రజల దగ్గరికిపోయే సాధనాలు ఇప్పటివరకూ ఎక్కువగా పత్రికలే కాబట్టి పత్రికలు కూడా రాజకీయాలమీద, సినిమాలమీద ఆధారపడుతున్నాయి. తెలుగు జర్నలిజం ఇందువల్ల అక్షరాలా కలర్‌ఫుల్‌గా మారింది. దీనితో తెలుగు జర్నలిజం లక్ష్యం పాఠకుల్ని ఎడ్యుకేట్ చెయ్యడం కాకుండా పాఠకుల్ని ఎంటర్‌టైన్ చేసే దిశకు మళ్ళింది. ప్రజాసేవ పేరుతో పదవీదాహం ప్రదర్శించుకొనే రాజకీయరంగానికీ, ప్రేక్షకులను అలరించే పేరుతో స్వలాభాన్ని చూసుకొనే సినిమారంగానికీ, పాఠకుల్ని ఎలా విజ్ఞానవంతుల్ని చేద్దామా అని ఆలోచించేకన్న ఎలా ఆకర్షించుకుందామా అని ఆలోచించాల్సిన స్థాయిలో సంపాదకుణ్ణి నిలబెడుతున్న పత్రికారంగానికీ తేడా కనిపించని ఈ రోజుల్లో పత్రికాప్రపంచంలో ఏ ఫీచర్ కనిపించినా అది పాఠకుల ఆకర్షణకోసమే. అలాంటి ఫీచర్లలో యూనివర్సల్ ఫీచర్ సినిమా.

తెలుగులో ఫిలిం జర్నలిజానికి శ్రీకారం చుట్టిన కురువృద్ధులు ఇంటూరి వెంకటేశ్వరరావు గారు. పత్రికల్లో సినిమా ఫీచర్ అంటే, సినిమాలమీద సమీక్షలే-తొలిరోజుల్లో ముట్నూరివారి కృష్ణాపత్రికలో సినిమా సమీక్షకుడుగా విమర్శలు రాసి సినిమావారి దృష్టికెక్కి ఇప్పుడు పౌరాణిక దర్శకబ్రహ్మ అనిపించుకుంటున్న కురువృద్ధులు కమలాకర కామేశ్వరరావు గారు. క్రమంగా రూపవాణివంటి సినిమా మాస పత్రికలు ప్రజల్లోకి వచ్చాయి. దినపత్రికల్లోనూ సినిమా సమీక్షలకు విలువ ఆపాదించిన ఆంధ్రపత్రిక వంటివాటి కృషి కొన్నేళ్ళు సాగింది. సినిమా ఫీచర్స్‌వల్ల పత్రికల ద్వారా ప్రజల్లోకి వెళ్ళి తమ సినిమాలకు ప్రచారం జరుగుతుందని గుర్తించిన చిత్రరంగం పత్రికలకు సినిమా అడ్వర్టయిజ్‌మెంట్లు అలవాటు చేసింది. అది క్రమంగా సినిమా ఫీచర్స్ నడిపి అడ్వర్టయిజ్మెంట్ల ఆదాయం సంపాదించుకోవచ్చుననే భావానికి నీరు

పొయ్యడంతో సినిమాఫీచర్‌కు అడ్వర్టయిజ్మెంట్లకులంకెపడి సినిమాను ప్రోత్సహించే ఫీచర్ జర్నలిజం ప్రారంభమైంది. సినిమాల్నిగురించి బాగోగులు ప్రజలకు చెప్పవలసిన బాధ్యతనుంచి సినిమాల్ని గురించి ప్రజలకు ఆకర్షణ కలిగించాల్సిన బాధ్యత వ్యాపారసంబంధ బాంధవ్యాన్నిబట్టి పత్రికారచయితకు అవసరమౌతూ వచ్చింది. సినిమాల్ని గురించిరాసి అడ్వర్టయిజ్మెంట్లు సంపాదించుకోవచ్చుననే భావమే అన్నిపత్రికల్లోనూ సినిమా ఫీచర్ ప్రవేశానికి నాంది. ఎప్పుడైతే అడ్వర్టయిజ్మెంటు ఆదాయం కోసం వెంపర్లాట ప్రారంభమైందో సినిమాలను, సినిమా వారిని ఆకాశానికెత్తేసే పద్ధతికి తలవంచడం అదోనీతి, అదోన్యాయం అన్నట్లు ఉభయవర్గాలూ భావించే రోజులు పెరిగాయి. పత్రికల్లో అనేక ప్రకటనలుంటుంటాయి. ఆ ప్రకటననిచ్చేవారినిగురించి సినిమా ఫీచర్‌లో రాసినట్లు రాయరెందువల్లనో! దేశంలో సినిమాలస్థాయి, వాటి ప్రయోజనాలు, వాటివల్ల దుష్ఫలితాలు, సినిమావారి బాగోగులు, వాళ్ళపట్ల ఆరాధన పెంచుకోడం సబబా,అవసరమా, సినిమాల్లో మంచిచెడులు మొదలైనవి నిష్కర్షగా చర్చించడానికి అవకాశం లేనంతగా పత్రికలూ సినిమాలూ మమేకం అయిపోతున్నాయి. వ్యాపార సంబంధాలు వేరు, జర్నలిజం బాధ్యత వేరు అనేది సినిమా ఫీచర్ల విషయంలో పనికిరావడంలేదు. ప్రజల్లోని అభిరుచుల్ని దిగజార్చి సినిమాలు వ్యాపారం చేసుకుంటున్న ధోరణిలోనే సినిమాజర్నలిజం కూడా నడుస్తోంది. సినిమాల్నిగురించి రాయడం పాఠకుల్ని ఎడ్యుకేట్ చెయ్యడానికిగాని సినిమావారిని సంతృప్తి పరచడానికి కాదని ఎవరైనా వాదిస్తే వాడొక దద్దమ్మగా భావించేట్లు సినిమా ఫీచరింగ్ సొగసులొలకబోయడం సాగుతోంది.

'నా ఫొటో వేసి నన్ను గురించి కాస్తరాయండి' అని అడిగే స్థాయినుంచి మా ఫొటో వేసుకొని మమ్మల్ని గురించి రాస్తే మీ పత్రికలు అమ్ముడు పోతాయి కాబట్టి మా చుట్టూ తిరుగుతున్నారు, అని పోజు పెట్టే స్థాయికి సినిమావారిని పెంచినిలబెడుతోంది సినిమా ఫీచరింగ్. సినిమా జర్నలిజం ఎంతటి ప్రమాదకరమైన భయంకరమైన దశలో నడుస్తున్నదంటే - అటు సినిమాల్ని గురించి మాట అనలేక సినిమారంగం ఆధిపత్యంలో బతుకుతున్నట్లు ప్రవర్తించకనూ తప్పక, ఇటు ప్రజల్లో సినిమాకు తెచ్చిపెట్టిన విపరీతమైన ఆరాధనాపూర్వక

మైన ప్రచారం అవసరాలు తీర్చకనూ తప్పక స్వాతంత్ర్యం కోల్పోయింది. దీనికి పత్రికా యాజమాన్యాలూ కొంత కారణం కావచ్చు, సినిమా జర్నలిజంలో ఉంటున్న వారి ప్రలోభగుణమూ కొంత కారణం కావచ్చు.

ఇంతింతై నటుడింతయై అన్నట్లు గత పాతికేళ్ళలో సినిమా ఫీచరింగ్ దశదిశలాక్రమించి సామాన్య ప్రజలకు కూడు - గూడు - గుడ్డకన్న సినిమా వినోదమేమిన్న అన్నంత దశకు పెరిగింది.

సినిమా ఇప్పుడొక ఫీచర్ కాదు. అదొక సంపూర్ణస్వరూపం తాల్చిన జర్నలిజం. గత పదిహేనేళ్ళలో వివిధ పత్రికల్లో సినిమా ఒక 'కాలం'గా ఉన్న స్థాయినుంచి వారపత్రికల స్థాయినందుకోడంతో సినిమా వ్యాపార రంగంలో పోటీలాగానే సినిమా పత్రికా రంగంలోకూడా పోటీ పెరిగింది. న్యూస్ ప్రింటు ధరలు పెరిగినా, ప్రింటింగ్ ధరలు పెరిగినా సినిమా జర్నలిజం వీటన్నింటినీ అతిక్రమించి ప్రజల్లోకి పోయి వారికి సినిమా గ్లామర్ గురించి తెలిపినా తెలుపలేకపోయినా సినిమా గ్లామర్ని గురించి "విజ్ఞానవంతుల్ని" చెయ్యడంలో యధాశక్తి హిరణ్యంగా పాటుపడుతోంది.

క్షుధార్తులు వ్యధార్తులైన సామాన్య ప్రజల బతుకుల్లో చవుకగా కాస్తంత వినోదాన్ని జల్లి బాధలతో సొమ్మసిల్లిన వారిని సేదదీర్చే సేవాధర్మం పేరుతో కళారాధన ప్రాతిపదికతో కాపిటలిస్ట్ వ్యాపార సంస్కృతి కొమ్ముకాస్తున్న ఇప్పటి ఫిలిం జర్నలిజం మిగతా విభాగాలకన్న బలంగా కాలూనుకోడంతోపాటు పలుచనైపోయింది కూడా.

జనజీవితంలో ఒక చిన్న భాగమైన సినిమాను జనజీవితంలో ఒక ప్రధాన భాగంగా మార్చిన ఫిలిం జర్నలిజం సినిమాల్ని గురించి ప్రోత్సాహ పూర్వకంగా రాయవలసిందే, తప్పులేదు. కాని రాజకీయరంగం ఎంతకళ్మలంగాఉందో సినిమా రంగం కూడా అంతకళ్మలంగానూఉంది. తెరమీదకనిపించే గ్లామర్ మాత్రమే సినిమారంగం కాదు. తెర వెనుక జరిగే అన్యాయాలు, అక్రమాలు, విపరీత ప్రవర్తనలు ఎన్నెన్నో ఉంటాయి. రాజకీయ రంగంలో లొసుగుల్ని పత్రికల కెక్కించినట్లు సినిమా రంగంలోని వైపరీత్యాలను రాసే అవకాశం ఫిలిం జర్నలిస్టులకు లేదు. సినిమారంగలోని వ్యాపారప్రయోజనాలనూ, వారి కీర్తి ప్రతిష్టలను కాపాడి హెచ్చించడమే ఫిలిం జర్నలిజం కర్తవ్యమా? రాజకీయకుంభకోణాన్ని బట్టబయలు చేసినట్లు సినిమా కుంభకోణాన్ని బట్టబయలు

చేయడం నేరమా? సినిమాలు సమాజంపైవేస్తున్న దుష్ప్రభావాన్ని చర్చించడం తప్పా? సినిమా జర్నలిజం సినిమావారికోసమా ప్రజల మేలుకోసమా అని ఆలోచించగల స్వాతంత్ర్యం సినిమా 'కాలం'లు నిర్వహించే వారి హక్కుకాదా? సినిమావారు వారి ప్రయోజనాల దృష్టితో ఏది చెబితే అదే వేద వాక్కుగా రిపోర్ట్ చెయ్యడం, చిలవలు పలవలుగా కీర్తించడం తప్ప విశ్లేషించి వ్యాఖ్యాపూర్వకంగా రాయడం పనికిరాదా? అనంత వైవిధ్యం ఉన్న ప్రపంచంలో సినిమా స్థానం ఎంతవరకో అంతవరకే నిలపడం సాధ్యంకాదా? అతి ప్రచారంవల్ల ఆరాధనీయులై పోతున్న సినిమావారు సినిమా జర్నలిస్టుల్ని అవమానపరిచినా ఆ విషయం చెప్పుకోలేక బయటపెట్టలేని అధమ స్థితిలోనే ఫిలిం జర్నలిజం బతకాలా? ప్రజల శ్రేయస్సు ముఖ్యమా సినిమా వ్యాపార ప్రయోజనాలు ముఖ్యమా? ఫిలిం జర్నలిజం దారి ఎటు? రాష్ట్రాన్ని, రాష్ట్ర ప్రయోజనాలను, ప్రభుత్వ విధ్యుక్త ధర్మాలను తమ చెప్పుచేతుల్లో ఉంచుకో వాలనుకునేంతగా సినిమా పరిశ్రమను పెంచిపోషించడమే సినిమా జర్నలిజం లక్ష్యం కావాలా?

ఈ ప్రశ్నలన్నింటికి ప్రజలే సమాధానా లివ్వగలిగేట్లు ఫిలిం జర్నలిజం ప్రజాశ్రేయో మార్గంలో ఆరోగ్యంగా ప్రగమించగల అవకాశాలకోసం ఫిలిం జర్నలిస్టులు నిజాయతీతో తపించాలి. అప్పుడే ఫిలిం ఫీచరింగ్‌కు కూడా ఒక చరితార్థత.

పాతికేళ్ళలో అన్ని రంగాలూ విస్తరించినట్లే ఫిలిం జర్నలిజం కూడా విస్తరించింది. అయితే దిన పత్రికల సామ్రాజ్య వాద విధానం వల్ల మాస పత్రికలు, పక్ష పత్రికలు, వార పత్రికలూ మనుగడ కోల్పోరాదు. లివ్ అండ్ లెట్ లివ్ అనేది కనీస మానవతా ధర్మం. జర్నలిజం ఈ ధర్మాన్ని అతిక్రమిస్తే కంచే చేనుమేసిన చందమౌతుంది.

పత్రికలతో, రాజకీయాలతో కూడా సంబంధం ఉన్న ఒక సినిమా ప్రముఖుడు ఈ మధ్య "సినిమా జర్నలిజం ఇంత దిగజారిపోతోందేమిటి? కొందరికి కరపత్రాలుగా తయారవుతోందేమిటి?" అని ప్రస్తావించాడు. ఎవర్ని ఉద్ధరించడానికి కంకణం కట్టుకొని నడుస్తోందో ఆ రంగం వారే విసుక్కునే స్థాయికి ఫిలిం జర్నలిజం "ఎదగడం" ఎంతవరకు సమంజసం?

సినిమా పరిశ్రమ ఎదిగి ప్రజల్లోకి చొచ్చుకు పోయినంతగా మరే పరిశ్రమా పోలేదు. ఈ పరిస్థితుల్లో ఒక చిన్న అబ్జర్వేషన్. హిందీలో గాని, మన తెలుగులో గాని సినిమా పరిశ్రమలోని వారిలో నూటికి 70 మంది మాజీ కమ్యూనిస్టులు లేదా ఇప్పటికీ కమ్యూనిస్టులు, లేదా లెఫ్టిస్టు భావాలు కలవారు. వీరు మాట్లాడేది సామ్యవాదం,. ఆచరించేది సామ్రాజ్యవాదం. వీరు రష్యన్ సినిమాల్ని కాపీ కొట్టరు. అమెరికన్ సినిమాల్ని కాపీ కొట్టకుండా వదలరు. సినిమా పరిశ్రమ ధోరణుల్ని బట్టి అర్థిక శాస్త్రంలో కొత్తగా రెండు సూత్రాలు ప్రతిపాదించవచ్చు - కమ్యూనిస్టు కాపిటలిజం, లెఫ్టిస్ట్ కమర్షియలిజం! సినిమా పరిశ్రమ రెండుతలల కొండచిలువ. ఒక తల వయొలెన్స్, మరో తల సెక్స్! దాని బతుకేదో అది బతుతున్నట్లు, కష్టాలప్పుడు ప్రభుత్వాన్ని ఆదుకుంటున్నట్లు కనిపిస్తుందే గాని దగ్గరికి వచ్చిన అమాయకుల్ని గుటుక్కున మింగేస్తుంది.

సినిమా పరిశ్రమగాని దానిలోని వారుగాని ఆకాశం నుంచి ఊడిపడ్డ దేవతలుకాదు. పైగా దేశోద్ధరణకు సినిమాలు తీయడం లేదు. మాది వ్యాపారం అనే చెబుతారు. ఇతర జీవనరంగాల్లో లాగానే ఒక వృత్తిని ఆధారం చేసుకొని బతుకుతున్న వారు. వారి సమస్యలు, కష్టనష్టాలు, లోటుపాట్లు వారికీ ఉంటాయి. వాటిని సానుభూతితో అవగాహన పరచడం అవసరం గాని ఆరాధన నేర్పడం అవసరమా?

నానాటికీ విస్తరిస్తున్న సినిమా జర్నలిజం యాజమాన్యానికి జవాబుదారీ వహించాలో, సినిమా పరిశ్రమకు జవాబుదారీగా ఉండాలో, ప్రజల శ్రేయస్సుకు జవాబుదారీగా నిలవాలో అటు పత్రికల యాజమాన్యాలూ ఆలోచించాలి, ఇటు అణగి ఉన్న నిజాయితీతో ఫిలిం జర్నలిస్టులూ ఆలోచించాలి.

# పత్రికలు : వారం వారం శీర్షికలు

—శ్రీ టి. ఉదయవర్లు

ఏ పత్రికలోనైనా సరే వివిధ శీర్షికలు అవసరం. పాఠకులు వివిధ రంగాలకు, విభిన్న రుచులకు సంబంధించిన వారు కాబట్టి వారినిచదివించ డానికి అనేక శీర్షికలు ప్రవేశపెట్టవలసి వచ్చింది. ప్రత్యేక రంగాలకు సంబం ధించిన శీర్షికలు పాఠకులవిజ్ఞానాన్ని, ఆసక్తిని పెంచడానికి ఎంతగానో దోహదం చేస్తాయి. ఆయా పత్రికా నిర్వాహకులను, ఎడిటర్లను బట్టి శీర్షికలలో వైవిధ్యం వ్యక్తమవుతుంది. లోగడ పీరియాడికల్ జర్నలిజంలో వివిధ శీర్షికల ప్రయోజనం వేరు. ఇవాళ ఈ శీర్షికలు కేవలం పాఠకులనుఆకర్షించడానికి, పత్రికల అమ్మకాలను పెంచడానికి మాత్రమే పరిమితమయ్యాయి.

"ఫీచర్" అంటే ప్రతి వారం ఒకానొక రచయిత చేతనో, లేదా ఒకే 'కాలమ్' ఒక్కోసారి ఒక్కొక్కరిచేతనో నిర్వహించే 'శీర్షిక' కానక్కర లేదు. ఆవకాయ మొదలుకుని అంతర్జాతీయ సమస్యదాకా ఏదైనాసరే-పాఠకుల విజ్ఞానాన్ని పెంచేది, వారికి కొత్త సమాచారాన్ని అందించేది, వార్తలలోకి ఎక్కగానే దానికి సంబంధించిన సకల సమాచారాన్ని సచిత్రంగా పూసకుచ్చి నట్టు, చెరకు నమలినట్టు అందించే ప్రక్రియే - 'ఫీచర్'. ఇది ఇంగ్లీషులో ఎంత బాగా అభివృద్ధి చెందిందో, తెలుగులో ఈ ప్రక్రియ అంత బాగా వృద్ధిలోకి రాలేదు. ఇంగ్లీషులో కావలసిన సమాచార సేకరణకు, ఫోటోలకోసం, అది వ్రాసే నిపుణుడైనరచయితకోసం ఎన్నిడబ్బులైనా ఖర్చుచేయిడానికి వెను కాడరు. అందుచేత ప్రమాణికమైన ఫీచర్లు, ముక్కుపై వేలువేసుకునేలా చేసే తాజా సమాచారంతో వస్తాయి. అదే తెలుగులో అయితే మన పత్రికలు, స్వతంత్రంగా డబ్బులు చెల్లించి చక్కని ఫీచర్లు వ్రాయించే స్థాయికి ఇంకా ఎదగలేదు. పత్రికలకు లాభాలు వస్తున్నా, ఫీచర్ రైటర్లకు ఎందుకు అంత మొత్తంలో చెల్లించేది? ఆ పత్రిక, ఈ పత్రిక చూసి, అందులోని బొమ్మలే తారుమారుచేసి ప్రచురిస్తే అదే చాలు పాఠకులకు అనే మిడిమిడి జ్ఞానంగల

వారు కొందరు పత్రికారంగంలో తలెత్తడంవల్లనే ఈ ప్రక్రియ ఎదగవలసినంత ఎదగలేకపోతున్నది. ఎక్కడైనా డబ్బులిచ్చే యాజమాన్యం వుంటే, ఆ విభాగం చూసేవారు ఆయా ఫీచర్లు ఎవరు వ్రాయగలరో వారి జోలికి వెళ్ళకుండా, వారి మిత్రులకు, వందిమాగధులకు ఆ పని అప్పగించడం వల్ల ఆశించిన ప్రమాణాలను మనం చేరుకోలేకపోతున్నాము.

వెనకటికి ఫీచర్లు ఎందుకు నిర్వహిస్తారని ఒకరెవరో ఒకపత్రికాధిపతిని అడిగితే-పోస్టులో వచ్చే వ్యాసాలు, ఇతర సామగ్రిమీద ఆధారపడితే పత్రిక పేజీలన్నీ నింపలేము అందుచేత పత్రికల పేజీలలో కనీసం మూడో భాగం ఫీచర్లు ఏర్పాటుచేసి, మా సిబ్బందితోనో, పేరున్న రచయితలతోనో వ్రాయిస్తామన్నారట. ఆనాటికి అది సత్యమైనా, కాకపోయినా ఈనాడు ఆ మాట చెప్పటం సత్యదూరంగావుంటుంది. ఎందుచేతంటే, ఇవాళ ఎంత ఆకర్షణీయమైన, ఎంత విజ్ఞానదాయకమైన శీర్షికలు నిర్వహిస్తే ఆయా పత్రికా నిర్వాహకులు, లేదా ఎడిటర్ ప్రతిభావంతుడు అన్నదానికి అదిసంకేతంగా నిలుస్తుంది; అదే పత్రిక సర్క్యులేషన్‌కు సైతం కొలబద్దలాంటిదిమరి.

ఆడిట్ బ్యూరో ఆఫ్ సర్క్యులేషన్‌వారి లెక్కలుచూస్తే తెలుగులోను వార, మాస పత్రికల సంఖ్య వందలలో వుంది. కాని నిజానికి ఈనాడు జనాదరం పొందిన పత్రికలు వేళ్ళపై లెక్కించదగినన్ని మాత్రమే వున్నాయి. వార పత్రికలన్నీ దాదాపు ఒకే మూసలో నడుస్తుండగా, మాస పత్రికలు మరో మూసలో తయారవుతున్నాయి.

వారపత్రికలు స్థూలంగా పరిశీలిస్తే-ఒకదానికి మరొకటి ప్రతిబింబంలాగా తయారై పత్రికా నిర్వహణలో సృజనాత్మకశక్తి నానాటికీ తీసికట్టుగా తయారైంది. ఈనాటివారపత్రికలు - 'ఆంధ్రజ్యోతి', 'ఆంధ్రప్రభ', 'ఆంధ్రభూమి', 'స్వాతి', ఇటీవలే ఆగిపోయిన 'ఆంధ్రపత్రిక', కొంతకాలం వచ్చి నిలిచిపోయిన ప్రగతి, ప్రతిభ మొదలగు వాటిని పరిశీలిస్తే - అన్నీ దాదాపు ఒకేలాగా వున్నాయి. ఎనభై పేజీల దాకా వేస్తున్న ఈ పత్రికలలో నాలుగైదు సీరియల్ నవలలు, ఐదారు కథలు తప్పకుండా వుంటాయి. ఇవి కాకుండా-సినిమా, గ్రంథసమీక్షలు, వారఫలాలు, క్రీడారంగం, బాలల శీర్షిక మహిళల శీర్షిక యథాతథంగా వుంటున్నాయి. ఇంతకన్నా వైవిధ్యవంతంగా శీర్షికలను నిర్వహించలేని స్థితిలో వున్నారు. కొన్ని పత్రికలు కొంచెం భిన్నంగా

ఢిల్లీనుంచి, లేదా రాష్ట్రరాజధాని నుంచి ఒక రాజకీయలేఖ ప్రచురిస్తున్నాయి. లేదా నాటక రంగం గురించో, దర్శనీయ స్థలాల గురించో శీర్షికలు నడుపు తున్నాయి తప్ప పాఠకులు తెలుసుకోదగినవి, తెలుసుకోడానికి, వారిని ఉత్తేజ పరచి కార్యోన్ముఖులను చేయడానికి, వారి మెదడుకు మేతవేసే శీర్షికలను నడప లేని స్థితికి ఈనాడు తెలుగు పత్రికారంగం చేరింది. ఏ రంగం గురించైనా సరే- పరిశోధనాత్మకమైన శీర్షికలు నడుపవలసిందే. ఇరుగు పొరుగునవున్న తమిళ నాడు, కేరళలో వార పత్రికలు సర్క్యులేషన్‌లో రికార్డు సృష్టించాయంటే కేవలం అక్షరాస్యుల సంఖ్య ఎక్కువగా వుండటమేకాదు, ఆయా పత్రికల నిర్వహణ, వాటి ఎడిటర్ల ఆలోచనాధోరణి ప్రధాన కారణం.

తెలుగులో పత్రికా విజయానికి దాని సర్క్యులేషన్ సంకేతంగా తీసు కుంటున్న ఈ రోజులలో పత్రికలను ఎక్కువగా అమ్మాలనేఆశతో అసం దర్భమైన 'సెక్సు' శీర్షికలు, అసభ్యకరమైన కథల శీర్షికలు, అచ్చులో తమ పేరు చూచుకుని మురిసి, ఎక్కువ పత్రికలు కొనుగోలుచేసే పాఠకుల కోసం చవకబారు "ప్రశ్నలు-జవాబులు" లాంటి శీర్షికలు నిర్వహిస్తున్నారు. లోగడ జన సామాన్యాన్ని వారు చదివే పత్రికల స్థాయినిబట్టి బేరీజు వేసే అవకాశం వుండేది. ఇప్పుడూ అంతేకాని పత్రికలు పాఠకులను తమ స్థాయికి పెరిగే అవకాశం ఇచ్చే పద్ధతి కాలగర్భంలో కలిసిపోయి పాఠకుని స్థాయికి వారి పత్రికలు దిగజారే క్షీణదశకు చేరాయి.

ఇంతకు - 'యువభారతి' వారు పాతికేళ్ళ పత్రికారచన అని నా ప్రసంగ వ్యాసానికి ఒక పరిధి ఇచ్చారు. పాతికేళ్ళు సాహితీ సాంస్కృతిక రంగంలో "యువభారతి"కి నిండిన విషయం సరేకాని పత్రికా రచనపై ఏర్పాటు చేసిన ఈ సదస్సు పత్రికా రచన ఒక నూతన పరిణామం చెందిన కాలాన్నో, లేక కొత్త పత్రికల రాకతో పత్రికా రచన పోకడలలో వచ్చిన మార్పును దృష్టిలో వుంచుకునో ఈ కాల నిర్ణయం చేస్తే బాగుండునేమో అని పించింది.

ఏమైనా- రోజురోజుకు వైజ్ఞానికంగా, సాంకేతికంగా ఎంతో అభివృద్ధి చెందుతున్న ఈ సమాజానికి ఎప్పటికప్పుడు తాజా సమాచారం అందించే వైజ్ఞానిక శీర్షికలు, సైన్సు సంగతులకు ఈ వార, మాస పత్రికలలో తగిన ఘోతాదులో స్థానం వుండడంలేదు.

అయితే వీరు పేర్కొన్న పాతిక సంవత్సరాలకు పూర్వం "సాక్షి" శీర్షికను ప్రచురితమైన శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావు వ్యాసాలు తెలుగు సాహితీ సరస్వతికి కంఠాభరణాలు.

అంతేకాదు - 'ఆంధ్రపత్రిక'లో 1960 లో 75 వారాలపాటు చక్కని రేఖా చిత్రాలతోపాటు రేఖామాత్రంగా వివిధరంగాలకు చెందిన ప్రముఖుల స్వభావ స్వరూపాలను తేటతెల్లం చేసిన "తెలుగు వెలుగులు" శీర్షిక తెలుగు పత్రికామకల్లికి మణిమకుటం లాంటిది. బహుశా, ఈ శీర్షిక ప్రేరణతోనే అటు తర్వాత కొంతకాలానికి శ్రీ తిరుమల రామచంద్ర ప్రభృతులు "మరుపు రాని మనిషి" శీర్షికను "ఆంధ్రప్రభ"లో నిర్వహించారు. పిదప - ఇలాంటి శీర్షికే "ఆంధ్రజ్యోతి"లో "కొత్త కెరటాలు"గా వెలువడింది. "ప్రజాతంత్ర" వారపత్రికలో శ్రీ దేవులపల్లి ప్రభాకరరావు "చెప్పుకోదగ్గ మనుషులు" వంద మందిని పరిచయం చేశారు. వార పత్రికలలో ధారావాహికంగా మహాపురుషులను పరిచయం చేసిన శీర్షికలు, ఇదే శ్రేణిలో ఆ తర్వాత మరికొన్ని వచ్చాయి. "అంధ్రప్రభ"లోనే మిక్కిలినేని నటీనటుల పుట్టుపూర్వోత్తరాలు తెలిపే "నట రత్నాలు" శీర్షిక వ్రాశారు. "ఆంధ్రజ్యోతి" వార పత్రికలో శ్రీ నండూరి పార్థసారథి సంగీత విద్వాంసులపై "సరిగమపా" శీర్షిక నడిపారు. రాజకీయ తదితరరంగాల "మహానాయకులను" శ్రీ తుర్లపాటి కుటుంబరావు "ఆంధ్ర జ్యోతి" ద్వారానే పరిచయం చేశారు.

ఈ శీర్షికల ప్రభావంతో మరెందరో మరికొన్ని శీర్షికల నిర్వహించినా వాటిలో వైవిధ్యం కరవైంది.

"తెలుగు వెలుగు" శీర్షికలో-"ఆంధ్రపత్రిక" ఆనాటి సంపాదకులు శ్రీ శివలెంక శంభుప్రసాద్ స్వయంగా అనేక వ్యాసాలు వ్రాశారు. ఈ శీర్షిక క్రింద ప్రచురితమైన వ్యాసాలన్నీ తెలుగు జర్నలిజంలో వ్యక్తుల జీవిత చిత్రాలు వ్రాయడానికి పాఠ్యపుస్తకంగా పనికివస్తాయి. ఉదాహరణకు-రాజకీయ వేత్త శ్రీ ఎన్. జి. రంగాపై వ్రాసిన వ్యాసం చూడండి ఎలా ప్రారంభం అవుతుందో: "ఆయనకు ప్రథమస్థానం రాదు; ద్వితీయస్థానం పనికిరాదు." ఇలా సూత్ర ప్రాయంగా రెండు వాక్యాలలో శ్రీ ఎన్. జి. రంగా రాజకీయావస్థను చిత్రిం చారు. చేంతాడు ఆదర్శంగా గల రచయితలకు ఇదొక గుణపాఠం. పోతే- కృష్ణశాస్త్రిలాంటి మహాకవులు కొందరిగురించి ఈ శీర్షికలో ప్రముఖ

సంపాదకులు శ్రీ నండూరి రామమోహనరావు "కొండను అద్దంలో చూపిన రీతిన" చూపారు.

"మరుపురాని మనిషి" శీర్షికలో ఎక్కువగా, చక్కగా శ్రీ తిరుమల రామచంద్ర వ్రాశారు. శ్రీ బాలాంత్రపు వేంకటరావు లాంటి కొందరిపై శ్రీ ఆరుద్ర ఆకర్షణీయమైన ఎత్తుగడతో వ్రాసిన వ్యాసం అపురూపమైంది.

ఇక "కొత్త కెరటాలు" శీర్షికలో బాపు, ఆరుద్ర, దాశరథి, యద్దనపూడి సులోచనా రాణిలపై శ్రీ నండూరి రామమోహనరావు వ్రాసిన రేఖాచిత్రాలు వాటికవే సాటి. ఇందులో శ్రీ పురాణం సుబ్రహ్మణ్యశర్మ "సకల జన సన్మిత్రుడు - నడుస్తున్న నవ్వుల రథం" శీర్షికన ధ్వన్యనుకరణ సమ్రాట్ శ్రీ వేణుమాధవ్ పై వ్రాసిన వ్యాసం ఆయన పరిశీలనాశక్తికీ, శైలీ విన్యాసానికి మచ్చుతునక. నిజానికి శ్రీ పురాణం సుబ్రహ్మణ్య శర్మ పురాణం సీత పేరుతో సుమారు పాతిక సంవత్సరాలుగా నిర్వహించిన "ఇల్లాలి ముచ్చట్లు" శీర్షిక ఆయన ప్రతిభకు సంకేతమైంది. శ్రీ నార్ల వెంకటేశ్వరరావు - "పురాణాలలోని సీతవలె పురాణం సీత అందరి మన్ననలను పొందుతున్నద"ని ఆశీర్వచనం పలికారు. "ఇల్లాలిముచ్చట్లు" కొన్ని విశ్వవిద్యాలయాలకు పాఠ్యగ్రంథంగా కూడా నిర్ణయించారు.

శ్రీ ముట్నూరి కృష్ణారావు సంపాదకత్వాన వెలువడిన "కృష్ణాపత్రిక"లో శ్రీ రావూరు వెంకటసత్యనారాయణరావు "వడగండ్లు" శీర్షికగా నిర్విరామంగా పధ్నాలుగేళ్ళు వ్రాశారు. ఆతర్వాత ఇదే శీర్షిక ఆయన కొన్నాళ్ళు "ఊక్కాని" "జ్యోతి" వారపత్రికల్లో వ్రాశారు.

అంతకుముందు - అంటే పాతికేండ్లకు ముందు అనేక పత్రికలలో ఎందరో మహానుభావులు ఎన్నో ప్రత్యేక శీర్షికలు నిర్వహించారు. "ఆంధ్ర పత్రిక"లో శ్రీ దాసు వామనరావు వ్రాసిన "కాలక్షేపం" శీర్షిక, ఆంధ్రపత్రిక నుంచి రిటైర్ అయ్యాక "ప్రజామత"లో ఆయన వ్రాసిన "ఇష్టాగోష్టి" శీర్షిక అప్పటికీ, ఇప్పటికీ చెప్పుకోదగింది. ఈయన ఇంకా "తమాషా ఖులాసా" లాంటి శీర్షికలు నడిపారు.

శ్రీ ముట్నూరి కృష్ణారావుగారే స్వయంగా వేదాంత శీర్షిక "లో వెలుగులు" నిర్వహించేవారు. అందులోనే శ్రీ మల్లాది రామకృష్ణశాస్త్రి "చలువ

మిరియాలు" శీర్షికలో చక్కటి చెణుకులు వ్రాసేవారు. "కృష్ణాపత్రిక" లో "సాహిత్యం - మీమాంస", "నాటకం - నృత్యం", "శిల్పం - చిత్ర రచన", "వింతలు - విశేషాలు" ఇత్యాది శీర్షికలు ఉండేవి.

శ్రీ ఉప్పులూరి కాళిదాసు "ఆనందవాణి" లో శ్రీ రావూరి సత్యనారాయణరావు "కప్పు కాఫీ" అనే శీర్షిక నిర్వహించేవారు.

"ఆంధ్రప్రభ" తొలి రోజులలో న్యాయపతి నారాయణమూర్తి "పాన్ సుపారీ" నార్లవారేమో " మాటా - మంతీ", "పిచ్చాపాటీ" శీర్షికలు వ్రాశారు. ఆంధ్రప్రభలోనే "వాస్తవమ్ము నార్లవారిమాట" శీర్షికను, ఆ తర్వాత "ఆంధ్ర జ్యోతి"లో "నవయుగాల బాట" శీర్షికను నిర్వహించారు. నార్లవారి విశ్వాసాలలో, వైఖరులలో వచ్చిన మార్పులను ఈపద్యాలు ప్రస్ఫుటం చేస్తాయి. సుప్రసిద్ధ విద్వాంసులు శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మ ఈ శీర్షిక క్రింద నార్ల వ్రాసిన పద్యాలపై అభిప్రాయం చెబుతూ - "వేమన్నను అనుకరించడంలో మీయంత నెగ్గినవారు నా దృష్టిలో లేరు" అన్నారు. "అయితే - భావాల కుదింపులోనూ, భాష చిక్కదనంలోనూ, అభిప్రాయాల వివేచనంలోనూ వేమన మార్గానికి మెరుగులు పెట్టింది మీ రచన" అని కీర్తించారు.

కొద్దిరోజులే అయినా శ్రీశ్రీ నిర్వహించిన "తాడూ-బొంగరం", ఆరుద్ర వ్రాసిన "కుర్చీలో కూనిరాగం", "ప్రజాతంత్ర"లో శ్రీ గోపాలశాస్త్రి "గోలాయణం", "సల్లాపగోపాలం", "ఆంధ్రప్రభ"లో శ్రీమతి తెన్నేటి హేమలత "ఊహాగానం", "కృష్ణా పత్రికలో" శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి "ఇయం గేహే లక్ష్మి" "ఆంధ్రజ్యోతి"లో శ్రీరమణ"చిత్రోక్తులు",ఆ తర్వాత "టీకప్పులో సూర్యుడు", ఆయనే ఆదివారం అనుబంధంలో నిర్వహించిన "హాస్యజ్యోతి" శీర్షికలు పేర్కొనదగినవి. "ఆంధ్రప్రభ"లో శ్రీ విద్వాన్ విశ్వం అనేక అంశాలపై మీటిన "మాణిక్యవీణ" శీర్షిక, అందులోనే శిల్ప్రప్రధానమైన "తెలుగు తల్లి" శీర్షికను వివిధ రచనయితలు నడిపిన తీరు, "ప్రమదావనం" శ్రీమతి మాలతీ చందూర్ ఈనాటికీ నిర్వహిస్తున్న ధోరణి, 'ఆంధ్ర పత్రిక'లో భాషా విషయాలపై శ్రీ తిరుమల రామచంద్ర వ్రాసిన "నుడి - నానుడి" శీర్షిక, "ఆంధ్ర జ్యోతి"లో "నవ్వుల రథం" శీర్షిక, "విజయచిత్ర"లో "సంస్మరణ", "తెర వెనక" "విజ్ఞాన వేదిక" ఇత్యాది శీర్షికలను నిర్వహించిన తరహా చెప్పుకోదగింది.

తెలుగులో తొలుదొలుత వైజ్ఞానిక శీర్షికలు నిర్వహించినవారు శ్రీయుతులు శ్రీపాద గోపాల కృష్ణమూర్తి, మహీధర నళినీమోహన్, నండూరి రామమోహనరావులు.

"అమరావతి కథలు" శీర్షికను "ఆంధ్రజ్యోతి"లో అత్యద్భుతంగా వ్రాసిన శ్రీ సత్యం శంకరమంచి అజరామరుడయ్యాడు. "స్వగతంబు" లాంటి శీర్షికలో కథనాన్ని, వ్యంగ్యాన్ని, సున్నిత హాస్యాన్ని మేళవించి వ్రాసిన "తంబు" శ్లాఘనీయుడు.

నిజానికి మాగజైన్ జర్నలిజంలో ఒక వెలుగు వెలిగిన "తెలుగు స్వతంత్ర" శీర్షికల నిర్వహణలోనూ కొత్త ఒరవడి పెట్టింది. అయితే శ్రీ గోరాశాస్త్రి "వినాయకుడి వీణ" అందులో ప్రత్యేక ఆకర్షణ.

మాసపత్రిక "స్వాతి"లో శ్రీ చలసాని ప్రసాదరావు వ్రాసిన "కబుర్లు", శ్రీమతి మాలతీచందూర్ వివిధ ఇంగ్లీషు నవలలు పరిచయం చేస్తూ వ్రాసిన శీర్షిక, కొంతకాలమే వచ్చినా "తరుణ" మాసపత్రికలో ప్రవేశపెట్టిన శీర్షికలు, "భారతి"లో గ్రంథసమీక్షలు, "ఆపీ-ఇపీ", ఇత్యాది ఎన్నో శీర్షికలు నిన్నమొన్నటిదాకా పాఠకులకు తెలిసినవే. "స్రవంతి", "వేకువ", "సృజన" లాంటి సాహిత్య పత్రికలలో; "చందమామ", "బొమ్మరిల్లు", "బాలజ్యోతి" "బాలరంజని", "బాలచంద్రిక" లాంటి పిల్లలపత్రికలలో; "వనిత", "వనితా జ్యోతి" "కలువబాల" లాంటి మహిళల పత్రికలలో అనేక కోణాలనుంచి రచనలు ప్రచురితమైనా గుర్తించుకోదగిన శీర్షికలేవీ కన్పించవు.

నాబోటివారు "హైదరాబాద్ కబుర్లు" అనీ, రాజధాని లేఖ అనీ లేదా శ్రీ జి. కృష్ణ ప్రభృతులు "మూసీ కినారే" శీర్షికన, శ్రీ వాకాటి పాండురంగారావు "రామ సంజీవి" పేరున ''యమునా తీరే'' లాంటి ఎన్నో శీర్షికలు వ్రాసినా, అవి సమకాలీన సంఘటనలను కళ్ళకు కట్టినవి మాత్రమే.

ఇలాగే దినపత్రికలలోనూ మరెన్నో ఆలోచనల రేకెత్తించిన, పాఠకులను వెర్రెక్కించిన శీర్షికలు ఎన్నో వున్నాయి. వాటన్నింటినీ పేర్కొనడం ఈ కొద్ది సమయంలో సాధ్యంకాదు. పైగా దిన పత్రికలకు సంబంధించిన అంశం నాకిచ్చిన విషయం పరిధిలోకి రాదు కూడా.

ఈ మధ్య "ఇండియా టుడే" పక్షపత్రికగా తెలుగులో వస్తున్నది. "సుప్రభాతం" శ్రీ ఎ. బి. కె. ప్రసాద్ సంపాదకత్వంలో వెలువడుతున్నది. ఇవి రంగురంగుల చిత్రాలతో కనులకింపుగా మిఠాయి పొట్లంలాగా వస్తున్నాయి. అయితే వీటిని ఇంకా కొంతకాలం పరిశీలించవలసి వుంటుంది.

పాతిక సంవత్సరాల పత్రికా రచన గురించే ప్రస్తావించమని "యువభారతి" సూచించిన దృష్ట్యా-తెలుగులో తొలినాటి పత్రికలో— "సత్యదూత", "వృత్తాంతిని", "వర్తమాన తరంగిణి", "సంవాదకౌముది", "హితవాది", "శ్రీయక్షిణి", "సుజనరంజని", "ఆంధ్రభాషా సంజీవని", "పురుషార్థ ప్రదాయిని" మొదలగు వాటిలో ఏమేమి శీర్షికలుండేవో పరిశీలించే జోలికి పోలేదు.

అయితే శ్రీ వీరేశలింగం పంతులు నెలకొల్పిన "వివేకవర్ధిని" ఫైళ్ళు కూడా ఈనాడు లభ్యం కాని గడ్డుసితి వున్నది. ఆధునికాంధ్ర రచనకు కావలసిన "పత్రికలే" కనుమరుగై పోతున్న ఈ తరుణంలో ప్రభుత్వం ఇప్పటికైనా కళ్ళు తెరచి మిగిలివున్న పత్రికలనైనా "మైక్రోఫిల్మ్"లు తీయించవలసి వుంది. ఇవి చరిత్ర రచనకే కాకుండా పత్రికలపై పరిశోధన చేసేవారికి ఉపకరిస్తాయి.

పోతే ఒకమాట - ఇంతసేపు నేను వివరించిన శీర్షికలన్నీ నా దృష్టికి వచ్చిన వాటిలో నా జ్ఞాపకానికి చిక్కినవి, నాకు నచ్చినవి మాత్రమే. ఇంకా ఎన్నో పత్రికలలో మరెన్నో శీర్షికలను నిర్వహించిన మహానుభావులు లేక పోలేదు, వారందరికీ నా వందనాలు

# తెలుగు పత్రికల్లో ప్రత్యేక శీర్షికలు

—శ్రీ సిహెచ్. దయానంద్

నేడు పత్రికా రచనలో ప్రత్యేక శీర్షికలకు గల స్థానం విశిష్టమైంది. ఈ శీర్షికా రచనలో సృజనధర్మం, అనుభూతి ప్రధానంగా కనిపిస్తాయి. ఒక పత్రికను చదివే పాఠకుడు ఆ పత్రికలో ఏయే శీర్షికలున్నాయో మొదట చూస్తాడు. శీర్షికల ప్రాధాన్యతను బట్టి పత్రిక సర్క్యులేషన్ ఉంటుంది. పత్రికలు తమ వ్యాపార ధోరణులను పరిరక్షించుకుంటూనే పాఠకులకు అవసరమైన, వివిధరంగాలకు సంబంధించిన సమాచారాన్ని అందించాలి. ప్రతి రోజూ పత్రికా కార్యాలయాలకు ఎన్నో రచనలు వస్తూఉంటాయి. అవన్నీ చదివి, యోగ్యమైనవి ఏరి పత్రికలో ప్రచురించాలంటే శ్రమతో కూడిన పని. పత్రికా రచన వేగవంతమైంది. అందుకే ప్రతి పత్రికా చాలావరకు శీర్షికా రచయితలకే ఆ పనిని అప్పగిస్తుందంటే అతిశయోక్తికాదు.

ఈ శీర్షికా రచన స్వాతంత్ర్యానికి పూర్వం ఎక్కువగా కన్పించదు. ఈ దశాబ్దినుండే ఈ శీర్షికలకు ప్రాధాన్యత లభించింది. హైదరాబాద్ కేంద్రీయ విశ్వవిద్యాలయం ప్రచురించిన "ఆలోకన 1985" వాఙ్మయ సూచికను పరిశీలిస్తే ఆ ఒక్క సంవత్సరంలోనే 85 శీర్షికలు కన్పించాయి. వీటి సంఖ్య ఇటీవల మరీ పెరిగింది.

ఈ శీర్షికా రచనలో ఏ వారానికావారం ఏదో ఒక విషయాన్ని తీసుకొని విమర్శ చేయడం, లేదా ఏదో ఒక విస్తృత విషయాన్ని తీసుకొని, దాన్ని అనేక అంశాలుగా విభజించి ప్రతి వారం క్రమానుస్యూతితో వివరించడం కనిపిస్తుంది.

**1913 - 33** ప్రాంతాల్లో సువర్ణరేఖ, ఆంధ్రపత్రికల్లో పానుగంటి లక్ష్మీ నరసింహారావు వ్రాసిన "సాక్షి" పరంపర ఈ శీర్షికా రచనకు ఒరవడి దిద్దిందని చెప్పవచ్చు. "సాక్షి" లో స్పృశించని అంశం ఏదీలేదు. పరబ్రహ్మం నుండి పచనం వరకు పానుగంటి వ్రాసిన వివిధాంశాలు జనరంజకంగా ఉండేవి.

"హితకారిణి" (1913) పత్రికలో ముద్నంగి లక్ష్మీనరసింహశర్మ "నవయుగ పాఠ్య పుస్తకం" అనే శీర్షికను ఏలూరు నుంచి నిర్వహించారు.

ఈ శీర్షికల్ని స్త్రీలు ఆనాడు కూడా సమర్థవంతంగానే నిర్వహించారు. వింజమూరి వెంకటరత్నమ్మ "అనసూయ" (1917) పత్రికలో "అనకట్టకి పూర్వం కబుర్లు", "వందేమాతరం" వంటి శీర్షికలను నిర్వహించి పాఠకుల అభిమానాన్ని చూరగొన్నారు.

భారతి మాస పత్రికలో ప్రారంభం నుంచీ కాశీనాథుని నాగేశ్వరావు పంతులు "సాభిప్రాయ విశేషా"లను వార్తా సమీక్షగా, అభిప్రాయ ప్రకటనంగా, అనుభూతి వ్యక్తీకరణంగా, దేశాభ్యుదయ ప్రోత్సాహకారకంగా వ్రాశారు. అందులో ప్రతి మాసం వారు సాహిత్యేతర విషయాల్ని కూడా ఆ మాసంలో జరిగినవి నిర్భయంగా, సరసంగా రాసేవారు.

శీర్షికా రచనలో "ప్రొఫైల్స్"కు మొదటి నుండీ ప్రముఖస్థానం ఉంది. ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం మాటల్లో చెప్పాలంటే "ఒక దృక్కోణంతో ఒక వ్యక్తి ప్రధాన వ్యక్తిత్వాన్ని సమకాలీన వాతావరణానికి అన్వయించి సమీక్షించడం ప్రొఫైలుకు ప్రధాన లక్షణమౌతుంది''. ఈ ప్రక్రియను చేపట్టి తర్వాతి శీర్షికా రచయితలకు ఆదర్శప్రాయుడైన వారు శివలెంక శంభుప్రసాద్. వీరు అనేక రంగాల్లో ప్రసిద్ధులైన ఆంధ్రనాయకులను గురించి "తెలుగు వెలుగులు" శీర్షికతో ఆంధ్రపత్రికలో దాదాపు యాభై ప్రొఫైల్స్ వ్రాశారు. ఇందులో స్వరూపావగాహన చేసే చురుకైన భాషతో, హృదయంగమమైన చమత్కారంతో ఆయా వ్యక్తుల చిత్రణను ప్రదర్శించేవారు.

డి. వి. సుబ్బారావును గూర్చి రాస్తూ; ''ఒకసారి ఆయన ఒక పాత్రను 'చంపుతాను' అని భయపెడుతూ నటించేసరికి, ఆ నటుడు, ఎన్నో రిహార్సల్సు వేసి ఉన్నా ఆ క్షణంలో భయపడి పారిపోయాడు.... ఉత్సాహ ప్రభుశక్తి యుతమైన 'ఉద్యోగం' వారిది."

శ్రీ దామోదరం సంజీవయ్యను గురించి రాస్తూ— "అదృష్టమే కొందరి వెంట పడుతుంది....అదృష్టం వెంటపడితే పారిపోకుండా ఉన్నవారే నిజానికి అదృష్టవంతులవుతారు. అలాంటి అదృష్టవంతుడు శ్రీ దామోదరం సంజీవయ్య."

శ్రీ అద్దంకి శ్రీరామమూర్తిని గురించి రాస్తూ- "నాటకం చూసిన తర్వాత కొన్నాళ్ళ వరకు అద్దంకివారి ఆవేదనా స్వరం వెంటబడి వినబడు తుంది. అద్దంకి మరుగున పడిపోయి దశరథుడే కనబడుతాడు.........అద్దంకి శ్రీరామమూర్తి కంఠం శంఖనాదం లాగా ఆరంభమై ఘంటానాదంలాగా నిలిచి మోగుతుంది."

శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ గురించి రాస్తూ - "శిష్యవర్గం ప్రచా రంతో కొందరు, అభిమానుల ఆదరంతో కొందరు, అధికార ప్రాభవంతో కొందరు గొప్పవారు అవుతుంటారు. కేవలం తమ పరిశోధనతోనే, దాని ఫలిత మైన రచనతోనే గొప్పకెక్కినట్టి వారు శ్రీ శర్మగారు........ శర్మగారు చాకలి బండ అనుకున్నవాటినికూడా చదువుబండలుగా చదివిన దిట్ట." ఇలా "తెలుగు వెలుగులు" శీర్షికలో ఎన్నైనా ఉదాహరణలు ఇవ్వవచ్చు.

అనంతర కాలంలో చాలామంది శీర్షికా రచయితలు ప్రొఫైల్స్ రాశారు. ఆచార్యరంగా "ధన్యజీవులు", గొట్టిపాటి బ్రహ్మయ్య "జాతి వెలుగులు", తుర్లపాటి కుటుంబరావు "మహానాయకులు", "జాతి నిర్మాతలు", ఇటీవల "ఆంధ్రజ్యోతి"లో పీరే రాస్తున్న "ఈ వారం వ్యక్తి", వేమూరి రాధాకృష్ణ మూర్తి "ఆణిముత్యాలు", కోవెల సంపత్కుమారాచార్య "జనధర్మ"లో రాసిన "మన పండితులు, కవులు, రచయితలు", ఎ. పందరినాథ్ "చరిత్ర కందని మృతవీరులు", ఆచార్య బి. రామరాజు "మరుగునపడ్డ మాణిక్యాలు", ఆరుద్ర "తెలుగు వెలుగులు", తిరుమల రామచంద్ర "మరపురాని మనిషి", మిక్కిలి నేని రాధాకృష్ణమూర్తి "నటరత్నాలు", నండూరి పార్థసారథి "సరిగమపా", దేవులపల్లి ప్రభాకరరావు "మెచ్చుకోదగిన మనుషులు", కొండముది శ్రీరామ చంద్రమూర్తి "నోబెల్ సాహిత్య బహుమతి గ్రహీతలు", కె. వి. రమణారెడ్డి "ఆధునిక భారతీయ సాహిత్య కర్తలు", బుడ్డిగ సుబ్బరాయన్ "ఉత్తమ నాయకత్వం" ఇలా ఎన్నైనా చెప్పవచ్చు. బి. వి. పట్టాభిరాం ఆంధ్రప్రభ వార పత్రికలో "బాలలకు బంగారుబాట" శీర్షికతో పిల్లలకు అర్థమయ్యే శైలిలో పలువురు మహనీయుల ప్రొఫైల్స్ రాశారు.

దిన పత్రికల్లో సంపాదకీయ పేజీలో ప్రధాన వ్యాసానికీ, ఉత్తరాల శీర్షికకూ మధ్య "మిడిల్" అని పిలువబడే శీర్షిక ఉంటుంది. నేడు వస్తున్న దిన పత్రిక లన్నింట్లో ఈ 'మిడిల్స్' చోటుచేసుకుంటున్నాయి. ఈ 'మిడిల్స్'

హాస్యం, వ్యంగ్యం, అధిక్షేపం కలిగి పాఠకుల్ని ఆకర్షిస్తాయి. డి.వి. నరసరాజు 'అక్షింతలు', నీలంరాజు లక్ష్మీప్రసాద్ "ఆలోకన", చలసాని ప్రసాదరావు "కబుర్లు", గుడిపూడి శ్రీహరి "హరివిల్లు" శీర్షికలు ఇలాంటి "మిడిల్స్"కు ఉదాహరణలు.

శ్రీ రావూరు సత్యనారాయణ కృష్ణా పత్రికలో 1938 నుంచి ప్రారంభించిన "వడగళ్ళు" శీర్షిక విపుల ప్రచారాన్ని పొందింది. వీరు ఆంధ్రప్రభలో "ఆషామాషీ" (1959) శీర్షిక దాదాపు 35 సంవత్సరాలు రాశారు. ఇన్ని సంవత్సరాలు శీర్షికను నిర్వహించిన వారు వీరొక్కరేనేమో. ఇవి కాకుండా వీరు కృష్ణాపత్రికలో "పల్లేరు కాయలు", ఆనందవాణిలో "కప్పుకాఫీ" వంటి శీర్షికలు నిర్వహించారు. ఇవి పునర్ముద్రిస్తే దాదాపు 20 సంపుటాలు అవుతాయి. హాస్యం, సృజనగుణం అమితంగా ఉండి సామాజిక జీవితం, పల్లె బ్రతుకు, ఆంగ్లనాగరికతా ప్రభావానికి దూరంగా ఉన్న తెలుగువాళ్ళ వ్యక్తిత్వం ఈ శీర్షికల్లో కన్పిస్తాయి.

విద్వాన్ విశ్వం "తెలుపు—నలుపు", "అవీ—ఇవీ", "ఇవాళ", "మాణిక్య వీణ", "వారం వారం" శీర్షికలు వివిధ పత్రికల్లో రాశారు. ఈ శీర్షికలు పాండిత్యం, కవిత్వం, పత్రికా రచనం ఈ మూడు పెనవేసుకొన్న రచనలు. వీటిలో కవితా గుణం, అభివ్యక్తి స్పష్టత కనిపిస్తుంది. సాహిత్య సాంఘిక వార్తాది అనేక విషయాలు ఈ శీర్షికలకు వస్తువులైనాయి.

శ్రీ తిరుమల రామచంద్ర "సాహితీ సుగతుని స్వగతం", "నుడి—నానుడి" శీర్షికలు నిర్వహించారు. "సాహితీ సుగతుని స్వగతం" లో భాష, సాహిత్యానికి సంబంధించిన అంశాలు, "నుడి—నానుడి" కేవలం భాషా సంబంధిగా కన్పిస్తుంది. ఈ శీర్షికల్లో వీరి బహుభాషా పాండిత్యం కన్పిస్తుంది. ఇటీవల బూదరాజు రాధాకృష్ణ రాసిన "మాటల మూటలు", డి. దిలీప్‌కుమార్ "పదాల వెనుక కథలు", సిస్టర్ తేక్లా "పదాల పదనిసలు" భాషా సంబంధి శీర్షికలే.

పురాణం సుబ్రహ్మణ్య శర్మ "పురాణం సీత" పేరుతో "ఇల్లాలి ముచ్చట్లు"ను 1967లో ప్రారంభించారు. రావూరి "ఆషామాషీ" తర్వాత చాలా కాలం కొనసాగిన శీర్షిక ఇదేనని చెప్పవచ్చు. ఇవి పాఠకుల్ని అమితంగా ఆకర్షించాయి. రచయిత నేటి జీవిత యాధార్థ్యం గ్రహించడానికి పొందిన

తపన ఈ శీర్షికలో కనిపిస్తుంది. జీవితంలోని బాధకు, ఆవేదనకు నివేదనలుగా ఈ ముచ్చట్లున్నాయి. ఇది కఠినమైన బ్రతుకు తీవ్రతను గుర్తింప చేయటానికి హాస్యం అనుపానంగా చేసిన శీర్షికా రచన. ఇవి "మీరు సరదాగా చదువు కునేందుకు నేను సరదాగా రాశాను", "అజ్ఞానాన్నీ, మూర్ఖత్వాన్నీ, అహం కారాన్నీ, ఆడంబరాన్నీ సహించి ఆరాధించే గుణం నాకు లేదు" అనడం గుర్తింపవచ్చు. ఈ శీర్షికలో బాధ, హాస్యం పెనవేసుకుపోయాయి.

శ్రీమతి లత ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రికలో "ఊహాగానం" శీర్షికను దాదాపు ఒక దశాబ్దం నిర్వహించారు. ఈ శీర్షికలో హాస్యం ఉండదు. కవిత్వం ఉంటుంది. అర్థంకాని జీవితానంతత్వం గ్రహించటానికి రచయిత్రి చేసిన ఊహా యాత్ర కవితారూపంలో "ఊహాగానం" వెలువడింది. ఇందులో ఆవాలు మొదలు అంతర్జాతీయ సమస్య వరకూ, అచ్చమ్మ గారి అరువు బేరం దగ్గ ర్నుంచి ఆధ్యాత్మికమైన కావ్యాన్వేషణ వరకూ ఎన్నో విషయాలు ఈమె చర్చిం చారు. ఇల్లిందల సరస్వతీ దేవి, కె. రామలక్ష్మి, మాలతీ చందూర్ వంటి రచయిత్రులు ఈ శీర్షికలకు వన్నె తెచ్చారు.

ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యం "తెలుగులో వెలుగు" శీర్షికతో ఆంధ్ర ప్రభలో వారం వారం రాసిన వ్యాసాలు ఆలోచనాత్మకంగా ఉన్నాయి. శ్రీ పొత్తూరి వెంకటేశ్వరరావు మాటల్లో చెప్పాలంటే "ఇది లైట్ ఫీచర్ కాదు. ఇందులో బరువైన వ్యాఖ్యానాలున్నాయి. రచయిత అభిప్రాయాలతో భేదించే వారు ఉండవచ్చును కాని వాటిని తేలికగా కొట్టిపారవేసేవారు ఉండరు."

వీరి "సాహిత్య చరిత్రలో చర్చనీయాంశాలు" దాదాపు 5 సంవత్సరాలు ధారావాహికంగా నడిపించిన శీర్షిక. సాహిత్య చరిత్రలో వస్తుకవిత, జాను తెనుగు, ప్రబంధం వంటివి ఇంకా చర్చనీయాలుగానే ఉన్నాయి. ఇలాంటి అంశాలను సమాలోచించి లోతుగా పరిశీలించడం ఈ శీర్షికలో చేశారు. దేశీయమైన సమన్వయాత్మక విమర్శ ఈ శీర్షికలో కన్పిస్తుంది.

ఆంధ్రజ్యోతి ఆదివారం అనుబంధంలో చేకూరి రామారావు రాస్తున్న "చేరాతలు" అందరికీ పరిచితమే. ఈ శీర్షికలో ప్రధానంగా భాషా, సాహిత్యాం శాలకే చోటు ఉంది. ముఖ్యంగా వీరు యువ కవులను, రచయితలను ప్రోత్సహించడం కనిపిస్తుంది. అప్పుడప్పుడూ ఏ ముత్యాల సరం గురించో,

వచన కవిత్వ లక్షణ పరామర్శో, భాషా సంబంధి అంశాలో చర్చిస్తుంటారు. పత్రికా రచనకు ఒదిగిన శీర్షికల్లో "చేరాతలు" ఒకటి.

సురవరం ప్రతాపరెడ్డి గతంలో గోల్కొండ పత్రికలో "గ్రంథ విమర్శనము" శీర్షిక నిర్వహించాడు. టి. ఎల్. కాంతారావు "కలాలూ—సంకలనాలు" కూడా ఇలాంటి శీర్షికే. ఈ శీర్షికలు గ్రంథ సమీక్షల్ని చేశాయి. ఐతే, టి. ఎల్. కాంతారావు "కలాలూ—సంకలనాలు"లో చేసిన సమీక్షల్లో ఒక క్రమం అంటూ లేదు. ఆంధ్రప్రభలో పి. ఎస్. ఆర్. "మంచి పుస్తకం" శీర్షికను నిర్వహించారు. ఈ శీర్షిక కూడా గ్రంథ సమీక్షకు సంబంధించిందే.

ప్రవీణ్ "రాజధాని కబుర్లు", రామసంజీవి "యమునాతీరే", శ్రీవాత్సవ "రసన" హైదరాబాద్‌లో, ఢిల్లీలో, మద్రాసులో జరిగే సాంస్కృతిక, సాంఘిక కార్యకలాపాలను ఎప్పటికప్పుడు పాఠకులకు అందించిన ప్రత్యేక శీర్షికలు, చీకోలు సుందరయ్య రాస్తున్న ''రంగతరంగం'' శీర్షిక కూడా ఇలాంటిదే. జంటనగరాల్లో జరిగే సాహితీ సాంస్కృతిక చైతన్యానికి ఈ శీర్షిక నిదర్శన మంటే అతిశయోక్తి కాదు. మెరమెచ్చులకు, పొగడ్తలకు గురికాకుండా వాస్త వాలను అక్షరబద్ధం చేసే ప్రయత్నం ఈ శీర్షికలో కన్పిస్తుంది.

ఇలా పత్రికా రచనలో సినీ శీర్షికలు, వైజ్ఞానిక శీర్షికలు, రాజకీయ శీర్షికలు, స్త్రీల శీర్షికలు, బాలల శీర్షికలు ఎన్నో కన్పిస్తాయి. అవన్నీ వివ రించేందుకు సమయం చాలదు. మొత్తానికి జర్నలిజం చరిత్రలో ఈ దశాబ్దం "శీర్షికాయుగం" అంటే అతిశయోక్తికాదు.

# న్యూస్ మ్యాగజైన్లు-అనివార్య పరిణామం

**—శ్రీ రాపోలు ఆనంద భాస్కర్**

టైమ్. ప్రపంచ వ్యాప్తంగా ఇంగ్లీష్ వార్తా పత్రిక పాఠకులు సగర్వంగా చదివే రెండు మాగజైన్లలో 'టైమ్' ఒకటి. రెండోది 'న్యూస్‌వీక్'. అమెరికా లోని న్యూయార్క్ నుంచి ప్రచురితమయ్యే టైమ్ వార్తా వారపత్రిక తన గురించి తాను ప్రచారం చేసేందుకు ఇటీవల ఒక ప్రకటన రూపొందించింది. (చూ: టైమ్ - సెప్టెంబర్ 30, 1991 సంచిక.)

విశిష్టతను చాటిచెప్పేందుకు ఒక్కో రంగంలో ఒక్కోపదం వాడు తుంటారు. ఆటోమొబైల్ రంగంలో విశిష్టతకు మారుపేరుగా 'లగ్జరీ' అని వాడతారు. మద్యం వ్యాపారంలో విశిష్టతకు మారుపేరు 'ప్రీమియం.' విమాన యానరంగంలో 'ఫస్ట్‌క్లాస్' అంటారు. హోటల్ పరిశ్రమలో విశిష్టమైనది 'ఫైవ్‌స్టార్'. షేర్ మార్కెట్‌లో 'బ్లూచిప్' అనే పదాన్ని విశ్వసనీయతకు, నిర్భయంగా పెట్టుబడి పెట్టేందుకు అనువైన కంపెనీ అని చెప్పేందుకు వాడతారు. ఈ అయిదు రంగాల్లో విశిష్టతను సూచించేందుకు వివిధ పదా లున్నట్లే సమాచార రంగంలో విశిష్టమైనదనాలంటే 'టైమ్' అనాలని ఆ న్యూస్ మాగజైన్ ప్రకటన ప్రచురించింది. ఈ సాహసం దినపత్రికలు చేయలేవు. ఎందుకు?

ప్రపంచ వ్యాప్తంగా అమ్మకాలు మాగజైన్లయిన టైమ్, న్యూస్‌వీక్ సాధించగలిగాయే గాని, వాషింగ్టన్ పోస్ట్, న్యూయార్క్ టైమ్స్, ఇంటర్నేష నల్ హెరాల్డ్ ట్రిబ్యూన్, గార్డియన్, టైమ్స్ ఆఫ్ ఇండియా వంటి విశ్వ వ్యాప్తఖ్యాతి ఉన్న దినపత్రికలు సాధించలేకపోయాయి. సాధించలేవు కూడా. అదే విధంగా మన దేశంలో టైమ్స్ ఆఫ్ ఇండియా, ఇండియన్ ఎక్స్‌ప్రెస్, హిందూస్థాన్ టైమ్స్, ది స్టేట్స్‌మన్ జాతీయస్థాయి దినపత్రికలు. కాని, ఆ పత్రికలు సాధించలేని దేశవ్యాప్త అమ్మకాలను ఇండియా టుడే, ఇలస్ట్రేటెడ్ వీక్లీ ఆఫ్ ఇండియా, ఫ్రంట్‌లైన్, సండే, ది వీక్ సాధించాయి. సమాచార రంగంలో న్యూస్ మాగజైన్లకున్న విశిష్టమైన, అనివార్యమైన స్థానం ఇది.

దీనికి స్పష్టమైన కారణాలు మూడు ఉన్నాయి. ఒకటి: కాలవ్యవధి; రెండు: పత్రిక కొనుగోలుకు చేసే ఖర్చు; మూడు: ఆకర్షణీయంగా, పుస్తక రూపంలో భవిష్యత్ అంచనాలు, గతం విశ్లేషణ, వర్తమానం ప్రస్తావనతో ఉండే సమాచారం చదివి, సులువుగా జీర్ణించుకోగల అవకాశం.

**కాలవ్యవధి :** దిన పత్రికను పాఠకునికి ప్రతి రోజు ఉదయం అయిదు గంటలనుంచి పదిగంటల మధ్య అందించేందుకు వీలుగా ఆయా పత్రికా సంస్థలు వివిధచోట్ల ముద్రణా ఏర్పాట్లు చేసి, ఎడిషన్లుగా వెలువరిస్తున్నాయి. అయినా, జాతీయస్థాయి పత్రికలు దేశవ్యాప్తంగా జిల్లా కేంద్రాలకు, ముఖ్య పట్టణాలకే పరిమితమవుతున్నాయి. కాలవ్యవధి సమస్యను అధిగమించేందుకు టైమ్, న్యూస్‌వీక్ లాంటి ప్రపంచ వ్యాప్త ప్రాచుర్యం ఉన్న పత్రికలు ఖండాలవారీగా ముద్రణా కేంద్రాలు తెరుస్తున్నాయి. దేశంలోని ఇలస్ట్రేటెడ్ వీక్లీ ఆఫ్ ఇండియా, సండే అబ్జర్వర్, సండే మెయిల్ వంటి పాఠకుని ఆది వారం తీరుబడిని ఉత్ప్రేరకంగా వాడుకొనే పత్రికలు బొంబాయి, ఢిల్లీ, మద్రాస్ వంటి కేంద్రాలలో ముద్రణ ఏర్పాట్లు జేసుకొన్నా, ఇండియా టుడే, ఫ్రంట్‌లైన్ వంటి పత్రికలకు ఆ అవసరం ఏర్పడలేదు. ఇలాంటి మాగజైన్లు మారుమూలల్లోని చిన్న పట్టణాలు, పాత తాలూకా కేంద్రాల్లో కూడా దొరుకు తాయి. ఒకటి, రెండురోజుల ఆలస్యమైనా, వీటిని చదవాలనే ఆసక్తి పాఠకు నిలో మిగిలి ఉండటంవల్ల కాలవ్యవధి వీటికి పెద్ద ప్రతిబంధకం కావడంలేదు.

**పాఠకునిపై పడే ధనభారం :** దేశ ఆర్థిక, పారిశ్రామిక పరిస్థితుల ప్రభావంతో దినపత్రికల ధరలు విపరీతంగా పెరిగిపోతున్న ప్రస్తుత తరుణంలో ఇంగ్లీషు పాఠకులు మాగజైన్లను ఆశ్రయించడం అనివార్యంగా మారింది. అంతర్జాతీయ దినపత్రికలలో దేని పేరయినా చెప్పమంటే, సగటు ఇంగ్లీషు పాఠకుడు చెప్పలేడు. అదే మాగజైన్ పేరు అడిగితే, చెప్పే అవ కాశం ఉంది. భారీఖర్చు మూలంగా ప్రపంచ వ్యాప్త అమ్మకాలున్న విదేశీ దినపత్రికలు భారీ గ్రంథాలయాల్లో, అధ్యయన కేంద్రాల్లో తప్ప, ఇళ్ళలో కనిపించవు. అదే టైమ్ వంటి విదేశీ వార్తా వార పత్రికలు కనీసం సంపన్నుల ఇళ్ళలోనయినా కనిపిస్తాయి.

**ముందుచూపు, విశ్లేషణ, ఆకర్షణ :** ప్రతి సోమవారం ప్రపంచ వ్యాప్తంగా పాఠకులకు అందే 'టైమ్' వారపత్రిక ప్రతి శుక్రవారం నాటికి వార్తారచన, ఎడిటింగ్ ముగించి, పేజీలను రూపొందించి, ముద్రణకు పంపే

హడావుడిలో ఉంటుంది. ప్రతినెల ఒకటో తేదీన, 16 వ తేదీన దేశవ్యాప్తంగా పాఠకులకు అందే ఇండియాటుడే ఆంగ్ల పక్షపత్రిక అంతకన్నా నాలుగు రోజుల ముందు వార్తారచన, ఎడిటింగ్ పనుల ముగింపు హడావుడిలో ఉంటుంది. దాదాపు అన్ని న్యూస్ మాగజైన్లకు ఈ రకమైన పరిస్థితే తప్పనిసరిగా ఉంటుంది. విస్తృతమైన ముద్రణ, పంపిణీ ఏర్పాట్లు ఉన్న న్యూస్‌మాగజైన్లు తమ పేజీలకు తుదిరూపం ఇచ్చే గడువును పొడిగించుకోగలుగుతాయి. సాధారణంగా, ఏ న్యూస్ మాగజైన్ అయినా కనీసం మూడు రోజులముందు తమ పేజీలకు తుదిరూపం ఇవ్వడాన్ని ముగించాలి. ఇలాంటి స్థితిలో రూపొందే వార్తలు, వార్తాకథనాలు, వార్తావ్యాసాలు ముందుచూపుతో, తమ పత్రిక పాఠకుల చేతుల్లో ఉండేనాటికి, అవి తాజాగా ఉండేందుకు వీలుగా రచిస్తుంటారు. అదేవిధంగా విశ్లేషణాత్మకంగా, సులువుగా అర్థం కాగలిగే వివరణలతో రచన చేస్తారు. వీటన్నింటికి మెరుపులాంటి తోడు ఆకర్షణీయమైన శైలి. ఈ మూడింటి మేళవింపు పత్రికలో బాగుందని పాఠకునికి తోస్తే, ఆ పత్రిక పట్ల ఆదరణ పెరుగుతుంది.

ఇక న్యూస్ మాగజైన్లలో వార్తాంశాలు, వార్తా కథనాలు రూపొందాల్సిన తీరును ప్రస్తావిస్తాను.

'లిబర్టీ' అనే ప్రఖ్యాత ఆంగ్ల మాగజైన్ ఎడిటర్‌గా పనిచేసిన హార్వే, వి. డ్యూయెల్ ప్రకారం న్యూస్ మాగజైన్‌లోని వార్తాకథనం పిక్నిక్‌కు వచ్చిన జనం శ్రద్ధగా వినేలా ఆకర్షిస్తున్న ఉపన్యాసం మాదిరి ఉండాలి. పిక్నిక్‌కు వచ్చిన జనం హుషారుగా ఉంటారు. కాని, ఉపన్యాసాలు వినే మానసిక స్థితిలో ఉండరు. అలాంటి వారిని ఆకర్షించే ఉపన్యాసం ఇవ్వడం చాలా కష్టం. న్యూస్ మాగజైన్ పాఠకుడు కూడా హడావుడిలో ఉంటాడు. ఆ పాఠకునికి ఖచ్చితమైన ఆసక్తి కలిగేలా వార్తాకథనాలు ఉండకపోతే, న్యూస్ మాగజైన్ ఆదరణ పొందలేదు.

దిన పత్రికలు జరిగిన ఉదంతాన్ని జరిగినట్లు వార్తగా అందిస్తుంటాయి. అందుకే ఒకరోజు దినపత్రికలో ఏదైనా ఉదంతం గురించి వచ్చిన వార్తకు మరుసటి రోజు వార్తకు తేడా ఉంటుంది. క్రమంగా ఆ ఉదంతం గురించి మొదట తెలిసిన వివరాలన్నీ తప్పు అని వార్త వచ్చినా ఆశ్చర్యం లేదు. కాని, మాగజైన్ పరిస్థితి వేరు. మాగజైన్ అదే ఉదంతం గురించి వివరంగా, విశ్లేషణాత్మకంగా రాయాల్సి ఉంటుంది. వార్తగా మారిన ఉదంతం, సమస్య మూలం గురించి చర్చించాల్సి ఉంటుంది.

మాగజైన్‌లోని వార్తా కథనాలను పాఠకుడు తన జిజ్ఞాసతో చదువుతాడు. దినపత్రికలోని వార్తలను తక్షణ సమాచారావసరాలు తీర్చేవిగా ఇస్తే చాలు. కాని, మాగజైన్‌లోని అంశాలు పాఠకుని మేధా సంపత్తి మీద ప్రభావం చూపే, అతని మేధాశక్తి కోరుకొనే సమాచారాన్ని ఇవ్వాల్సి ఉంటుంది. అందువల్ల మాగజైన్‌లోని వార్తా కథనాలకు ఆకర్షణ ముఖ్యం. అవి పాఠకున్ని రెచ్చగొట్టి, చదివించేవిగా ఉండాలి.

బహుళ రంగుల్లో, ఎక్కువ పేజీలతో, ప్రత్యేక శీర్షికలతో వార్తా కథనాలు ఇవ్వడం పెంచిన దినపత్రికలు, తమ ఫీచర్లలో మాగజైన్ వార్తా కథనం లక్షణాలను సాధించే ప్రయత్నం చేస్తున్నాయి.

ఆంధ్రప్రదేశ్‌లో 1970 వ దశకం ఆరంభంనుంచి క్రమంగా పెరుగుతున్న వార్తాపత్రిక పఠనం ఇంకా విస్తృతం కావలసి ఉంది. అక్షరాస్యత పెరగడం, రాజకీయ చైతన్యం పత్రికలపట్ల సహజంగానే ఆసక్తిని హెచ్చిస్తున్నాయి. అయితే దానితో సమానంగా పాఠకుని ఆదాయం పెరగకపోవడం, ధరలు విపరీతంగా పెరిగిపోవడంవల్ల దిన పత్రికల కొనుగోలు పెరగడం లేదు. అయినప్పటికీ, పత్రికా పఠనం అలవర్చుకొన్న పాఠకుడు ఏదో రూపంలో తాజా ఉదంతాల గురించి లోతైన వివరాలు తెలుసుకోవాలని ఆరాటపడటం సహజం. ఈ సహజ సిద్ధమైన మానవ లక్షణం మూలంగా న్యూస్ మాగజైన్‌కు ఖచ్చితమైన స్థానం ఏర్పడింది. ఇప్పటికే ఇంగ్లిష్ పత్రికా రంగంలో స్పష్టంగా కనిపిస్తున్న పరిణామం: ఇంగ్లిష్ దినపత్రిక రోజూ కొనుగోలు చేయలేని పాఠకుడు కనీసం ఇంగ్లిష్ మాగజైన్లలో ఒకటి, రెండు కొనుగోలు చేయడం. తెలుగు దినపత్రికల ధరలుకూడా అనివార్యమైన స్థితిలో పెరుగుతున్నాయి. అందువల్ల నిజాయితీ, నిబద్ధతతో తెలుగులో వచ్చే న్యూస్ మాగజైన్లకు నికరమైన స్థానం ఉంది. తెలుగులో వచ్చిన ఇండియా టుడే పక్ష పత్రిక, దాని తర్వాత వచ్చిన మరికొన్ని పక్ష, వార పత్రికలు ఈ విషయాన్ని రుజువు చేశాయి. ధరలు పెరిగి, దినపత్రికలు కొనుగోలు చేయలేని స్థితిలో పేద పాఠకుడు ఉంటున్న ప్రస్తుత తరుణంలో న్యూస్ మాగజైన్లకు ఆదరణ అనివార్య పరిణామం.

[ఈ వ్యాసకర్త 'జర్నలిజం చరిత్ర - వ్యవస్థ' గ్రంథకర్త]

# స్త్రీలపత్రికలు

—శ్రీమతి కె. వి. లక్ష్మి

"శక్తి కావల్సినంత కలదుగాని
భవదుపదిష్ట ధర్మాచరణముపట్ల
రక్తియే కొరవడినది మాకు ప్రభూ"—
అన్నట్లు
తెలుగునాట
పత్రికలకేం కొదవ లేదు—

పత్రికలు పాఠకప్రజలకు చేస్తున్న సేవను శంకించడానికి వీలులేదు.

పత్రికలు ఒకదానితో ఒకటి పోటీపడి అన్నింటా విశ్వరూపం దాలుస్తున్న సత్యమూ కాదన వీల్లేదు. తెల్లవారి లేస్తే కాఫీ, టీలు లేకపోయినా ఫర్వాలేదేమోగాని Paper లేకపోతే మాత్రం రోజు మొదలవనట్లే లెక్క. ఎంత రేడియోలు, TVలు రణగొణ మోగుతున్నా పత్రికల ప్రత్యేకత మాత్రం ఏమాత్రం తరగలేదు-పత్రికల సర్క్యులేషన్ మాటెలావున్నా సర్క్యులేషన్ లైబ్రరీల జోరు బాగాపుంజుకుంది.

అయితే పాతికేళ్ళ వెనక్కి వెళితే మళ్ళా వర్తమానంలోకి రావడానికి మనసు వెనకాముందూ లాగుతుంది. ఎందుకంటే దేశ స్వాతంత్ర్యాన్ని ఎలా సద్వినియోగం చేసుకోవాలో ఇంకా ఈ దేశానికి అర్థంకానట్లే సమాజంలో వచ్చిన గొప్ప గొప్ప మార్పుల్ని ఎలా వినియోగించుకోవాలో పత్రికలకి ఇంకా పూర్తిగా అవగాహనకి రాలేదు.

"1947 ఆగస్టు 15 న ఈ దేశానికి, పత్రికలకి తీరని నష్టం వాటిల్లింది. అప్పటిదాకా దాస్యంలో మగ్గుతున్న సామాన్యుడి గురించే, పట్టిపీడిస్తున్న విదేశీ పాలక వ్యవస్థగురించే ఘోషించేవి పత్రికలు. ఇప్పుడిక స్వాతంత్ర్యం వచ్చేసింది.

ఇవాళ్టి సంఘం, పాలక వ్యవస్థ మనది గనక మన సంఘాన్ని దుయ్యబట్టే అదృష్టం మనకి లేదు. పాలకుల్ని తిట్టే అవకాశం లేదు. ఎలా?" అని వా పోయాడో పెద్ద మనిషి-అది ఎంత అసంబద్ధమో ఈనాటి పరిస్థితులు, పత్రికలు చెప్పకనే చెబుతున్నాయి.

దేశకాలమాన పరిస్థితులెలావున్నా ఎప్పటికపుడు వాటిమధ్యనుంచి స్త్రీల గొంతు మనకు ప్రత్యేకంగా వినిపిస్తూనేవుంది.

"ఇదిగో ఏమేవ్, నిన్నే ఈ వార్త విన్నావా?" అని పెద్ద తనే న్యూస్ పేపర్ చదువుతున్నట్లు వంటింట్లో భార్యని ఎలుగెత్తి పిల్చి ఏ చచ్చుకబురో వినిపించ కుతూహలపడే భర్తల నాటి తలుపుచాటు భార్య పాత్ర- ఈ రోజు "ముందు మీరా TV కట్టేసి ఈ పత్రికలోని ఆర్టికల్ చదవండి. అపుడయినా కాస్త అర్థమౌతుందేమో?'' అని విమర్శించి, చురకలు వేసే స్థాయికి మారింది.

ఇంట్లో, సమాజంలో, సృష్టిలో స్త్రీ పురుషులిద్దరిదీ సమానస్థాయి. అయినా స్త్రీలు తమకంటూ ప్రత్యేకంగా గొంతు విప్పాల్సివస్తోంది. స్త్రీ అభ్యున్నతికోసం కృషి చేయాల్సివస్తోంది. ఎందుకు? అన్న ప్రశ్నకు సమాధానం ఇక్కడున్న మీ అందరికీ తెలుసు.

పాతకాలంనాటి స్త్రీ చదువుకోసం, పిల్లల పెంపకంకోసం, భర్త విచ్చల విడితనాన్ని అణగార్చడంకోసం, వ్యక్తిగా స్వేచ్ఛకోసం, వంటింటి కుందేలు పాత్ర నుంచి రూపాంతరంకోసం, అన్ని రంగాల్లో ముందంజ వేయడంకోసం, మూఢ నమ్మకాలు, గుడ్డి సాంప్రదాయాల ఉచ్చులనుండి బైటపడ్డంకోసం, వైధవ్యం పేరున జరిగే అమానుషాల్ని ఛేదించడంకోసం, పునర్వివాహంకోసం నిరంతరం వేదన పడుతుండేది- ఆ వేదనలోంచే స్త్రీ జర్నలిస్ట్‌గా మారింది.

ముద్రణాయంత్రాలు లేనపుడు చేతిరాతతో పుస్తకాలు నడిపినట్లే ఓరల్‌గా స్త్రీ జర్నలిజానికి శ్రీకారం చుట్టింది.

పెళ్ళిళ్ళ పేరంటాళ్ళల్లో తమ మనోభావాల్ని ఒకరితో ఒకరు చెప్పు కున్నారు. కష్ట సుఖాల్ని పంచుకున్నారు. నిజానికి వాటిని యధాతథంగా అక్షరబద్ధం చేసివుంటే ఎన్ని కఠోర సత్యాలు వెలుగులోకి వచ్చి వుండేవో!

విద్వత్ కుటుంబాలనుండి వచ్చిన విద్యావంతులయిన స్త్రీలు స్త్రీల సమ స్యలను గ్రహించి బాధాతప్త వనితలకు స్ఫూర్తి నివ్వడంకోసం స్వయంగా పత్రికలు నడపిన విదుషీమణులున్నారు.

1910-18 ప్రాంతాల్లో పులుగుర్త లక్ష్మీనరసమాంబ 'సావిత్రి' అనే పత్రికను,

1914 ప్రాంతాల్లో వింజమూరి వెంకట రత్నమ్మ 'అనసూయ' అనే పత్రికను స్వయంగా నడిపారు.

అప్పట్లో పతివ్రతల కథలు, జీవితం స్త్రీలని విశేషంగా ఆకర్షించేవి గనుక వారి అభిమానాన్ని చూరగొని, వారికి పత్రికపట్ల ఆసక్తి కలిగించేందుకు గాను పత్రికలకి కూడా సావిత్రి, అనసూయ అనే పతివ్రతల పేర్లు పెట్టడం గమనార్హం.

1919-21 మధ్య గాడిచర్ల హరి సర్వోత్తమ రావుగారి భార్య రాంబాయి మద్రాసులో 'సౌందర్యవల్లి' పత్రికను,

1920 లో మొసలికంటి రామాబాయమ్మగారు కాకినాడలో 'హిందూ సుందరి' పత్రికను నడిపారు.

సావిత్రి, అనసూయ నుండి సౌందర్యవల్లి, హిందూ సుందరి వంటి పేర్ల మార్పు గమనించండి.

అలాగే స్త్రీల అభ్యున్నతికోసం పురుషులుకూడా స్త్రీలకోసం ప్రత్యేకంగా స్త్రీల పత్రికలను నడిపారు. కందుకూరి వీరేశలింగం పంతులుగారి 'సతీహిత బోధిని' పత్రిక వాటిల్లో మొట్టమొదటిది. న్యాపతి సుబ్బారావు గారు చింతామణి పత్రిక, రాయసం వెంకట శివుడు గారు 'జనానా' పత్రిక, అలాగే కె. ఎన్. కేసరిగారు 'గృహలక్ష్మి' పత్రిక నడిపారు. ఆంధ్రమహిళాసభ వ్యవస్థాపకురాలు శ్రీమతి దుర్గాబాయ్ దేశ్‌ముఖ్ 'ఆంధ్ర మహిళ' అనే పత్రికను నడిపారు.

అప్పట్లో ఈ పత్రికలన్ని చిత్తశుద్ధితో, లక్ష్యసాధనకోసం, ఒక కమిట్‌మెంట్‌తో అంకితభావంతో ఎలాంటి వ్యాపార ధోరణులు లేకుండా కేవలం మహిళా సంక్షేమం కోసం నిర్వహించినవే-

ఆనాటి స్త్రీ సర్వదక్షురాలు, గృహ నిర్వహణ ఆమెకి వెన్నతో పెట్టిన విద్య, కట్టుబొట్టు, అలంకరణ ఆదర్శప్రాయమేగాని ఎదుటివారి దగ్గర్నించి నేర్చుకునే స్థితిలో లేదు. ఆమెకి ప్రధానంగా కావలసింది నాలుగ్గోడల బైటి ప్రపంచం. అందుకే పత్రికానిర్వాహకులు కూడా మహిళలు, స్త్రీ అభ్యున్నతిని మనసా వాచా కాంక్షించే పురుషోత్తములు గనుక ఆ ప్రధాన విషయాల

జోలికి పోకుండా ప్రధాన సమస్యలను చర్చించి పరిష్కార మార్గాలు సూచించారు.

ఆడదానికి చదువెందుకు? ఉద్యోగాలు చేయలా? వూళ్ళేలాలా? అన్న మాటల్ని వమ్ముచేస్తూ స్త్రీవిద్య అవసరాన్ని, ఆవశ్యకతను ఎత్తిచూపారు, వంటింటి కుందేలుగా దుర్వినియోగమవుతున్న స్త్రీశక్తి సమాజానికి, దేశానికి ఎంత వుపయుక్తమో చాటిచెప్పారు. షడ్రసోపేతమైన విందుభోజనం తయారు చేసే చేతులే అన్ని రంగాలను ముందుకు నడిపిస్తాయని నచ్చజెప్పారు. వైద్య సదుపాయాల్లేని రోజుల్లో, బాలారిష్టాలు అధికంగా వున్న ఆ రోజుల్లో బిడ్డల పెంపకం పట్ల స్త్రీ బాధ్యత, అందులోని మెళకువలు విడమర్చి చెప్పారు. కొంగుచాటు బిడ్డలై, తలుపుచాటు భార్యలై తలపుల్ని తంపట పెట్టాల్సిన అగత్యం లేదని, ఈ విశాల ప్రపంచంలో స్త్రీ తర్వాతే పురుషుడని తెలియజెప్పి స్వేచ్ఛా విహంగాల్ని చేసేందుకు తీవ్రంగా ప్రయత్నించాయా పత్రికలు. పద్యం, గద్యం, కావ్యరూపాల్లో వారి భావాలకు తమ పత్రికల్లో అక్షర దర్పణం పెట్టాయి.

మనుషుల్లో మార్పు వచ్చినట్లే సమాజంలో మార్పు వచ్చింది. మహిళా పాఠకులు పెరిగారు. ఇవాళ పత్రికల మనుగడకు ఓవిధంగా స్త్రీలే రాజ పోషకులు.

పత్రికల దృక్పథంతోపాటు పాఠకుల దృష్టి మారింది. మహిళలకు ప్రత్యేక శీర్షికలు వెలిశాయి.

తొలి మహిళాలోకపు శీర్షిక 'కుంకుమరేఖలు' - ఈ శీర్షికను కీ. శే. పద్మావతి గారు నిర్వహించారు.

అలాగే 'శారదలేఖల' శీర్షిక ద్వారా ఎన్నో విషయాల్ని సమర్థవంతంగా చర్చించి మహిళల శీర్షికకి ఒక సమగ్రత్వాన్ని సంతరించిపెట్టారు కనుపర్తి వరలక్ష్మమ్మగారు. 'ఇయంగేహే లక్ష్మి' శీర్షికలో శ్రీమతి ఇల్లిందల సరస్వతీ దేవిగారు ఎన్నో చక్కని వ్యాసాలను అందించారు. ఇక ప్రమదావనం శీర్షిక ద్వారా ప్రతి ఇల్లాలిని ఆకర్షించడమే కాకుండా స్త్రీ పురుషులిద్దరిచేతా సమానంగా ఆ శీర్షికను చదివింప చేసిన ఘనత శ్రీమతి మాలతీ చందూర్‌ది.

మంచిని ప్రబోధించడం, ఉత్తేజ పరచడం, కార్యోన్ముఖుల్ని చేయడం ఆయా శీర్షికల ముఖ్యోద్దేశ్యం-కానీ ఇవాళ వాటి ప్రయోజనం వేరు. అవి పత్రిక

లకి సెల్లింగ్ పాయింట్స్. తెలివిగా ప్రశ్న అడిగి చక్కని సమాధానం రాబట్టు కుందాం అనుకునే పాఠకులకంటే చచ్చు ప్రశ్న పుచ్చు ప్రశ్నవేసి అచ్చులో పేరు చూసుకుందాం అనుకునే పాఠకులే అధికం అనుకోండి. అది వేరు విషయం —

పూర్వంలా కాదు. నేటిమహిళకు అనవసరమైనదిలేదు.

డైలీ పేపర్లలో స్త్రీల కోసం ప్రత్యేక పేజీలని కేటాయించే ఆవశ్యకత ఏర్పడింది. ఆంధ్రభూమిలో 'స్త్రీ' - ఆంధ్రజ్యోతిలో 'మహిళ' అలాగే ఆంధ్ర ప్రభలో మహిళా పేజీలు వచ్చాయి. స్త్రీలు వ్రాసే కవిత్వం, చట్టం, న్యాయం, హక్కులు, బాధ్యతలు. వారి day today సమస్యలు, ఫేషన్స్, అందాలు-అలంకరణ, దుస్తుల ఎంపిక, చదువు, సంస్కారం సమస్తం ఈ పేజీల్లో చోటు చేసుకోవడం విశేషం. దాదాపుగా అన్ని పత్రికలూ ఈ విషయాలకి ప్రాధాన్యత నిస్తున్నాయి. డా॥ కృష్ణకుమారి జాబులు-జవాబులు, కె. రామ లక్ష్మి, భానుమతీ రామకృష్ణ స్వాతి. పేపర్లో ఎన్ని ఇచ్చినా మాగజైన్ Getup మాగజైన్‌దే! అందుకే అన్ని పోటీలకు తట్టుకుని నిలబడిన తెలుగు స్త్రీల పత్రికలు రెండే కనబడుతున్నాయి. అవి వనిత, వనితాజ్యోతి - కాస్తా కూస్తా తేడాతో రెండూ అక్కచెల్లెళ్ళులా వుంటాయి. వాటిముందున్న ఇంగ్లీష్ Magazines Femina, Eve's Weeklyల ప్రభావం కొట్టొచ్చి నట్లు కనబడుతుంది. అయినా అందులోనే తెలుగుదనం తగ్గకుండా జాగ్రత్త పడ్డం ముదావహం. ఈ రెండింటికీ పురుషులే సంపాదకత్వం వహించి నిర్వహిస్తున్నారు.

వనిత - ప్రముఖ రచయితల రచనల్లో స్త్రీ పాత్రల విశ్లేషణ - జలంధర చేశారు. చెప్పుకోదగ్గ Feature.

అయితే స్త్రీలు సంపాదకత్వం వహించి విజయవంతంగా నిర్వహిస్తున్న పత్రికలు ఇంగ్లీషులో ఎక్కువ వున్నాయి.

విమలా పాటిల్ - Femina

Eve's Weekly - షోలా రాజాచంద్రన్

సావీ - Ingria ఆల్‌బుకరా

మానుషి పత్రిక - మధుకిష్వర్

స్త్రీల అందచందాలకు ప్రత్యేకించిన 'Care' పత్రికను పద్మా సింగ్వీ సంపాదకత్వ వహిస్తే-

Bombay పత్రిక - ఇది స్త్రీల పత్రిక కాదుగాని సంపాదకురాలు మాత్రం మోహిని బుల్లర్.

వీటిల్లో మానుషి - పత్రిక ఒక విధమైన కమిట్‌మెంట్‌తో నిరక్షరాస్యులయిన స్త్రీలు, సమాజ కబంధహస్తాల్లో చిక్కుకుని, అరాచక, అవినీతి రాక్షసి పదఘట్టనల కింద నలిగిపోతున్న స్త్రీల అభ్యున్నతికి పాటుపడుతున్న పత్రిక - చట్టబద్ధంగా స్త్రీ హక్కుల కోసం పోరాడుతూ వారిలో తాను ఒకటై నిరంతరం వారి కష్టసుఖాలను చర్చిస్తూ ప్రభుత్వాన్ని నిలదీసి అభాగినులకు న్యాయం చేకూర్చాలని తాపత్రయపడుతూ దానికి అంతర్జాతీయ గుర్తింపును తెచ్చిన ఆ పత్రిక ఎడిటర్ మధుకిష్వర్ అభినందనీయురాలు.

అలాగే ప్రముఖ బెంగాలీ రచయిత్రి మహాశ్వేతాదేవి ఆదివాసుల సంక్షేమం కోసం, ఆ స్త్రీ పురుషుల అభ్యున్నతి కోసం 'బొర్తిక' అనే పత్రిక నిర్వహిస్తోంది.

మిగతావన్ని ఓ విధమైన Sophistication సంతరించుకున్న పత్రికలనే చెప్పాలి. ఆధునిక మహిళ అవసరాలను గుర్తించి, ఒకింత సెల్లింగ్ మసాలా జోడించి వాణిజ్యపరంగా, వ్యాపార ధోరణిలో సాగిపోతున్న పత్రికలవి.

కానీ మధ్యతరగతి, అంతకంటే తక్కువస్థాయి మహిళల చైతన్యంకోసం, వారిహక్కుల్ని బాధ్యతల్ని భుజాన వేసుకుని న్యాయసహాయం, చట్టపరమైన చైతన్యం కలిగిస్తూ వారి జీవన సరళిని పరిస్థితులకి అనుగుణంగా మార్చగలిగి వాళ్ళలోని అభద్రతాభావాన్ని పోగొట్టే సమగ్ర స్త్రీలపత్రికలు ఇంకా రావల్సే వుంది.

"నిన్ననాటిన మొక్కలు
ఇంకా వృక్షాలు కాలేదన్న" కవివాక్కులా

మొక్కలు వృక్షాలవకుండానే/బోన్‌సాయ్‌ల్లా, Hybrid ఫలితాల నిస్తున్నందుకు సంతోషించాలో! వాటి రుచి అసలు వాటితో పోల్చినపుడు చప్పగా వున్నందుకు విచారించాలో! లేక స్త్రీ ప్రసక్తి లేని పత్రికే లేదుగనక- అన్ని పత్రికలూ స్త్రీలవే అని ఢంకా భజాయించి చెప్తే బావుంటుందో-మీరే చెప్పమని కోరుతూ-

శలవు తీసుకోబోయేముందు - ఒకమాట.

కొక్కొండ వెంకటరత్నంగారు పత్రికా లక్షణాల్ని, పాఠక లక్షణాల్ని వివరిస్తూ-

**పత్రికాలక్షణం :**

1. పత్రముద్రా సౌష్ఠవంబు
2. సద్భాషయు
3. ధర్మ తత్పరతగల వ్యాసము
4. స్వాశయ వార్తాశి
5. వివిధ వార్తల కల్మి
6. కృతి విమర్శ
7. సల్లేఖకౌఘంబు
8. శాస్త్ర సదాచార సిద్ధాంత అర్థ సంసిద్ధితోబాటు
9. చదివించే గుణం - నవ లక్షణాలు

ఈ లక్షణాలున్న పత్రికలున్నాయో లేదో! ఉన్నవి అవి అవునో కాదో!

అలాగే-

పత్రిక చెడకుండా
పై కప్పు నెడలింపవలయును -
విప్పంగ వలయునట్లే
తొల్దొల్త శీర్షికలో దూరి చూడవలె
స్వవిషయముల ముందు చదువంగవలె
అంతట తన వారివైన విషయముల బరికింపవలె
అంత పరువిషయముల నెరుగవలె ఏకాగ్ర మనస్కుండై
మడత మార్చక - ముడుతలు పడనీక
ఎప్పటి అట్లే ఉంచువాడు సత్పాఠకుడు - అన్నారు.
ఇది ఎందరికి ఆమోదయోగ్యమౌతుందో? శలవ్!

# పత్రికలు–భాష–సాహిత్యం–సాంస్కృతికాంశాలు

**—శ్రీ జి.యస్. వరదాచారి**

భాషా సాహిత్య సాంస్కృతిక రంగాలకు పత్రికలు ఆదినుండి ఎనలేని సేవచేస్తూ వచ్చాయి. గడచిన పాతికేళ్ళలో జరిగిన కృషినే పరిశీలించడానికి ఈ రోజు మనం పరిధి నిర్ణయించుకున్నా పూర్వచరిత్రపై విహంగ వీక్షణం అప్రస్తుతమేం కాదు. తెలుగులో విజయవంతంగా నడిచిన తొలిపత్రిక కందుకూరి వీరేశలింగం పంతులు గారి వివేకవర్ధని. దానిలో ఆయన "నే నేర్పరచుకున్న భాషాభివృద్ధి మార్గము తెలుగులో మృదువైన సులభశైలిని సలక్షణమైన వచన రచన చేయుట" అని వ్రాసుకున్నారు. భాష సాహిత్యం అభివృద్ధికి ఆయన ఎంతో సేవ చేశారని ప్రత్యేకంగా చెప్పవలసిన పనిలేదు. సంఘ సంస్కరణ సాంస్కృతికాంశం కిందకు వస్తుందనుకుంటే-ఎందుకిలా అంటున్నానంటే ఈ రోజుల్లో సాంస్కృతిక కార్యక్రమం అనగానే వినోద ప్రదర్శనం అనే అర్థం రూఢి అయి ఉంది గనుక - సాంస్కృతిక వికాసానికి కూడా వివేకవర్ధని సాటిలేని కృషి చేసిందనాలి. వీరేశలింగం తర్వాత ఆంధ్రదేశాన్ని తన కలం బలంతో ఒక ఊపు ఊపిన కృష్ణాపత్రిక సంపాదకులు ముట్నూరి కృష్ణారావు పంతులు పత్రికా నిర్వాహకుల బాధ్యత గురించి చెప్పిన మాటలు కూడా గుర్తు చేసుకోదగినవి.

"పత్రికా నిర్వహణ చాలా బాధ్యతతో కూడిన కార్యము. భాషా పాటవము, రచనా కౌశలము, భావోద్రేకము ఉన్న చాలవు. క్రమానుగతములైన సాంప్రదాయములను, ధారావాహికములైన మర్యాదలను గుర్తింపగల చరిత్ర జ్ఞానము, ప్రజల మనోరథము నిగూఢ చిత్త వృత్తులను పరీక్షించగల విశాల దృష్టి, దేశ భవితవ్యము నుపలక్షింపగల గంభీర విశ్వాసము పత్రికాధిపతులు అలవరచుకొనదగిన లక్షణములు. వీటన్నికంటె కావలసినది నిర్మలమైన సత్యనిరతి" అని ఆయన లక్ష్యనిర్దేశం చేశారు.

విజయవంతమైన తొలి తెలుగు దినపత్రిక 'ఆంధ్రపత్రిక'. తెలుగు నాట రాజకీయ చైతన్య దీప్తికి అనితరసాధ్యమైన కృషి చేసింది. దురదృష్ట వశాత్తు ఇటీవల రుజాగ్రస్తమైంది. 'ఆంధ్రపత్రిక' తొలి సంచికలో కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు 'పత్రిక యందీ క్రింది విషయములుండును' అంటూ వ్రాసుకొన్న దానిలో నుంచి కొంతభాగాన్ని చూద్దాము.

"ఆంధ్రదేశాభ్యుదయమునకు సాధనభూతములైన రాజ్యాంగ వ్యవస్థలు విద్యా వ్యాపనము వ్యవసాయ వాణిజ్య వ్యవస్థలు భాషాభివృద్ధి మొదలగు సకలోద్యమము లీ పత్రికయందు స్వతంత్ర విధముగ విపులముగ విమర్శింప బడును."

అని చెప్పుకోవడమే గాక అదే అంశంలో "గ్రంథ ప్రచురణములు" అనే శీర్షిక కింద "ఆంధ్రభాషయందు ప్రచురింపబడు ముఖ్య గ్రంథములు బండితు లచే చక్కగా విమర్శింపబడి, భాషాభ్యుదయమునకును, భాషాభివృద్ధికిని దగిన సాధనములు సూచింపబడును" అని హామీ ఇచ్చారు.

ఆ హామీ మేరకు ఆంధ్రపత్రిక నిర్వాహకులు అర్ధశతాబ్దానికి పైగా ఉగాది సంచికలద్వారా, భారతి మాసపత్రిక ద్వారా భాషాభివృద్ధికి సాహిత్యాభి వృద్ధికి చేసిన సేవ ఇప్పుడు చరిత్రలో భాగమై పోయింది.

అయితే ఈ అభివృద్ధి అంతా ఆరంభంలో పద్య గద్య కావ్యాలు నవ లలు నాటకాలు కథలకే చాలావరకు పరిమితమైనా రానురాను జాతి అవసరా లను గుర్తించి విషయ ప్రధానమైన రచనలకు కూడా పత్రికలు ప్రాధాన్య మివ్వ నారంభించాయి. చారిత్రక రచనలు, బాల వాఙ్మయం, శాస్త్ర సంబంధ మైన అంశాలు పత్రికలలో విశేషంగా రానారంభించాయి.

పత్రికలు ప్రధానంగా విషయ ప్రసారానికే ఉద్దేశించినవి. తత్కార ణంగా పత్రికా రచన సృష్టిలోని అంశాలన్నిటినీ స్పృశించక తప్పదు. "ఆకా శమే హద్దు" అనే నానుడి కూడా పత్రికలకు వర్తించదు. స్వాతంత్ర్య పోరాట కాలంలో పత్రికలు జాతీయ నాయకుల ప్రసంగాలను విస్తారంగా ప్రచురించి దేశంపట్ల, పాఠకుల పట్ల తమ బాధ్యత తీరిపోయిందని చేతులు దులిపేసు కుంటే సరిపోయిందేమోకాని తర్వాతి కాలంలో అలా చేయడం ఆత్మహత్యా సదృశమైంది. అంచేత విషయ విస్తృతి పెరిగింది. అంతేకాదు. మానవ

హక్కులు మానవ సంబంధాల విషయంలో నవీన ఆలోచనలు, నవీన భావనలు ఆవిష్కృతమవుతున్న దశ అది. వాటి వ్యక్తీకరణకు కొత్త పదాలు, పద బంధాలు అవసరమైనాయి. కొత్త ప్రయోగాలు, కొత్త శైలులూ అవసర మైనాయి. అంటే ముందుగా భాషను ఎంపిక చేసుకోవడంలో జాగ్రత్త పడవల సిన అవసరం ఏర్పడింది.

తెలుగు పత్రికలలో వ్యావహారిక భాషను ప్రవేశపెట్టిన తాపీ ధర్మా రావు నాయుడుగారు దీన్ని గురించి ఇంకెవ్వరూ మెరుగుపరచి చెప్పడానికి అవకాశం లేనంత చక్కగా సమగ్రంగా ఇలా చెప్పారు:

"పత్రికలు ముఖ్యంగా ప్రజాసామాన్యం కోసం అన్నమాట మరచి పోకుండా ఉంటే ఏ భాషలో, ఏ స్థాయిలో వ్రాయాలో చెప్పనక్కరలేదు. మన దేశంలో చదువు వచ్చినవారు తక్కువ. వారికి వార్తా పత్రికల ఉపయోగం అందాలంటే ఒకడు చదువుతుంటే వారు విననైనా వినాలి లేదా ఎవ్వరయినా వారికి చెప్పాలి. కాబట్టి రచయిత తన పాండిత్యం చూపడం కాదు కావలసింది. పాఠకుడు అసందిగ్ధంగా గ్రహించాలి. కాబట్టి నిత్య పరిచయమైన వ్యావహా రికమే శరణ్యం కావాలి. వార్తలూ వానిలోని విశేషాలూ చెప్పుతున్నాము గాని పాఠ్య పుస్తకంలోని పాఠం చెప్పడం లేదని జ్ఞప్తిలో ఉంచుకోవాలి. సుబోధ కంగా ఉండటమే ప్రథమావశ్యకత. తర్వాతనే శైలీ పదగుంభన మొదలైనవి."

ఆనాటి నుంచి పత్రికలలో శిష్ట వ్యావహారికం చోటు చేసుకున్నది. అదే ప్రామాణికమై సుప్రతిష్ఠమైంది. కొందరు ఇంకొంచెం సడలించి మాండలికాన్ని ప్రవేశ పెడదామని ప్రయత్నించారు కాని సహజంగానే ఆ యత్నం ఫలించ లేదు. శిష్టవ్యావహారిక రచనే స్థిరపడింది. తత్పరిణామ స్వరూపంగా వచన సాహిత్యాన్నంతా పత్రికలే పెంచి పోషించాయి. నవీన వాఙ్మయమంతా పత్రికలే పెంచి పోషించాయి.

ఈ పాతికేళ్ళ కాలంలోనే పత్రికా ముద్రణారంగంలో సాంకేతిక విప్లవం వచ్చింది. భాషా ప్రయుక్త, స్థాపన లక్ష్యాలు ఈ పాతికేళ్ళలోనే ఫలించనారంభించి ప్రాంతీయ భాషల ద్వారా విద్యార్జన చేసిన వారి సంఖ్య విశేషంగా పెరిగి భాషా పత్రికల ప్రాచుర్యం కూడా గణనీయంగా పెరిగింది. తెలుగులో గొలుసు పత్రికల పరంపర ఈ పాతికేళ్లలోనే ప్రారంభమై సత్ఫలి తాలను సాధించింది. దానితో భాషా సాహిత్యాల అభివృద్ధికి ఇతోధిక కృషి చేయడానికి అవకాశం లభించింది. అవసరమూ ఏర్పడింది.

ఒక భాషలో ఉండే పద సంపదే ఆ భాష అభివృద్ధికి కొలమానం. పద సంపదను పెంచడానికి పత్రికలు విశేషంగా కృషి చేశాయి. భాష నవీకరణకు పత్రికలు అవసరంకొద్దీ తోడ్పడ్డాయి. కొత్త వైజ్ఞానిక పదాలెన్నో సృష్టించాయి. పత్రికారచన అనేది ఉరుకులు పరుగులమీద జరిగే సాహిత్య సృష్టి అని నానుడి. కనుక ఆ ఉరుకులాటలో ఎప్పుడైనా భాషను సంకరం చేసి ఉండవచ్చు. కాని పత్రికలు ప్రచారంలోకి తెచ్చిన అనేక పదాలు, పదబంధాలు భాషాశాస్త్రజ్ఞుల ఆమోదాన్నీ మన్ననలనూ పొందాయి. ఇవీ సూత్రాలు అని నిర్ధారించకపోయినా పత్రికా రచయితలు నూతన పద నిర్మాణంలో సర్వాంగీకారమైన ఆరు పద్ధతులను అవలంబించారు. (1) ఉన్న పదాలకే కొత్త అర్థాలు కల్పించడం: ఆకాశవాణి, విద్యుత్తు, క్షిపణి వంటివి. (2) విస్తృతార్థాన్ని కుదించి నిర్దిష్టత ఆపాదించడం: మంత్రి, ఆయుక్త, అధ్యాపకుడు. (3) కొత్తవి రూపకల్పన చేయడం, అయనీకరణం. అక్షరాస్యత. (4) భావానువాదం చేయడం: కుటుంబ నియంత్రణ, అలీనోద్యమం, వర్ధమాన దేశాలు. (5) పదబంధాల అనువాదం చేయడం: శ్వేతపత్రం, నల్లబజారు, సౌరశక్తి. (6) అరువు తీసుకోవడం: వాకౌట్, నోటీసు, లైసెన్సు.

లేఖన పద్ధతుల గురించి ఆంగ్లంలో బాగా పరిశోధన జరిగింది. దాని నుంచి తెలుగు పత్రికా రచయితలూ లాభపడ్డారు. కఠిన పదాలు, సంశ్లిష్ట వాక్యాలు సులభంగా అర్థం కావనీ, సరళ వాక్యాలే సులభంగా అర్థమవుతాయనీ నిర్ధారించారు. భాష అర్థానికి అడ్డం రాకుండా ఉండాలి. కొత్తగా సంపాదక వర్గంలోకి వచ్చినవారికి ఇదే చెబుతాం! కఠిన పదాలు వాడవద్దు. వాడుకలో లేని మాటలు వాడవద్దు. మాండలికాల గురించి చెప్పాలనుకుంటే తప్ప మాండలికాలూ వాడవద్దు. ఏ మాటనైనా తప్పుగా అసలు వాడవద్దు. మన భాష ఎంతో సుసంపన్నమైంది. ఏ భావాన్నయినా అర్థచ్ఛాయగూడా మారకుండా చెప్పవచ్చునని జె.బి. హాల్డేన్ వంటి మహాశయులే చెప్పారు. అన్ని భావాలను, వార్తాంశాలను తెలుగులోనే చెప్పాలని పత్రికా రచయితలు చాలా కాలం ఫలప్రదంగా కృషిచేశారు. ఇప్పుడూ అలా చేస్తున్నారా అంటే అవునని ధైర్యంగా చెప్పలేనిస్థితి. ఇంగ్లీషు వ్యామోహం పెరిగిందో, మాట వెంటనే తోచకపోతే ఇంగ్లీషు వాడేద్దాం అన్న సునాయాస పద్ధతి అవలంబిస్తున్నారో తెలియదు.

కొత్త పదాల నిర్మాణం అటుంచి వాడుకలో ఉన్న మాటలనే తెలుసుకుని రాసే ఓపికకూడా కనిపించడం లేదు. కొందరు ఇదివరకే ఉన్నవాటిని విస్మరించి తమకు తోచిన కొత్త పదాలను సృష్టించి అయోమయానికి దారి తీస్తున్న సందర్భాలూ లేకపోలేదు. లయన్స్ షేర్ అంటే సింహభాగం అనీ, జాయింట్ సెక్టర్ అంటే సంఘటిత రంగం అనీ, కన్సాలిడేటెడ్ ఫండ్ అంటే సంఘటిత నిధి అనీ, బ్యాలెన్స్ ఆఫ్ పేమెంట్స్ అంటే చెల్లింపుల శేషం అని ఈ మధ్య కొన్ని పత్రికలు చేసిన ప్రయోగాలు ఇలాంటివే. ఇదివరకున్న మాట లేమయ్యాయి? బహుశా అవి నిఘంటువులోనికి ఎక్కకపోవడం వాటిని విస్మరించగానికి ఒక కారణం కావచ్చు. తెలుగు విశ్వవిద్యాలయంలోని నిఘంటు నిర్మాణ శాఖ 1982లో పత్రికా భాషా నిఘంటు నిర్మాణాన్ని చేపట్టింది. పత్రికలు నిర్మించి ప్రచారంలోకి తెచ్చిన పదాలు, పదబంధాలు సుమారు ఐదువేలు వీరు సేకరించారు. వీరికి అందనివీ, 1982కి ముందు నుంచి ప్రచారంలో ఉన్నవీ ఇంకా ఎన్నో ఉంటాయి. ఇలాంటి నిఘంటువులు వచ్చాక అయినా వాడుకలో ఉన్న పదాలు మరుగున పడిపోకుండా ఉంటాయని ఆశించవచ్చేమో!

ఇక సాహిత్య సేవ విషయానికి వస్తే ఈనాటి పత్రికల ఆదివారం అనుబంధాలు ఆంధ్రపత్రిక ఉగాది సంచికతో, భారతితో పోటీ పడలేకున్నా ఉడతా భక్తిగా పాటుపడుతున్నాయనే చెప్పాలి. ఆదివారం అనుబంధాలు ఈ మధ్య రూపు మార్చుకోవడంతో వాటి పరిధి పెరిగింది. మామూలు కథానికా సాహిత్యంతో పాటు సాహిత్య విమర్శకు, వచన కవిత్వానికి అన్ని పత్రికలు విశేష ప్రాముఖ్యమిచ్చి ప్రచురిస్తున్నాయి. ఇటీవలి కాలంలో ఉత్తమ వచన కవిత్వమంతా పత్రికలలోనే వచ్చింది. సాహిత్య విమర్శకు వివిధ పత్రికలు ఏర్పరచిన శీర్షికల జాబితాను ఇక్కడ ఇవ్వడం అవసరమూ కాదు. అందుకు అవకాశమూ లేదు. కాని అన్ని పత్రికలూ విమర్శ ప్రాధాన్యాన్ని గుర్తించాయని చెబితే చాలు. ఇందుకు పండిత విమర్శకులు కూడా చేయూతనిచ్చి తెలుగులో సరైన విమర్శ రావడం లేదన్న అపప్రథను కొంతవరకైనా తొలగించారు. ఆదివారం సంచికలలోనే కాక వారం మధ్య ఏదో ఒక రోజున సాహిత్యానికో పేజీ కేటాయించే సంప్రదాయం ఇటీవల వచ్చింది. వారపత్రికలలో సీరియల్స్‌తో పాటుగా దైనిక సీరియల్స్ వచ్చాయి. ఏవారాని కావారం, ఏరోజు కారోజు సస్పెన్స్‌తో ఆపుచేసి పాఠకులను ఆకట్టుకోవాలనే ప్రయత్నం మొదలైంది. మార్కెట్

దృష్టి పెరిగి సరుకు నాణ్యత తగ్గింది. క్రమంగా పత్రికలే ముద్దుగా నామకరణం చేసిన "క్షుద్రసాహిత్యం" "సరదాసాహిత్యం" రాజ్యమేలే స్థితి వచ్చింది. తెలుగు సినిమాల్లాగే తెలుగు పీరియాడికల్స్ కూడా సకుటుంబంగా చదువుకుని ఆనందించేందుకు వీలులేని పరిస్థితి ఏర్పడింది. అదృష్టవశాత్తు ఈ గాలి ఇప్పుడు తగ్గుముఖం పడుతున్న సూచనలు కనిపిస్తున్నాయి.

సాంస్కృతిక రంగానికి పత్రికలు చేయగలిగిన సాయమల్లా వాటి కార్యకలాపాల వార్తలను ప్రచురించడమే. క్రీడారంగానికి మల్లేనే సాంస్కృతిక రంగాన్ని గురించిన వార్తలు ఎంత ఎక్కువగా ప్రచురిస్తే ఆ రంగంలో పని చేసే వారికి ఆసక్తి అంతగా పెరుగుతుంది. కార్యక్రమాలూ పెరుగుతాయి. ఈ రంగంలో స్పర్థ పురోగమనానికే దారి తీస్తుంది గనుక తప్పులేదు. పత్రికలు ప్రోత్సహించడం వల్ల రాజధాని నగరంలో ఈనాడు అనేక సంస్థలు ఏర్పడి ఎంతో చక్కని కార్యక్రమాలను నిర్వహిస్తున్నాయి. వాటిని గురించి పత్రికలలో వస్తున్న నిర్మాణాత్మక సమీక్షలు లోపాలను తొలగించుకొని కార్యక్రమాలను మెరుగుపరచుకోడానికి కార్యకర్తలకు తోడ్పడుతున్నాయంటే అతిశయోక్తి కాదు.

సమయపాలన అవసరం గనుక నేనిక్కడ దృష్టాంతాల జోలికి పోలేదు. కాని పత్రికలు భాషా సాహిత్య సాంస్కృతిక రంగాలకు యధాశక్తి సేవ చేస్తున్నాయనడంలో సందేహం లేదు. అయితే అందరినీ విమర్శించే పత్రికల వారికి అప్పుడప్పుడు ఆత్మ పరిశీలనా, విమర్శా కూడా అవసరం. ఇలాంటి సదస్సులు అందుకు అవకాశమిస్తాయి.

# పత్రికాభాష: వర్తమానస్థితి

## —డాక్టర్ బూదరాజు రాధాకృష్ణ

వార్తాపత్రికలే జగద్రక్షణ చేయగలవనీ, వాటిలోని భాష చెడిపోతున్న దనీ ఒకదానికొకటి పొంతనలేని అభిప్రాయాలు ఈ కాలంలో బలపడు తున్నాయి. మొదటి భావానికి తెలుగు ఆదిమహాకవిని బాధ్యుణ్ని చేస్తున్నారు కొందరు. రెండోది పత్రికల్లో పనిచేయని, వాటితో సంబంధంలేని పండితుల అభిప్రాయం.

పాపం నన్నయ! అత డేపాపమూ ఎరగడు. మహాభారత సభా పర్వంలో రాజధర్మాల ప్రస్తావన వచ్చినప్పుడు నన్నయ రాసిన పద్యం ఆధారంగా మొదట దుర్భావం ప్రతీతమవుతున్నది. ఆ పద్య మిది :

"వార్తయందు జగతి వర్తిల్లుచున్నది;
యదియు లేని నాఁడ యఖిల జనులు
నంధకారమగ్ను లగుదురు; కావున
వార్త నిర్వహింపవలయుఁ బతికి."

పై పద్యంలోని భాషను ఈనాటి తమ అభిప్రాయాలకు అనుగుణంగా మలుచుకొని వార్తల్లేకపోతే ప్రపంచం అజ్ఞానాంధకారంలో పడిపోతుందని వ్యాఖ్యానించటం దురదృష్టం. అలనాటి వ్యవహారంలో "కృషి వాణిజ్యే వార్తా" అని నిర్వచించారు. అంటే వ్యవసాయం, వ్యాపారం అనే రెండూ కలిస్తే 'వార్త' అవుతుంది. వార్తా శబ్దానికి "బతుకుతెరువు, వ్యాపారం, వ్యవసాయం, పశుపోషణ" అనేవి తొలి అర్థాలు. "సమాచారం, సంఘటన, నివేదిక, వదంతి, సంగతి, విషయం, వేగు, గూఢచారత్వం" అనేవి తరువాతి కాలంలో వచ్చి నవి. వ్యవసాయం చేస్తూ పశుపోషణ వ్యాపారాలనుకూడా నిర్వర్తించటం "వార్తాకర్మ" అని మనువు చెప్తాడు. వార్తావహుడంటే ఒకరి కబురు మరొకరికి చెప్పేవాడు. వార్తాహరుడంటే కబురందించేవాడు. కౌటిల్యుడి అర్థశాస్త్రం,

వాత్స్యాయనుడి కామ సూత్రాలూ మహాభారతార్థాలనే సమర్థిస్తాయి. వాణిజ్య వ్యవసాయాలు రెండూ లేని ప్రపంచం అంధకారబంధురమవుతుందన్న ఉద్దేశమే నన్నయ పద్యంలో చెప్పింది. నేటి వార్తా పత్రికల సంగతి ఆయన ఊహల్లో లేనిది. ఆయనకు ఆపాదించరానిది. నేటి భావాల ప్రకారం ఆ పద్యాన్ని వ్యాఖ్యానించి పరిపాలకులు పత్రికలు నడపటం మేలని నన్నయ కూడా చెప్పాడనటం న్యాయం కాదు.

ఇక రెండో అభిప్రాయం. నేటి పత్రికల భాష దారుణంగా ఉందని, బొత్తిగా ప్రమాణాల్లేని తప్పులకుప్పల భాష పత్రికల్లో ప్రచార మవుతున్నదని, అందువల్ల భాషకు అపచారం జరుగుతున్నదని పత్రికలు భాషను సంకరం చేస్తున్నవని బాధపడేవాళ్ళు లేకపోలేదు. తమకు తాము నిర్దేశించుకున్న భాషా ప్రమాణాలను పత్రికలు పాటించలేదు కాబట్టి పత్రికాభాష "చెడిపోయిం" దనుకోవటం ఒక ఎత్తు. పత్రికలు 'కావాల'ని భాషను 'చెరుస్తున్నా య'ని ప్రచారం చేయటం మరో ఎత్తు. తమ పత్రికలోని భాషే పరమ ప్రామాణికసని, ఇతర పత్రికలు భాషకు దురవస్థతెచ్చిపెట్టున్నాయని వాచ్యంగానో సూచ్యంగానో ప్రకటించే పండితులు అద్దంలో తమ ముఖాలను తాము చూడటం మానివేసిన వాళ్ళు; ప్రస్తుత సామాజిం పరిస్థితులను గుర్తించనివాళ్ళు; భాషా పరిణామ క్రమాన్ని గమనించనివాళ్లు; పత్రికా నిర్వహణ అసమర్థ భాషా పండితుల చేతిలో ఉందనే భ్రమలో ఉన్న అలౌకికులు. ఈ మాటలకు ఎన్నో నిదర్శనాలు చూపవచ్చు.

పైభావాలనూ అభిప్రాయాలనూ వల్లించేవాళ్ళు ప్రస్తుత పత్రికాభాషలో కింద పేర్కొన్న దుర్లక్షణాలున్నాయని పూర్వ నిర్ణయానికి వచ్చినవాళ్ళు. అవి—

1. దుస్సంధులూ, దుష్టసమాసాలూ, భాషాసంకరం నేటి పత్రికా భాషలో కనిపిస్తున్నాయి.
2. అన్య భాషాప్రభావంవల్ల భాషా సహజత్వానికి గండిపడ్డది.
3. దేశభాషా పత్రికలు అనువాద రచనలేగాని స్వతంత్ర రచనలు కావు.
4. భాషాజ్ఞానం లేనివాళ్ళే పత్రికల్లో పని చేస్తున్నారు. అందువల్లే ఈ దుస్థితి.

పైఅభిప్రాయాల్లో ఒక్కొక్కటి ఎంత నిజమో స్థూలంగా పరిశీలించినా వాద దౌర్బల్యం బయటపడుతుంది. "ఆర్య వ్యవహారంబుల దృష్టంబు గ్రాహ్యంబు" అనే చిన్నయసూరి ప్రవచనం ఏకపక్ష నిర్ణయమని అంగీకరిస్తే నన్నయభట్టు వాడిన 'కపిలగడ్డము" వగైరాలు దుష్టసమాసాలేవని ఒప్పుకోక తప్పదు. ప్రాచీన శాసనాల్లో కనిపించే 'మంగిదొగరాజు' వంటి అనేకానేక ప్రయోగాలు మిశ్రసమాసాలే. 'మణ్చ్యణ్ణ' వంటివి దుస్సంధులే. (మంచియణ్ణ అననందువల్ల). నన్నయభాషలోనే కనిపించే 'నాగలి, గడ్డ' అనేవి సవరభాష వంటి కొలేరియన్/ముండా భాషలనుంచి ఎరువు తెచ్చుకున్నవేగాని అచ్చ తెలుగు పదాలు కావు. సంస్కృత ప్రాకృతాలనుంచి తెచ్చుకొన్న అసంఖ్యాక పదాల సంగతి సరేసరి. "దిక్కు" తోచనంతగా సంస్కృతం తెలుగులో శాసించింది. మరి శ్రీనాథాదులు వాడిన 'ఖుసి, సురధాణ' వగైరాలు హిందీ, ఉర్దూ మొదలయిన భాషలనుంచి ఎరువుగా వచ్చినవి. చివరికి 'అచ్చతెలుగు' గ్రంథాల్లో కనిపించే 'వజీరు' వంటి మాటలూ, పూర్వరాజుల బిరుదావళుల్లో నిలిచిపోయిన కన్నడ సమాసాలు (గండరగండ-వంటివి) అన్యదేశ్యాలే. అన్య భాషాపదాలను వాడకపోతే 'వ్యవహార హాని' జరుగుతుందని అప్పకవివంటి సనాతనుడే వాపోయాడు. కాబట్టి భాషాసాంకర్యమనేది లాక్షణికామోదానికి విరుద్ధమయిన భావన.

యత్తదర్థక ప్రయోగం, కర్మణి ప్రయోగం వంటివి సంస్కృత ప్రభావంవల్ల తెలుగుభాషలోకి వచ్చిన వాక్యరచనాభేదాలు. కొందరు కర్మణి ప్రయోగం సహజమేనని మొండిగా వాదించినా తెలుగులో ఆ తీరు వాక్యరచనకు ప్రాచుర్యముందని వాదించలేకపోతున్నారు. తెలుగువాళ్ళు తెలుగులో ఆలోచించి తమ అనుభవంలోకి వచ్చిన భావనలకు వస్తువులకు జాతీయతా దృష్టితో తెలుగుపేర్లు పెట్టనపుడు, ఉత్తర దక్షిణాలమీది వ్యామోహంతో 'వడతెన్ను' లనే పలను/వైపులను విస్మరించినప్పుడు, భావనలతోబాటు వాటిని విశదీకరించే పదాలను, పరిభాషను అన్యభాషలనుంచే పెద్దయెత్తున స్వీకరించటం జాతిలక్షణంగా మలుచుకొన్నప్పుడు, భాషాసహజత్వం ఎంతో కొంత మారిపోతే, దెబ్బతింటే ఎవర్ని నిందించాలి? జాతిస్వభావమే ఆదానప్రియమైనప్పుడు దేశీయతాస్ఫూర్తికి దెబ్బ తగిలిందని దుఃఖపడి సాధించగలిగిందేమిటి?

ఒకే సంస్థ తెలుగులో ఇంగ్లీషులో దినపత్రికలను ప్రచురిస్తుంటే తెలుగు పత్రికలను ఇంగ్లీషు పత్రికలకు అనువాదంగా వెలువరిస్తున్నాయనే దుర్భావం పత్రికా నిర్వహణ తెలియనివాళ్ళద్వారా ప్రచారమవుతున్నది. టెలిప్రింటర్ ద్వారా ఇంగ్లీషు, హిందీల్లో వచ్చిపడే అసంఖ్యాక వార్తలను తేలిగ్గా కూర్చుని అనువదించే అవకాశం, సమయం తెలుగు పాత్రికేయులకు లేదని వీరు గుర్తించకపోవటం దురదృష్టం. ఇప్పటి దినపత్రికలకు గ్రామసీమలనుంచి వార్తలను సేకరించి రచించి పంపే విలేఖరులు అసంఖ్యాకంగా ఉన్నారు. ఈనాటి పత్రికలు ప్రాంతీయ వార్తల కిస్తున్న ప్రాముఖ్యం జాతీయాంతర్జాతీయ వార్తల కివ్వటం లేదు. స్థానిక వార్తలను, ప్రాంతీయ వార్తలను ప్రచురిస్తున్నంత విరివిగా తదితరాలను ప్రచురించడం లేదు! ఇంగ్లీషు, తెలుగు పత్రికలు రెండూ ఏక కాలంలో దేనికవిగా వెలువడుతున్న వే గాని తెలుగు పత్రికలు ఇంగ్లీషు పత్రికలకు అనువాదాలు కావు.

ఇక పాత్రికేయుల భాషాజ్ఞాన విషయానికి వద్దాం. ఈ సందర్భంలో రెండురకాల దుర్భావాలున్నాయి. ఒకటేమో దేశభాషా పత్రికల్లో పనిచేస్తున్న వాళ్ళందరూ భాషాపండితులనీ, వాళ్ళ విద్యా ప్రమాణాలు చాలా తక్కువనీ, అందువల్లే పత్రికాభాష అధ్వాన్నంగా ఉటుందనీ నమ్మి చేసే ఆరోపణ. రెండోది తెలుగుభాషా సాహిత్యాల్లో నిష్ణాతులని విశ్వవిద్యాలయాలు బిరుదులిచ్చి ప్రపంచంలోకి విడిచిపెట్టిన మహావిద్వాంసులకు పత్రికా రచనలో సముచిత స్థానం లభించనందువల్ల పత్రికాభాషా ప్రమాణాలు తలకిందులుగా పడిపోయి అధఃపాతాళానికి చేరుకున్నాయనే విశ్వాసంతో చేస్తున్న ఆరోపణ. ఇవి పైకి పరస్పర విరుద్ధంగా కనిపించినా తత్వంలో ఒకటే. పత్రికేతర సాహితీ ప్రపంచంలో పరమాద్భుత ప్రమాణాలున్నాయనే, అనుకునే వారినుంచి వస్తున్న విమర్శలు. మారిన సామాజిక పరిస్థితుల్లో ప్రమాణాలు అన్ని రంగాల్లోనూ ఒకేవిధంగా ఉన్నాయనీ ఆత్మవిమర్శ చేసుకో(లే)ని వాళ్ళు పరవిమర్శతో సంతృప్తి పడుతున్నారనిపిస్తుంది. పత్రికల స్వభావంలోనే సమూలంగా వచ్చిన మార్పులను వీరు గమనించటంలేదు.

పూర్వ పత్రికల్లో కూడా 'అగ్నిమాపకదళం' వంటి అసంబద్ధ ప్రయోగాలున్నాయి. వాటి సంఖ్య తక్కువ అని అంగీకరిద్దాం. అప్పట్లో దినపత్రికలు కూడా అందించిన సమాచారం నేటి వార్తా ప్రసారణతో పోలిస్తే అల్పాల్పం,

అప్పుడు పత్రికల్లో భాషా సాహిత్యం పరిచయం లేనివారికి పనిచేసే అవకాశాలు చాలా తక్కువ. ఇప్పటి పత్రికలు సాహిత్య పరిచయంకన్నా, భాషా పాండిత్యంకన్నా విభిన్న వార్తా ప్రసారానికే ఎక్కువ అవకాశం కల్పిస్తున్నాయి. అప్పటివాళ్లు - చివరికి వీధి నాటకాలు వేసే వాళ్ళు కూడా - తెలుగులో పంచకావ్యాలు చదివిన తరువాతగాని మొహానికి రంగులద్దుకోలేదు - రంగ ప్రవేశం చేయలేదు. భాషా సాహిత్యం లేకుండా రంగప్రవేశం చేసినవాళ్ళు రాణించనూ లేదు. ఇప్పుడు విశ్వవిద్యాలయాల్లో స్నాతకోత్తరస్థాయి విద్యార్హతలు సాధించిన వాళ్ళలో పరిశోధకులనే బిరుదులు సంపాదించిన వాళ్ళలో తాము పంచకావ్యాలు చదివామని గుండెమీద చేయి వేసుకొని ప్రకటించగలవా రెందరున్నారనేది ప్రశ్న. పాత్రికేయులు తమకు నమూనాలుగా, ఆదర్శాలుగా, ప్రామాణిక గ్రంథాలుగా నిస్సందేహంగా ఆమోదించదగ్గ వచన సాహితీ ప్రక్రియా భేదాలు ఏమున్నాయని నిష్కర్షగా చెప్పగలరు? నిజానికి ఎందరు విద్యార్థనైక దృష్టితో చదువుతున్నారు? ఎందరు బిరుదులకోసం పాకులాడుతున్నారు? పాత్రికేయులకు భాషాధికారం అవసరమని గుర్తించని వృత్తి విద్యా గ్రంథంగాని, విశ్వవిద్యాలయంగాని, పాఠ్య ప్రణాళికలుగాని లేవుగదా! గుర్తించి పాత్రికేయ వృత్తి విద్య నేర్పే విద్యార్థులకు ఏ స్థాయిలోనైనా భాషా పరిజ్ఞాన పాటవాలను కల్పిస్తున్న విద్యాసంస్థలేవి? నేర్పని విద్య నేర్చుకోలేదని ఆక్షేపించటం ఎంత సమంజసం? ఆక్షేపకుల్లో ఎందరు తామేపాటి భాషా సాహితీ విద్వాంసులు? తమ పిల్లల విద్యా ప్రమాణాలు పడిపోతున్నాయని అంగలారుస్తున్న తలిదండ్రుల్లో ఎందరు తమ విద్యా ప్రమాణాలను నిరూపించుకోగలరు? తరవాతి తరంవారు నేర్చుకుంటున్న భాషేతర, సాహిత్యేతర విషయ పరిజ్ఞానాన్ని ఎందరు గుర్తిస్తున్నారు? కనీసం అర్థం చేసుకుంటున్నారు?

మరోవిధంగా ఆలోచిద్దాం. భాషా పాండిత్యాలను నిజంగా సమాజం గౌరవిస్తున్నదా? వాటిని శ్రమించి సంపాదించినవారికి ఉపాధి సౌకర్యాలున్నాయా? తక్కిన వారందరిలాగానే 'గుమాస్తా విద్యావిధానం'లో డిగ్రీలు సాధించిన పాత్రికేయులు వృత్తిప్రత్యేకనైపుణ్యాలతోబాటు భాషా సాహితీ పాటవాలు సంపాదించే అవకాశాలు మన విద్యారంగంలో కల్పిస్తున్నామా? పాత్రికేయులు శూన్యంలో బతకటంలేదు. ఇతర వృత్తుల వారికన్నా ఎక్కువగా ఇతర సామాజికులతో కలిసిమెలిసి, వారివారి సమస్యలకు ప్రతిస్పందించి

చేతనైన పద్ధతిలో శక్యమైన భాషలో వార్తా ప్రసారం చేస్తున్నమాట ఎలా వాస్తవం కాదనగలం? మరో ప్రధాన లక్షణం గమనించదగ్గది. పత్రికాభాషను ఆక్షేపించే వాళ్ళలో ఏ ఒక్కరూ కాల స్థల పరిమితులకు లోబడి తాము రచిస్తున్న, రచించిన వాళ్ళు కాదని చెప్పవచ్చు. తమ కిష్టమైన విషయాలను గురించి తాపీగా తీరికగా గ్రంథ రచన చేస్తూ అంతకన్నా విశ్రాంతిగా పునరాలోచించి అవకాశమున్నవారితో తమ ఇష్టానిష్టాలతో నిమిత్తం లేకుండా అభిరుచితో సంబంధంలేని విషయాలను కూడా నిర్దిష్ట సంకుచిత కాలపరిధిలోని నిర్దిష్టస్థల పరిధిలో రాసే పాత్రికేయులను పోల్చి, మొదటివారి ప్రాగల్భ్యం రెండోవారికి లేదనడం న్యాయమా?

భాషా గ్రంథాన్నో (సృజనాత్మక) సాహితీ రచననో వెలువరించే రచయితకు తన పాఠకులందరూ (లేదా అత్యధిక సంఖ్యాకులు) సాహితీపరులని తెలుసు. పాత్రికేయుడికి ఆ భాగ్యంలేదు. అతడికి వార్త లందించే వాళ్ళలో అతడు రాసిన వార్తలు చదివే వాళ్ళలో (చదివించుకొని వినేవాళ్ళలో) నూటికి తొంభయి తొమ్మిదిమంది సమాచారం తెలుసుకోవాలనేవాళ్ళేగాని అతగాడి సాహితీ సౌష్ఠవాన్నీ భాషా ప్రాగల్భ్యాన్ని పరిశీలించాలనుకొనే వాళ్ళుకాదు.అతడికి స్వాభిరుచితో సంబంధమూ లేదు. సంబంధమున్నా దాన్ని ప్రదర్శించే అవకాశమూ లేదు. వార్తా కథనాన్ని తీర్చిదిద్దే సమయం, ఆ కథనాన్ని ఆకర్షకంగా రాయడానికి కావలసిన స్థలం అతడికి అందుబాటులో లేవు. పునరాలోచన, పునా రచనావకాశాలు చాలా పరిమితం. అతడి భాషాపరిజ్ఞానం వల్ల వృత్తిలో రాణించడు. వార్తా కథనాన్ని సకాలంలో నిర్దిష్ట స్థలావధిలో రాసుకోవలసిందే. అన్నిటికన్నా ముఖ్యం నేటి (దిన) పత్రికల్లో పనిచేసేవాళ్ళకు స్వాతంత్ర్యం చాలా తక్కువ - బయటి రచయితల్లాగే వాళ్ళు సర్వతంత్ర స్వతంత్రులు కారు. ఈ పరిమితులను పరిగణించకుండా చేసే విమర్శలు దోషైకదృష్టితో చేసేవే. అన్యం కాదు.

పత్రికల్లోని భాష పరమాద్భుతంగా ఉందని కీర్తించటం కాదు వ్యాస ప్రయోజనం. భిన్నకులాలకు, మతాలకు, ప్రాంతాలకు, విద్యాస్థాయులకు సంబంధించిన పాత్రికేయులు అనేక పరిమితులకు లోబడి పనిచేస్తున్నప్పుడు సమాన ప్రమాణాలతో ఇతర రచయితలతో పోటీపడటం అసాధ్యం. ఆక్షేపించే మహా రచయితలు పాత్రికేయులకు కట్టిపడవేసే పరిమితులను తమకు

ఆపాదించుకొని, తమ ప్రాగల్భ్య ప్రదర్శనచేస్తే భాషకు మరింత అభివృద్ధి సాధించవచ్చు. కానీ ఒక్క విషయం ముఖ్యం. భాషా సాహిత్యాల్లో ప్రావీణ్యమో బిరుదులో సంపాదించిన విద్వాంసుల్లో ఎందరు విశ్రాంతి పూర్వకమైన ఉపాధ్యాయ వృత్తిని అభిమానిస్తున్నారో అవిశ్రాంతమైన పాత్రికేయవృత్తిలో ప్రవేశిస్తున్నారో లెక్కలు తీస్తే వాస్తవాలు బయటపడతాయి. పనిలో పనిగా పాత్రికేయులు ఆదర్శ రచనలుగా పరిగణించదగ్గ ఆధునిక వచన రచనలను గుర్తించడం మంచిది. వారికి వృత్తివిద్య నేర్పే విశ్వవిద్యాలయాలు వారికి ఆధునిక ప్రామాణిక భాషలో రచించగల శక్తి సామర్థ్యాలను ప్రసాదించే విధంగా పాఠ్యక్రమాన్ని పరిష్కరించి అమలు జరపడం మంచిది. పత్రికా సంస్థలు కూడా ఇందుకు తోడ్పడటం అభిలషణీయం.

# పాతికేళ్ళ పత్రికారంగం: సాంస్కృతిక విషయాలు

—శ్రీ గుడిపూడి శ్రీహరి

పాతికేళ్ళక్రితం - అంటే దాదాపుగా - నా జర్నలిజానికి ఉన్నంత వయస్సు - పత్రికా రచనలో ప్రముఖంగా రాజకీయాలకే ఎక్కువ ప్రాధాన్యత వుండేది. నిజానికి రాజకీయాలు ఈనాటికీ పత్రికారచనలో ప్రాముఖ్యత సంతరించుకుంటున్నా, పత్రికలసంఖ్య పెరుగుదలవల్లా, ప్రజల్లో పెరుగుతున్న అభిరుచుల వైవిధ్యంవల్లా అటు సాంస్కృతిక రంగం గానీ, ఇటు సినిమా రంగంగానీ ఎన్నో ప్రధానమైన విషయాల్లో ప్రజలకు విజ్ఞానం అందించాల్సిన అవశ్యకత ఏర్పడింది, అది పెరుగుతూ వచ్చింది.

పాతికేళ్ళక్రితం పత్రికల్లో ఎక్కువగా సాంస్కృతిక కార్యక్రమాల గురించి రచనలు కనపడేవి కాదు. అవి ఎప్పుడో అప్పుడు వారపత్రికల్లోనో లేక ఆదివారం అనుబంధాల్లోగానీ కనపడుతూ వుండేవి. కాని ప్రతిరోజూ నిర్వహిస్తున్న సాంస్కృతిక కార్యక్రమ అంశాల్ని, సాంస్కృతిక వికాసాన్ని అంతగా ప్రతిబింబించేవికావు. దీని ఆవశ్యకతకూడా అంతగా పత్రికా నిర్వాహకులకు కనపడేది కాదు.

అయితే పత్రికా రచనలో వస్తున్న అనేక మార్పులతో పాటుగా అంటే క్రీడారంగవార్తల సేకరణ ప్రచురణల వంటివాటితో పాటు, అట్లాగే విజ్ఞాన సంబంధమైనవిగాని, ఆర్థిక సంబంధమైనవి గాని, వ్యవసాయ సంబంధ విషయాల్లో గాని ఒక్కొక్కదానికి ప్రత్యేకంగా స్థలం కేటాయిస్తూ రావడం ఈ మధ్యనే వచ్చిన మార్పు.

ఇదేవిధంగా సాంస్కృతిక విషయాలకి కూడా ప్రాముఖ్యత ఇవ్వడం ప్రారంభించారు. మొదట్లో ఆంధ్రపత్రిక దినపత్రికలో సైతం ఈ సాంస్కృతిక విషయాలకు అక్కడక్కడా స్థానం కల్పించేవారు. కానీ, ప్రత్యేకంగా

ఒక ప్రాధాన్యతనిచ్చి ప్రచురించడం జరిగేది కాదు. అట్లాగే మిగిలిన పత్రికల విషయంలో కూడా.

అయితే అప్పటికీ ఇప్పటికీ కూడా రాజకీయవార్తలకే ప్రాధాన్యం తప్పలేదు. పాతికేళ్ళక్రితం మొదటిసారిగా సాంస్కృతిక కార్యక్రమాలకీ, విషయాలకీ ప్రత్యేకస్థానంకల్పించింది ఆంగ్లంలో వెలువడే 'ది హిందు' పత్రిక. ప్రతివారం ఒక నాలుగు పేజీలు దీనికోసం అదనంగా కేటాయించి ప్రచురించడం ప్రారంభించారు. ఈ రోజున ఆ 'శుక్రవార సాంస్కృతిక' పేజీలు జనాదరణకు నోచుకున్నాయి. ఈ వినూత్న పంథాని, క్రమేపీ తెలుగు పత్రికలు కూడా తొక్కటం మొదలెట్టాయి. ముఖ్యంగా ఆంధ్రజ్యోతి, ఆంధ్ర ప్రభ వంటివి. అయినా వీటికి ఎక్కువ పేజీలని ఇచ్చేవారు కాదు.

ఇక పత్రికా రచన విషయంలో, కళల గురించి రాయాలీ అనుకుంటే, ఆవిధంగా రాయడానికి ఒకప్రత్యేక రచనా శైలీ, ధోరణీ అవసరమన్న విషయం అందరూ గుర్తెరిగింటే. ఎవరో ఒకరు రాయడం వేరు. సాంస్కృతిక అవగాహన వున్నవాళ్ళు రాయడం వేరు. ఇది సాంకేతిక పరమైన విద్య కాబట్టి సైన్సు, టెక్నాలజీ, ఆర్థిక రంగం, పరిశ్రమలు, ఎగ్రికల్చర్ వంటి విషయాల గురించి రాసేవారు వుండాలి. ముఖ్యంగా ఈ అవసరం శాస్త్రీయపరమైన సంగీత, నృత్య కార్యక్రమాల్లో, విశ్లేషణలో, వ్యాసాల్లో చాలా అవసరం. నేర్పరితనం, జ్ఞానం వుండాలి. అందుకని ఈ రచన కొందరివరకే పరిమిత మైన కళ. దీనికి తత్సంబంధిత భాషాజ్ఞానం చాలాముఖ్యం. అందుకే ఈ రోజున అది ఒక ప్రత్యేకతను సంతరించుకున్న పత్రికా రచనగా గుర్తింపు పొందింది. కాని, ఈనాటికీ కొన్ని పత్రికల్లో, ఈ సాంస్కృతిక రచన, ఉత్త 'రిపోర్టింగ్'గా మాత్రమే దర్శనమివ్వడం శోచనీయమైన విషయం. ఏదైనా కార్యక్రమం జరిగినప్పుడు, ఆ కార్యక్రమ వివరాలుమానేసి, ఆ సభలో పాల్గొన్నవారు మాట్లాడినదే రిపోర్టు చేస్తారేతప్ప, సాంస్కృతిక కార్యక్రమం గురించి రాయడం బహుతక్కువైంది.

ఈ సాంస్కృతిక రచనలో విశ్లేషణకి అత్యంత ప్రాధాన్యత వుంది. జానపద కళలు, నాటకం వరకూ అందరూ రాయగలరేమోగాని, శాస్త్రీయ లలిత సంగీత స్థాయినుంచి శాస్త్రీయతతో నిండే నృత్య, సంగీతాల గురించి అందరూ రాయలేరన్నది నిర్వివాదాంశం. అప్పటికీ, ఇప్పటికీ కూడా, మిగిలిన

పత్రికా రచన విషయాల్లో ఇస్తున్న శిక్షణ వంటిది, ఈ సాంస్కృతిక విష యాల రచన విషయంలో కూడా 'శిక్షణ' ఇవ్వడం జరగడం లేదు. మామూలుగా అన్ని విషయాలూ 'రిపోర్టింగ్' చేస్తున్నట్టే, ఈ సాంస్కృతిక విషయాల రిపోర్టింగ్ ప్రారంభించారు. ఇది సాంస్కృతిక రంగానికి సరి తూగని, అన్యాయప్రక్రియ. చివరికి ఏదైనా విషయం కూలంకషంగా రాయాలీ అనుకుంటే, వార్ని వీర్ని అడిగి తెలుసుకోవాల్సిన పరిస్థితి. ఆమాట కొస్తే ఆ విధంగా అడిగినా ఫరవాలేదుగాని, తమకు తోచింది రాసి అభాసు పాలవడం ప్రస్తుతం ఉన్న దారుణ పరిస్థితి.

ఒక్కమాటలో చెప్పాలంటే, ఇప్పటివరకూ క్షుణ్ణంగా, విమర్శగా రాయడం తెలుగు పత్రికా రచనలో రాలేదు. అయితే ఈ విషయంలో ఆంగ్ల పత్రికలు ముందంజ వేశాయి. ముఖ్యంగా 'ది హిందు', 'టైమ్స్ ఆఫ్ ఇండియా', 'హిందుస్థాన్ టైమ్సు' 'స్టేట్స్‌మన్' వంటి పత్రికలు. ఈ రచన కోసం ప్రత్యేకంగా జర్నలిస్టులను ఏరుకుంటారు. అవసరమైతే మార్గదర్శక సూత్రాలుకూడా అందజేస్తారు.

నిజానికి సాంస్కృతిక విషయాలపై రచన, రాసినవారిదగ్గరే ఆగదు. ఆ రాసినది, ఒక సబ్ ఎడిటర్ టేబిల్ మీదకు వెళ్ళినప్పుడు, దాన్ని కూలం కషంగా పరిశీలించి, తగినరీతిలోకి మార్చి ప్రచురించాల్సిన బాధ్యత ఎడిటర్స్‌ది కూడా. అంటే వారికీ, ఈ విషయాల్లో జ్ఞానప్రాప్తి వుండాలి. నాకు తెలిసి నంతమేర ఇది ఆంగ్ల పత్రికల్లో ఇప్పటికీ వుంది. తెలుగులోకిరాలేదు. ఒక్కొక్కప్పుడు తాము రాసిన దాన్ని తిరిగి 'అచ్చు'లో చూసుకున్నప్పుడు, దాన్లో వున్న మార్పులు, చేర్పులూ, కూర్పులూ చూసి నేర్చుకోవాల్సిన బాధ్యత, ఈ పత్రికా రచయితలకుంది. తమ శైలిని, పత్రికకు తగ్గరీతిలో మలుచు కుంటారు. ఇది సహజ సిద్ధంగా రావలిసిన ప్రక్రియ.

పత్రికారచనలో వస్తున్న మార్పులతోపాటు, రచయితలు, విలేఖరులూ, వ్యాసరచయితలూ కూడా ఈ విషయంపై ధ్యాస వుంచవలసిన ఆవశ్యకత ఎంతో వుంది. పత్రికా ఎదుగుతుంది; తామూ ఎదుగుతారు.

అయితే సాంస్కృతిక విషయాలపై రాసేవారికి భాషపై మిగిలిన వారికన్నా ఎక్కువ అధికారం వుండాలి.

ఈ మధ్య కాలంలో, 'ఈనాడు' పత్రిక ఈ విషయంలో కొంతవరకూ మార్గదర్శకమైంది. జిల్లా ఎడిషన్లు ప్రారంభించిన నాటినుంచి, సాంస్కృతిక విషయాలపై రచనలు ఎక్కువగా ప్రచురిస్తూ రావడంతో, ఆదరణ పెరిగింది. వెంటనే మిగిలిన తెలుగు పత్రికలు కూడా అదేమార్గం తొక్కాయి. ఈరోజున దాదాపు అన్ని తెలుగుపత్రికల్లో, ఈ సాంస్కృతిక రంగానికి ప్రత్యేక స్థలాన్ని కేటాయించడమే కాకుండా, రాజకీయ వార్తల్లాగానే, సాంస్కృతిక వార్తలు, విశ్లేషణలు, విమర్శలు కూడా ఎప్పటికప్పుడు ప్రచురించడం ప్రారంభమైంది. అయితే ఏ రోజు జరిగే కార్యక్రమం ఆరోజు రాసివ్వడం, మరుసటి రోజు పత్రికల్లో వాటిని చూడడం అన్న ఒక కొత్త ప్రక్రియ రావడంతో, సమయనిబద్ధమైన ప్రచురణకు అనుగుణంగా, సమయానికి తమ రిపోర్టు అందించాలనే ధోరణివల్ల, కార్యక్రమాన్ని సగం వరకూ చూసి, మిగిలినదాన్ని తెరవెనుక వారిని అడిగితెలుసుకుని రాసుకునే దుష్ట సాంప్రదాయానికి తావొచ్చింది.

దీనివల్ల, కార్యక్రమ విశ్లేషణ అర్ధాంతరంగా ముగియడం, మిగిలింది స్వకపోల కల్పనగా పత్రికల్లో వచ్చే రిపోర్టులు, చాలా వరకు అనాసక్తిగా రావడం ప్రారంభమైంది. అంతేకాదు, ఎవరో నొచ్చుకుంటారన్న భయంతో బాధ్యతవిడిచి, పొగడ్తల రిపోర్టులు, విశ్లేషణలూ రావడంతో ఈ సాంస్కృతిక రంగానికి పత్రికల్లో వచ్చిన గుర్తింపును, సరిగ్గా దాన్ని భ్రష్టుపట్టించే రచనలు, పొగడ్తలు రావడంతో పరిస్థితి మళ్ళీఅధ్వాన్నంగా మారుతోంది. అంతే కాకుండా, కార్యక్రమాలలో ఆహూతులప్రసంగాల రిపోర్టులు ఎక్కువై, సాంస్కృతిక విషయాలు తగ్గడం మరో దౌర్భాగ్యం. ఇదే అదనుగా, తమ పేరు పదిమందికీ తెలవాలనో, లేకపోతే విషయకాంక్షతో, కార్యక్రమనిర్వహణకు ధనసహాయంపేరిట, ఆ దాతలు, వేదికలెక్కిచేసే ఉపన్యాసాలు పత్రికా రచనలోకి రావడంవల్ల అటువంటి వారి సంఖ్య పెరుగుతోందేతప్ప, ఏ కార్యక్రమంకోసం ఈ పేజీలు కేటాయించారో ఆ సాంస్కృతిక కార్యక్రమాలకి, కళాకారులకి, విషయానికి ప్రాధాన్యత తగ్గిపోయింది. దీన్ని అందరూ గుర్తించి వెంటనే దాన్ని మళ్ళించే ప్రయత్నం ప్రారంభించాలి. లేకపోతే సాంస్కృతిక బంధువులు, సాంస్కృతిక రాబందుల్లా మారే ప్రమాదం మరింత పెరుగుతుంది.

ఏమైనా, ఈనాడు సాంస్కృతిక రచనకు స్థానం కల్పించడం,పత్రికలు చేసిన గొప్ప ప్రయత్నంగా చెప్పుకుంటూ, వేరుపురుగులకు గుర్తింపు ఇవ్వకుండా, కళలగురించి కళాకారుల గురించి మాత్రమే ఎక్కువ రాయగలగితే సాంస్కృతిక రంగానికి పత్రికలు సేవచేసిన వవుతాయి. దానితోబాటు ఈ విషయాలపై రాయగలిగిన రచయితల శ్రేణిని సృష్టించుకోగలగాలి. వారికి తగిన శిక్షణ ఇచ్చి సాంస్కృతిక విషయానుగుణంగా రాయగలిగేట్టు చేయాలి. భాషాసౌలభ్యాన్ని పెంచాలి. శాస్త్రీయపరంగా వినవడే అనేక సాంస్కృతిక పదాలకు తెలుగుసేత కూడా జోడించి రచన చేయగలిగితే అంతకన్నా గొప్ప విషయం మరొకటి లేదు.

# పత్రికల్లోని భాష–సాహిత్యం–సాంస్కృతికాంశాలు

—శ్రీ కల్లూరి భాస్కర్

పాతికేళ్ళ పత్రికా రచనలో భాష - సాహిత్యం - సాంస్కృతికాంశాలను సమీక్షించగలిగినంత అనుభవం నాకు లేదు. ప్రస్తుతం తెలుగు పత్రికల్లోని భాష-సాహిత్యం-సాంస్కృతికాంశాలగురించి నా అభిప్రాయాలు మీముందు ఉంచుతాను.

'యథా ప్రజా తథా పత్రికా' అనవచ్చు. పాఠకుల అభిరుచినిబట్టి పత్రికలు ఉంటాయి. పత్రికలను పోషించేది వారే కనుక. ఈ మధ్య తెలుగు పత్రికలన్నీ దాదాపు ఒక పేజీని సినిమా విశేషాలకు కేటాయించడం తాజా ఉదాహరణ. మరి ఈ పాఠకులు ఎలాంటివారంటే- స్వాతంత్ర్యం తర్వాత విద్య, విద్యాలయాల విస్తరణ, అక్షరాస్యతా వ్యాప్తి మొదలైన కారణాలవల్ల చదవడం రాయడం మాత్రమే తెలిసుండి తగినంత సాంస్కృతిక నేపథ్యంలేని నయా అక్షరాస్యులు అవతరించారు. వీరికి పత్రికల్లో బరువైన విషయాలు అంతగా రుచించవు. కాలక్షేపం కబుర్లు వీరు ఇష్టపడతారు. అంటే మన దేశం ఇప్పుడు ఒక సాంస్కృతిక పరివర్తనా దశలో ఉంది. సర్క్యులేషన్ పెంచు కోవలసిన పత్రికలు ఈ నయా అక్షరాస్యులకు ఇష్టమైనవే రాయడం అనివార్యం.

రాయచ్చు, తప్పులేదు. అయితే వ్యక్తి నైశిత్యంతో, గతి నిర్దేశంకూడా దానితోపాటే పత్రికలు చేయవచ్చు. పత్రికలు వాస్తవ చిత్రాన్ని ప్రతిబింబిం చడమే కాదు, సామాజిక గతి నిర్దేశం కూడా చేయవలసిన బాధ్యత వాటిపై ఉంది. ఆ పని ఇప్పటి పత్రికలు చేస్తున్నాయా అని ఒక అనుమానం. పాఠకుల స్థాయికి దిగడం తప్పేమీకాదు. అయితే అప్పుడుకూడా పత్రిక రచయితకు తనవైన స్థాయీ, ప్రమాణాలూ ఉండాలి. ఉదాహరణకు 'దేశమంటే మట్టి

కాద్లోయ్, దేశమంటే మనుషులోయ్' అన్న అందరికీ అర్థమయ్యే గేయం రాసిన గురజాడకు క్లిష్ట సమాసాలలో రచన చేయడం చేతకాదని అనలేం. నిజం చెప్పాలంటే, అందరికీ అర్థమయ్యే తేలిక భాష రాయడం వెనుకకూడా ఎంతో సాధన, అధ్యయనం ఉంటుంది. అదంత తేలిక కాదు. అలాగే పత్రికా రచయితలుకూడా తమ రంగంలో వృత్తి నైశిత్యాన్ని, ఉన్నత ప్రమాణాలను సాధన చేయాలి. అప్పుడే వారు గతి నిర్దేశం చేయగలుగుతారు. అందుకు తగినంత శిక్షణ వారికి అవసరం. ఆ శిక్షణ ఇప్పుడు లభిస్తోందా? ఎవరికి వారే ఆలోచించాలి.

తెలుగు పత్రికల్లో భాష విషయమే చూద్దాం. పత్రికా రచన ఎకడమిక్ రచనకు పూర్తి భిన్నమైనది. దానిది ఒక ప్రత్యేక శైలి. అటువంటిది, తెలుగు పత్రికా రచనకు ఒక నమూనాను మనం రూపొందించుకోలేకపోయాం. ఎకడమిక్ రంగం - పత్రికారంగం మధ్య ఈ విషయంలో ఆదాన ప్రదానాలు ఏమీ ఉండటం లేదు. రెండు రంగాల మధ్య సమన్వయం లేనేలేదు. పత్రికా రచనలో విషయం గాంభీర్యం, భాషాసౌష్ఠవం లేదని ఎకడమిక్ విద్వాంసులు అనుకొంటారు. ఎకడమిక్ విద్వాంసులు రాసే విషయము, భాషా పత్రికలకు పనికి వచ్చేవి కావని పత్రికా రచయితలు అనుకొంటారు. తెలుగు పత్రికా రచనకు ఒక నమూనా లభించి, అది మెరుగుపడాలంటే ఎకడమిక్ పండితులకు పత్రికా రచనలో శిక్షణను నిర్బంధం చేయాలి. అలాగే పత్రికా రచయితలకు ఎకడమిక్ శిక్షణ ఇవ్వాలి.

పాఠకులు తయారైన పత్రికనే చూస్తారు. అది తయారు అవడానికి ముందు సంపాదకవర్గం ఎదుర్కొనే సమస్యలు వారికి అర్థం కావు. తెలుగు వారికి, దాదాపు అందరికీ భాషా సంబంధమైన క్రమశిక్షణ లేదు. కనీస వ్యాకరణం కూడా పాటించరు చాలామంది. ఇక దస్తూరిలో ఏ మాత్రం శ్రద్ధ చూపించరు. పత్రికలకు వస్తున్న ఉత్తరాలు, వ్యాసాలు చదివితే ఒక్కొసారి ఏమనిపిస్తుందంటే - ఇంగ్లీషూ వద్దు, హిందీ వద్దు - అందరికీ ముందు తెలుగు రాయడం శుద్ధంగా నేర్పిస్తే బాగుంటుందని. విద్యావంతులు కూడా ఇందుకు మినహాయింపు కాకపోవడం విచిత్రం. విశ్వవిద్యాలయాలలో పనిచేసే తెలుగు అధ్యాపకులు, వారిలోనూ సుప్రసిద్ధులు రాసిన వ్యాసాలను కూడా పత్రికలలో

పనిచేసే సబ్ ఎడిటర్లు దిద్దవలసి వస్తున్నదంటే పరిస్థితిని అర్థం చేసుకోవచ్చు. ఇప్పటికీ గ్రాంథిక భాషలో రచనలు రాసిపంపే విద్యావంతులు ఉన్నారంటే ఆశ్చర్యం కాదా!

తెలుగు పత్రికా రచనకు ఒక నమూనా లేనందువల్లనే, భాషలో గట్టి శిక్షణ లోపించినందువల్లనే తెలుగు పత్రికా భాషలో నానాత్వం సంభవిస్తోంది. తాను మునిగినది గంగ అన్న ధోరణి ప్రబలింది. ఉదాహరణకు పటిష్ఠము, ప్రతిష్టంబన, ప్రతిష్ఠ, అధిష్ఠానవర్గం అనే మాటలకు ఏ ఇద్దరూ ఒకే స్పెల్లింగ్ రాయరు. వాక్య రచనలో మిడియోక్రటీ సంగతి చెప్పనే అక్కర్లేదు. ఆంగ్లభాషా రచనలో స్పెల్లింగు, వాక్య నిర్మాణంలో చూపించే శ్రద్ధ తెలుగులో ఎందుకు చూపించరో అర్థంకాదు. తెలుగులో వ్యావహారిక భాషోద్యమాన్ని తప్పుగా అన్వయించుకొన్న ఫలితమేమో ఇది అనిపిస్తుంది. నిఘంటువులను, వ్యాకరణాలను నిరాకరించిన సాహిత్య వారసత్వం ఇందుకు కారణమా అనిపిస్తుంది. వ్యావహారిక భాష రాయాలంటే, పద్ధతులు పాటించవద్దని కాదు. వ్యావహారిక భాష రాయడానికి కూడా తగినంత భాషాభినివేశం, పద్ధతీ ఉండాలి. అదంత తేలిక కాదు. అలాగే నిరంకుశులైన కవులు, రచయితలు నిఘంటువులను, వ్యాకరణాలను నిరాకరించవచ్చు. సాహిత్యం ప్రయోగ రంగం. దాని పరిధి పరిమితం. పత్రికలు అలా కావు. అది తక్షణ సమాచార వినిమయరంగం. దాని పరిధి విస్తృతం. ఉదాహరణకు ఒక కవి రాసిన కవిత్వం మంచి చెడులతో బృహత్ పాఠక సమాజానికి సంబంధం లేదు. కవితారంగానికి చెందినవారు దాని సంగతి చూసుకుంటారు. దానివల్ల ఆశించే తక్షణ ప్రయోజనం ఏమీ లేదు. పత్రికలు అలా కావు. అవి సమాచార సాధనాలు. పాఠకులకు సమాచారం చేరాలంటే భాషలో ఒక నమూనా, పద్ధతీ పాటించవలసిందే. ప్రవాహశీలమైన భాషకు గట్టు కట్టడమేమిటని భాషా శాస్త్రజ్ఞులు అంటారు. అది నిజమే. కానీ అది ఎకడమిక్ ప్రశ్న. పత్రికలకు దానిని అన్వయించకూడదు. ఎంత నిరంకుశ కవి అయినా, ఎంత భాషా శాస్త్రజ్ఞుడైనా బంధువులకు, మిత్రులకు ఉత్తరాలు రాసేటప్పుడు వ్యాకరణాన్ని స్మరించడు. అక్కడ విషయం తెలియడం ప్రధానం అనుకుంటాడు. పత్రికలు అలాంటివే.

కనుక తెలుగు పత్రికా రచనకు ఒక నమూనా రూపొందించుకోవాలి. భాషమీద శ్రద్ధ చూపాలి. మిడియోక్రిటీని తొలగించుకోవాలి.

వాస్తవిక కార్యరంగంలో సంపాదక వర్గం ఎదుర్కొంటున్న మరో ఇబ్బంది మీకు విన్నవిస్తున్నాను. అది తెలుగులో ప్రాతికేయ స్ఫర్శలో రచనలు చేయగలిగినవారు చెప్పుకోదగిన సంఖ్యలో లేకపోవడం. పత్రికారచన విలక్షమైనది. దాని కొక ప్రత్యేక శైలి. ముఖ్యంగా ఫీచర్లు, వ్యాసాల విషయంలో ఈ కొరత బాగా ఎదురవుతుంటుంది. గిలిగింతలు పెట్టేలా రాయడం, ఆరోగ్యకరమైన సంచలనాత్మకత, క్లుప్తత, ఒక కొత్త విషయం చెప్పడం, తార్కిక ప్రజ్ఞ - ఇవీ పత్రికారచనలో ప్రధానమైనవి. అలాగే సమయానుకూలత, సందర్భశుద్ధి - ఉదాహరణకు - నన్నయ కాలంలో మత సాంఘిక పరిస్థితులు అన్న పేరులో వ్యాసం రాస్తే, అది దినపత్రికలలోని సాహిత్య పుటలకు పనికొచ్చే వ్యాసం కాదు. పాత విషయాలే మళ్ళీమళ్ళీ రాయడం, అలంకారిక శైలి, సమాసాటోపం. సాగదీయడం - ఇవి పత్రికారచనకు పనికిరావు.

ఇక సాహిత్యం గురించి. దినపత్రికల్లో సాహిత్యం గురించి చెప్పాలంటే అది పిలవని పేరంటానికి వచ్చిన ఇల్లాలు. దినపత్రికలలోని ఇతర అంశాల స్కీంలో అది అతకదు. సాహిత్యం పాఠకులు తక్కువ. అయినా కొన్ని పత్రికలు పరిమిత పాఠకుల కోసమైనా సాహిత్యానికి చోటిస్తున్నాయి. విస్తృత పాఠకుల్లో సాహిత్యాభిరుచిని కలిగించడానికి, ఇప్పుడు పాహిత్య వ్యాసాలు, ఫీచర్లు ప్రచురిస్తున్న పద్ధతిని కొంత మార్చితే ఏమైనా ప్రయోజనం ఉంటుందేమో చూడాలి. ఈ రంగంలో కూడా మార్గనిర్దేశం చేయవలసిన బాధ్యత పత్రికా రచయితపై ఉంది.

ఇక సాంస్కృతికాంశాల గురించి : ఇక్కడ మౌలికవిచారణ చేయడం అవసరం. మన దేశానికి సంబంధించినంతవరకు 'సంస్కృతి' అనేమాట అస్పష్టతకు ఒక బ్రహ్మాండమైర ఉదాహరణ దానికి ఒక స్పష్టమైన రూపు రేఖలు లేవు. 'భారతీయ సంస్కృతి' అనే మాటను చాలామంది తరచు వాడుతుంటారు. నిజానికి 'భారతీయ సంస్కృతి' అనేది ఏకశిలా రూపంలో ఏదీలేదు. ఈ దేశంలో భిన్న భిన్న సంస్కృతులు ఉన్నాయి. అలాగే ఏకశిలా సదృశమైన భారతీయ సమాజం అనేదికూడా లేదు. కానీ చాలామంది 'సమాజం'

అనే మాటను తరచు వాడుతుంటారు, ఇక్కడ భిన్న భిన్న సమాజాలున్నాయి. భిన్న భిన్న విలువలున్నాయి, ప్రమాణాలున్నాయి. ఇక్కడ ఎన్నో నిగూఢమైన ప్రపంచాలున్నాయి. వాటి విలువలు వాటికున్నాయి. భిన్నత్వంలో ఏకత్వం అభిలషణీయమే గానీ, ఆ భిన్నత్వం గురించిన అవగాహన మొదట ఉండాలి కదా! మన పొరుగునే మనకు అర్థంకాని, మనకు తెలియని ప్రపంచాలు, విలువలు ఉన్నాయని అప్పుడే బోధపడేది.

మనం అందిస్తున్న సాహిత్యం, మనం అనుకొంటున్న సంస్కృతీ దేశంలో పట్టుమని పదిశాతం కూడా లేని ప్రజల ఆలోచనలను, ఆచరణను ప్రతిబింబిస్తున్నవి. ఇవి విస్తృత సమాజానికి వర్తించేవి కావు. మన పత్రికలు, మన సినిమాలు అందిస్తున్నవి ఈ అల్పసంఖ్యాక సంస్కృతినీ, సాహిత్యాన్నీ, విలువలనే. బాలచందర్ దర్శకత్వంలో ఆ మధ్య ఒక సినిమా వచ్చింది. ఒక పేద యువతీ సంపన్న యువకుడూ ప్రేమించుకొంటారు. ఆ యువకుడి తండ్రి ఆ అమ్మాయిని పిలిచి తన కొడుకును వదలిపెడితే కొన్ని వేల రూపాయలు ఇస్తానని ఆశ పెడతాడు. డబ్బుకోసం ప్రేమను త్యాగం చేయలేనంటుంది. అంతలో ఆ అమ్మాయి సన్నిహిత బంధువొకరు జబ్బుపడతారు. వేల రూపాయలు ఖర్చుపెడితే గానీ అతడు దక్కని పరిస్థితి. అప్పుడా యువతి సంపన్నుడి దగ్గరకు వెళ్ళి - మీ కొడుకుని మరచిపోతాను. డబ్బు ఇవ్వండని అడిగి డబ్బు తీసుకు వెడుతుంది. ఈ పరిగతి ప్రేమించిన యువకుడికి తెలుస్తుంది. డబ్బు కోసం నీవు ఏమైనా చేస్తావా ? అని నిలదీస్తాడతడు. అప్పుడా యువతి సమాధానం చెప్పలేక తలవంచుకుంటుంది నిజానికి రాజమండ్రి కోట గుమ్మం దగ్గర, విజయవాడ రామా టాకీస్ మద్ద బొంబాయి రెడ్ లైట్ ఏరియాలో ఈ ప్రశ్నకు సమాధానాలు కనిపిస్తూనే ఉంటాయి. కానీ మధ్యతరగతి విలువల్ని ప్రతిబింబించే మన సినిమాల్లో దానికి తలవంచుకోడమే సమాధానమవుతుంది. అలాగే బొంబాయి లాంటి చోట స్మగ్లర్లు నివసించే నిగూఢ ప్రపంచాలు (Under World) ఉన్నాయి. ఆ ప్రపంచానికి అద్దం పట్టిన 'నాయకుడు' అనే సినిమా ఆ మధ్య వచ్చింది. స్మగ్లింగ్ ద్వారా కోటీశ్వరుడైన ఒక వ్యక్తి కథ అది. అతడికీ కొన్ని విలువలూ, ప్రమాణాలు ఉన్నాయి. అతడిలోనూ మానవత్వం ఉంది. అయితే అతడు బతుకుతున్న సమాజానికి అనుగుణంగా అవి ఉంటాయి. అతడు హత్యలు చేస్తాడు, అంతే కాదు- ఆపదలో ఉన్న వారిని ఆదుకొంటాడు కూడా,

అతని కూతురు బయటి ప్రపంచంలో పెరిగి, విద్యావంతురాలవుతుంది. మధ్య తరగతి విలువల మధ్య పెరిగిన ఆ అమ్మాయికి తండ్రితో ఘర్షణ ఏర్పడు తుంది. చిత్రం చివరలో ఆమే జయిస్తుంది. అంటే మధ్య తరగతి విలువలే జయిస్తాయన్న మాట.

ఈ ఉదాహరణలు ఎందుకు చెప్పవలసి వచ్చిందంటే - మన పత్రికలు, మన సినిమాలు, దూరదర్శన్, రేడియోలు అల్పసంఖ్యాక విలువలనే ప్రతిబింబి స్తాయి. ఇదే సంస్కృతి అనుకుంటే ఆ సంస్కృతిని పత్రికలు బాగానే ప్రతి బింబిస్తున్నాయి. త్యాగరాయ గానసభలో, రవీంద్ర భారతిలో జరిగే ఘనసన్మానాల గురించి, సంగీత, నాటక కార్యక్రమాల గురించి అవి బాగానే రాస్తూ సంస్కృతిని బాగానే పోషిస్తున్నాయి, ఇటీవల స్టార్ హోటళ్ళలో పాప్ మ్యూజిక్ వగైరాల పేరుతో వెల్లివిరుస్తున్న నయా సంపన్న సంస్కృతిని కూడా బాగానే పుటల కెక్కిస్తున్నాయి.

నా మటుకు నేను దీనిని సంస్కృతి అనలేను. ఇది అల్ప సంఖ్యాక సంస్కృతి మాత్రమే. తెలుగుదేశం ప్రభుత్వం వచ్చినప్పుడు అకాడెమీలను రద్దు చేస్తే పుట్టిన గగ్గోలు అంతా ఇంతా కాదు. సాంస్కృతిక రంగం శిథిలమై పోతోందని అంతా వాపోయారు. త్యాగరాయ గానసభలో దీనిపై చర్చ జరిగింది. అప్పుడు వాసిరెడ్డి సీతాదేవిగారు మాట్లాడుతూ - సంస్కృతి అంటే అకాడెమీలేనా అని ప్రశ్నించడం ఇప్పటికీ నాకు గుర్తుంది.

సంస్కృతి గురించి మాట్లాడేటప్పుడు దానిపట్ల ఇప్పటికన్నా స్పష్టమైన విస్తృతమైన అవగాహన పత్రికా రచయిత కుండాలి ఇక్కడి విభిన్న సంస్కృతుల గురించి, విభిన్న సమాజాల గురించి, విభిన్న విలువల గురించి అవగాహన ఉండాలి. ఈ విషయం చెప్పడానికే ఈ చర్చ చేయవలసి వచ్చింది.

# పత్రికలు–కార్టూన్ల ప్రభావం

—శ్రీ శ్రీధర్

పత్రిక అంటే ఏంటి, ఇంగ్లీషులో **Journal** అనే మాటకి పత్రిక అని మనం వాడు కొంటున్నాం. ఈ పత్రికలు అనేకం, వార్తాపత్రికలు, మేగజైన్లు, స్త్రీల పిల్లల యువకుల పత్రికలు, రైతుల కోసం, కోళ్ళ పరిశ్రమ మొదలుకొని పందుల పరిశ్రమ దాకా ఎన్నో రకాల పత్రికలు, దిన వార పక్ష మాస ద్వైమాస త్రైమాసికాలు ఇలా ఎన్నో - ఈ అన్నిరకాల పత్రికలు కూడా కార్టూన్లను ప్రచురిస్తున్నాయి. నేడు ఏ పత్రికా కార్టూన్లు లేనిదే మనజాలదనేది వివాద రహితాంశం.

మనం పత్రిక కొనగానే ముందుగా చూసేది దాన్లోని కార్టూన్లనే, ఆ తరువాతే ఇతరాంశాలు-ఇది ఏ పాఠకుడైనా తడుముకోకుండా చెప్పే విషయమే.

ముఖ్యంగా దిన పత్రికల్ని తీసుకున్నట్టయితే కార్టూన్‌తో దానికున్న బంధం, విడదీయరానంతగా ముడిపడి ఉంది కొత్తగా పత్రిక పెడుదామను కునేవాళ్ళు ఎడిటర్ కన్న ముందు కార్టూనిస్టుల్ని కన్సల్ట్ చేస్తున్నారంటే దాని బలం ఏ పాటిదో ఇట్టే ఊహించవచ్చు.

దీనికి కారణాలనేకం, సంక్లిష్ట సిద్ధాంతాల్ని వదిలేసి సాదాగా అర్థమయ్యే సాధారణ కారణాల్ని తీసుకుంటే-

**Cartoon is a visual medium** అంటే దృశ్యసాధనం. చదవాల్సిన అక్కర్లేకుండా, దాని గురించి ఆలోచించాల్సిన అవసరం లేకుండా ఇట్టే అర్థమవుతుంది. ఎంత బలంగా రాసేవాళ్ళ రాతలైనా, ఎంత చమత్కార రచనలైనా దీనిముందు దిగదుడుపే - **Photography, Charts, Maps** లాంటి దృశ్యసాధనాలకి ఉన్న అన్ని లక్షణాలూ దీనికుంటాయని వేరుగా చెప్పక్కర్లేదు. పైగా దీన్లో హాస్యమరుంది. ఫోటో తదితర విజువల్ మీడియాస్ ద్వారా మనం విషయాన్ని చెప్పగలమేగాని మన ఉద్దేశాన్నో, కామెంట్లునో

చెప్పడం సాధ్యపడదు. కార్టూన్‌తో మాత్రమే విషయవివరణా, దానిపైన మన స్పందన లేదా కామెంట్ + హ్యూమర్ అందివ్వగలం.

Visual media లో ఉన్న అన్ని సౌలభ్యాలు దీన్లో ఉన్నాయి గనుక చూపరిని ఇట్టే ఆకర్షిస్తుంది.

బొమ్మది అంతర్జాతీయ భాష. భాషాతీతమైనది, సరిహద్దులు లేకుండా ఎవరికైనా అర్థమయ్యేదీ ఇదొక్కటే. భాష, వయోభేదాలను ఎరుగనిది బొమ్మ.

ఫోటోగ్రాఫ్ అద్దంలాంటిది. మన ప్రతిబింబాల్ని మాత్రమే ఇవ్వగలదు. కార్టూన్ భావంలాంటిది. ఊహలాంటిది. ఎలాగైనా చిత్రిస్తుంది. కార్టూన్లో ఉండే బొమ్మ నువ్వు కానట్టే కనిపిస్తుంది. కాని అది నువ్వే, నిన్నే వెక్కిరిస్తుంది. నిన్ను నువ్వే వెక్కిరిస్తున్నట్టుగా వెక్కిరిస్తుంది. కనుకే ఈ దశాబ్దంలో 20 మందికి పైగా కార్టూనిస్టుల్ని నరికేశారు. ఇంకెందర్నో బొక్కలో దోశారు.

కార్టూన్ చిత్రకళ ప్రపంచమంతటా ప్రాముఖ్యతనీ ఆదరణనీ సంతరించుకోవటానికి ఇవే కారణాలు. బాధాతప్త హృదయాలనుండీ దుఃఖిత సమాజంనుండీ హాస్యం, చైతన్యం పుడతాయి. మనం బాధల్లో కష్టాల్లో ఉన్నప్పుడూ, పేదరికం, అసౌకర్యాలూ పీడన ఉన్నప్పుడు హ్యూమర్ పుట్టుకొస్తుంది. కసినుంచి రివేంజ్ నుంచీ ఈ వెక్కిరింపు జనిస్తుంది. ఆకలికి బలౌతున్నవాళ్ళు, నల్లాలో నీళ్ళు రానివాళ్ళు, కళ్ళల్లో నీళ్ళు లేనివాళ్ళు ఈ వెక్కిరింపుకూ అథారిటీని ధిక్కరిస్తున్న ఈ వెక్కిరింపునీ హాయిగా ఆహ్వానించి ఆదరించి ఆనందిస్తారు క్షణికం కోసమైనా.

మనం ఏదీ చేయలేని దయనీయ పరిస్థితిలో మరొకడు ఆ పని చేస్తే అహో అంటాం. అదే పని కార్టూన్ చేస్తోంది. మన కడుపు మంటకీ, కన్నీళ్ళకీ ప్రతిస్పందించి కారకుల్ని వెక్కిరించి అపహాస్యంచేసి మనల్ని నవ్విస్తుంది. ఒక బలహీనుడికి మహాబలవంతుణ్ని తన్నడం చాతవదు. అది సాధ్యమైనట్టు చూపెడితే దాన్లో మనల్ని మనం ఊహించుకొని ఆత్మానందం పొందుతాం. దీనికి చక్కని ఉదాహరణ చాప్లిన్ చిత్రాలు. దాదాపు ఆయన చిత్రాలన్నింటిలోనూ బలహీనుడు ఈ బలమైన సంఘంతోనూ తనకన్న వెయ్యిరెట్ల బలవంతులతోనూ ఏదోవిధంగా గెలుస్తుంటాడు. అందుకే ఆయన్నింకా ఆదరిస్తున్నాం.

అలాగే డిస్నీ animated pictures లో కూడా చాలా అల్ప ప్రాణులు క్రూరమైన పెద్ద జంతువుల్ని ఏడిపిస్తాయి. ఆ అల్ప ప్రాణులు మనం, క్రూర జంతువు సమాజం, అథారిటీ అధికారం కనుక మనం మనకి తెలియకుండానే మమేకమై ఆనందిస్తాం. ఇదేపని కార్టూన్ చేస్తున్నది. కనుక దాన్ని జనం ఆదరిస్తున్నారు. కనుక పత్రికలు ప్రచురిస్తున్నాయి. బలమైన ఆయుధంగా, ఆకర్షణ శక్తిగా, మహత్తరమైన సాధనంగా కార్టూన్ ఉందిగనుకే దాని అవసరం ఇంతగా ఏర్పడింది. దానికి ఆదరణ పెరిగింది.

తెలుగువాళ్ళకీ కష్టాలున్నాయి, తెలుగువాళ్ళకీ స్పందించే హృదయ ముంది. కనుక తెలుగులోకి కూడా కార్టూను 50 ఏళ్ళకి పూర్వమే రంగ ప్రవేశం చేసింది. మన తొలి కార్టూనిస్టు తలిశెట్టి రామారావుగారు. 50 ఏళ్ళ క్రితం ఆంధ్రపత్రికలో కార్టూన్స్ వేసే వారీయన. పంచ్ ప్రభావంతో ఈయన కార్టూన్స్ ఆరంభించినప్పటికీ భావంలో భాషలో చేతల్లో అవి 100% తెలుగు కార్టూన్లే. భావాలు అరువు తెచ్చుకున్నట్టు ఒక్కటి కానరాదు. తాటిచెట్టు ఎక్కి గీత కార్మికుడు తన కొడుక్కి కల్లుగీయడం నేర్పిస్తుంటాడో కార్టూన్‌లో. దాని కింద కాప్షన్ గీతాబోధ అని ఉంటుంది. అలాగే ప్రబంధ సుందరి - తెలుగు వాడు. ఇత్యాది అనేకం ఆయన చతురుతనీ సెన్సాఫ్ హ్యూమర్‌నీ మార్గదర్శకత్వాన్నీ నిరూపిస్తాయి.

ఆ తరువాత విశ్వాత్ముల నరసింహమూర్తి గారు, ఆ తరువాత ఆరంభ మయిందే బాపూ యుగం. బాపూగారి గురించి ఏం చెప్పినా చర్విత చర్వణమే అవుతుంది.

లలితమైన ఆ రేఖలూ, ఆ సన్నని అందాలూ ఆ బొమ్మలూ అట్ల కాడలూ, అప్పడాల కర్రల తాడనాలూ ఆ బొమ్మలూ సున్నితమైన హాస్యం మరువలేని కార్టూన్లు. మళ్ళీ మళ్ళీ కల్లోకొచ్చే అందమైన వయ్యారులూ....ఏ తెలుగు వాడికి తెలియదు ఆ వ్యక్తిగురించి. ఏం చెప్పినా పగటిపూట దీపం పట్టినట్టే అవుతుంది....అదోతరం. ఆయన శిష్య ప్రశిష్య ఏకలవ్య శిష్యకోటి అనంతం....

తొలిసారిగా తెలుగులో రాజకీయ కార్టూన్లని చిత్రించిన ఘనత మన రాంభట్ల కృష్ణమూర్తిగారికే దక్కుతుంది. అప్పటి కమ్యూనిస్టు పత్రికలకి

ప్రజాశక్తి, విశాలాంధ్రలను అప్పటి రాజకీయాలపై వాడి వేడి కార్టూన్లెన్నింటినో ఆయన చిత్రించారు. అదే రాజకీయ కార్టూన్ల ప్రవేశం. తెలుగులో-రాజకీయ కార్టూన్ అవసరాన్నీ ఘనతనీ తొలిసారిగా గుర్తించిన ఘనతకూడా విశాలాంధ్రకే దక్కుతుంది. తెలుగువాడిగా ఉండి ఇంగ్లీషులో పొలిటికల్ కార్టూన్స్ వేసిన మన కార్టూనిస్టు, చాలా మంచి కార్టూనిస్టు గురించి చాలా మందికి ఈ తరంలో ఎవరికీ తెలియదు. ఆయన పేరు R. S. నాయుడు. ఆయన కూడా తెలంగాణా సాయుధ పోరాటం కాలంలో కార్టూన్లు గీసిన మహనీయుడు. కమ్యూనిస్టని ఆయన్ని అరెస్టుచేసి జైల్లో పెట్టారు. అక్కడి టార్చర్‌కి పిచ్చిపట్టింది. పెళ్ళీ పెటాకులు సంపాదనా లేక ఈ మధ్యే బెంగుళూరులో రోడ్లపై నిర్దయగా చనిపోయారు. కొన్ని కార్టూన్లని మిగిల్చి-ఇది ముప్ఫై ఏళ్ల కిందటి విషయం. ఆతరువాత political రంగంలోనూ non political periodicals లోనూ అనేక కార్టూన్లు అచ్చయ్యాయి. అనేక కార్టూనిస్టులు వచ్చారు, వస్తున్నారు.

సత్యంగారూ, జయదేవ్‌గారూ, రమణగారూ గీతగారూ, శంకుగారూ, రామకృష్ణగారూ, ప్రభంజన్‌గారూ, మల్లిక్‌గారూ, కరుణాకర్, రవి, శంకర్ ఇలా ఎందరో మంచి కార్టూనిస్టులు political, semi-political, non political cartoons వేశారు, వేస్తున్నారు.

అయితే రాజకీయ కార్టూన్ల రంగంలో మాత్రం విశాలాంధ్ర-కమ్యూనిస్టు ఉద్యమం తరువాత దాదాపు 20 ఏళ్ళకాలం స్తబ్దత చోటుచేసుకోకుండానే చెప్ప వచ్చు. పత్రికాధిపతులు ఈ విషయాన్ని గుర్తించక పోవడం, ఉపేక్ష, కొత్త తరం పత్రికారంగంలోకి రాకపోవడం ఇత్యాదివన్నీ కారణం కావచ్చు. ఇంత బలమైన మీడియంని ఎందుకంతగా ఉపేక్షించారా అనేది ఎంతకూ అర్థంకాని విషయం. అంతెందుకు నేటి journalism పుస్తకాలన్నింటిలోనూ కార్టూన్స్ పట్లా, కార్టూన్ జర్నలిజం పట్లా నిరాదరణ కొట్టవచ్చినట్టు కనిపిస్తుంది. ఇక్కడ కార్టూనిస్టుల్ని అనడానికి ఏమీలేదు. అవసరం, పరిస్థితులూ ఆదరణ దొరికినప్పుడు కార్టూనిస్టులు కొందరుగాకున్నా కొందరైనా ఉద్భవించేవాళ్ళు. కేవలం పత్రికారంగాన్నే తప్పు పట్టాల్సి ఉంటుంది. బాపూ యుగంలోనూ ఆ తరువాత Social Cartoons కి మంచి ఆదరణ పెరిగింది గనుక నేడు ఆంధ్రదేశంలో పిల్లా పితకా కార్టూనిస్టుల సంఖ్య 15000 అంటే ఆశ్చర్యపోనక్కర్లేదు.

50వ దశకం తరువాత మళ్ళీ ఇరవై ఏళ్ళకు దినపత్రికలో పొలిటికల్ కార్టూన్‌ని సీరియస్‌గా ప్రవేశపెట్టి దానికి దానితోపాటు పత్రికకి గుర్తింపు తెచ్చిన కీర్తి 'ఈనాడు' దినపత్రికకే దాఖలవుతోంది. పత్రికారంగంలో ఏదో చేయాలనీ, కొత్త పుంతలు తొక్కడం, కొత్తగా ఆలోచించే వ్యక్తులు రావడం మూలంగానే ఇది సాధ్యమయింది. ఆనాడు ఈనాడులో వచ్చిన పాపగారి కార్టూన్లు ఈనాటికీ జనం మరిచిపోలేదంటే ఆ తరువాత చెప్పుకోదగ్గ ముగ్గురు నలుగురు పొలిటికల్ కార్టూనిస్టులు పుట్టారంటే నేడు పత్రికల్లో కార్టూనిస్టుల కోసం, కార్టూన్ల కోసం పోటీ తీవ్రతరం అయిందన్నా ఈ ఘనతంతా ఈనాడు పత్రికకే దక్కుతోంది. ముందే చెప్పినట్టుగా ఇప్పుడు కార్టూన్లు లేని దినపత్రికని చూపించడమే కష్టంగా తయారయింది.

ఏదేమైనా Political Cartoons లోకి తెలుగుతనాన్ని తీసుకు వచ్చింది మోహన్, ఈనాడు శ్రీధర్‌లే. జాడ్యత నుంచీ మొనాటనస్ నుంచీ హుషారువైపు పరుగెత్తించి కార్టూన్లకి తాజాదనం చేకూర్చింది వీళ్ళిద్దరే. అంతకు కొంత ముందు ప్రయత్నాలు జరిగినట్టే ఉండేదిగాని ఫలితం లేదనే చెప్పవచ్చు. పాఠకలోకం కూడా కార్టూన్‌ని చూసి అదేదో తమకు సంబంధంలేని, అర్థంకాని బ్రహ్మ పదార్థమో, కేవలం మేధావి వర్గానికి సంబంధించిన గగన ఫలమో అన్నట్టుగా చూసేవాళ్ళు. అయితే ఈనాడు రంగప్రవేశం తరువాత పరిస్థితి పూర్తిగా మారిపోయింది. పత్రికలో మిగతా విషయాలే బ్రహ్మ పదార్థాలయ్యి కార్టూనే సర్వజనులకు సంబంధించిన విషయమయింది.

అప్పటినుండీ శాఖోపశాఖలుగా విస్తరిస్తోందీ రంగం. పత్రికల్నీ పాఠకుల్నీ, రాజకీయనాయకుల్నీ ఎక్కువగా కదలించి వేసింది ఈ దశాబ్దంలోనే అని వేరుగా చెప్పనక్కర్లేదు. 1975 నుంచి జన బాహుళ్యంలోకి వచ్చిన పొలిటికల్ కార్టూన్ ఎన్నో ఒడుదుడుకుల్ని చవి చూసింది. ఇంకా బాల్యంలోనే ఉన్నా ఎన్నో కొత్త ప్రయోగాలు జరుగుతున్నాయి - నిజం చెప్పాలంటే తెలుగు రాజకీయ కార్టూన్ చరిత్ర రాంభట్ల కార్టూన్ల తరువాత మళ్ళీ 75 లోనే ఆరంభం అయింది.

మోహన్‌గానీ, ఇప్పుడు ఉదయంలో వేస్తున్న సురేంద్రగానీ ఈ దశకంలో వచ్చినవాళ్ళే. ఎక్కడ చూసినా శ్రీధర్, మోహన్, సురేంద్రల పేర్లే కనిపిస్తాయి. కారణం ఈ ముగ్గురు నలుగురు మాత్రమే రాజకీయ అవగాహనతో, వేడివేడి సబ్జెక్టులపై కార్టూన్లు వేసేది.

ఇక తెలుగు కార్టూన్లలో ప్రయోగాల విషయానికివస్తే ప్రయోగాలు జరుగుతున్నాయనిగానీ, జరగట్లేదనిగానీ చెప్పడం కష్టసాధ్యం. ఇది మిరప కాయ బజ్జీల వ్యాపారంలాంటిది. మళ్ళీ చెప్పాలంటే గుగ్గిళ్ళవ్యాపారంలాంటిది. లేట్టైతే పాసిపోతాయి. టైం ఉండదు. వ్యవధి చాలా తక్కువ. కనుక ప్రయోగాలు అసాధ్యంకాదు కాని కష్టసాధ్యం. కార్టూనిస్టుకి తగినంత సమయం, పర్యటనావకాశాలు కలిగితేగాని ప్రయోగాలు సాధ్యంకావు. అవి ఈ రంగంలో దుస్సాధ్యం. అయినా నేటి తెలుగు కార్టూనిస్టులు లైన్‌లో, **style** లో, ఆలోచనల్లో వైవిధ్యానికీ, ప్రయోగాలకీ, కొత్త పోకడలకీ, కొత్తకీ ప్రయత్నిస్తూనే ఉన్నారు.

ఉత్థానపతనాలు ఎవరికీ, ఏ రంగానికీ తప్పవు. అయినా అయినంతలో తెలుగు పత్రికారంగం గర్వించదగ్గ రీతిలోనే **social, political** ఇత్యాది కార్టూన్లు వస్తున్నాయని చెప్పవచ్చు.

ఇంకా ఈ రంగం అభివృద్ధి అవాల్సిఉంది. అవాలి. అవుతోంది. శైశవదశనుండి నిత్యయౌవనదశకి ఎదగాలనీ, మరింత మంది కార్టూనిస్టులూ, ఇంకా చురుకైన చురకల్లాంటి కార్టూనిస్టులూ, కార్టూన్లూ పుట్టాలని కోరుదాం.

# పత్రికలు–సాంస్కృతికాంశాలు

—శ్రీ చీకోలు సుందరయ్య

విద్యావంతుల శాతం ఎక్కువవుతున్న కొలదీ 'వార్తలందు ధరణి వర్ధిల్లుతున్నది' అని నిస్సందేహంగా చెప్పవచ్చు. పత్రికలు నడుస్తున్న చరిత్రకు దర్పణాలు. సమాజాన్ని రుజు మార్గంలో అవి పెట్టలేక పోవచ్చుకానీ, మార్గం తప్పిందని సూచించగల శక్తి వాటికి తప్ప మరో సాధనానికి వీలుకాని వ్యవస్థ.

హితవాది, వర్తమాన తరంగిణి, సుజనరంజని, వివేకవర్ధని, ఆంధ్ర భాషా సంజీవని, హాస్యసంజీవని, సతీహితబోధిని, స్వరాజ్య, కృష్ణాపత్రిక, గోలకొండ, ఆంధ్రపత్రిక, ఆంధ్రప్రభ, భారతి, ప్రజాశక్తి, తెలుగు స్వతంత్ర, జమీన్‌రైతు, ఆంధ్రజనత, ఆంధ్రజ్యోతి, ఆంధ్రభూమి, ప్రగతి, తెలుగువెలుగు, జ్వాల, ప్రజాతంత్ర, అభ్యుదయ, సృజన, ప్రజాసాహితి, ఈనాడు, స్వాతి, వల్లకి, జ్యోతి, తరంగిణి, స్రవంతి, ఉదయం, సుప్రభాతం ఇండియాటుడే, మయూరి వంటి వందల సంఖ్యలో వున్న తొలి, మలి, నేటి పత్రికలలో దినపత్రికలు, కొన్ని వార, మాస పత్రికలు ఆయా కాలాలలో వచ్చిన ఉద్యమాలకు ప్రాధాన్యత నిస్తూనే వచ్చాయి. నేడు ఎక్కువ శాతం పత్రికలు వ్యాపార పత్రికలుగా మారాయి. నేటి పత్రికా విజయానికి చిహ్నం అది అమ్ముడవుతోన్న ప్రతుల సంఖ్య! ఒక లక్ష్యం కోసం నడుస్తున్న పత్రికల్ని వేళ్ళమీద లెక్కపెట్టవచ్చు. అటువంటి పత్రికల సంఖ్యే కాదు అవి అమ్ముడవుతోన్న ప్రతుల సంఖ్యను కూడ లెక్కపెట్టవచ్చు. ఇదీ స్థూలంగా నేటి పత్రికల గురించి.

సాంస్కృతికాంశాల విషయానికొస్తే ఒకటి రెండు అంశాల్ని చెప్పుకో వలసిన అవసరముంది. అసలు సంస్కృతి అంటే అర్థం ఏమిటి? అనే విషయం జోలికి పోవటంకాదు కానీ దాన్ని మనమెలా అర్థం చేసుకుంటున్నా మన్నది తప్పక చెప్పుకోవాలి. అది ప్రజా జీవితంలోని రాజకీయ, ఆర్థిక,

సాంఘిక, నైతిక, విద్యా, వైజ్ఞానిక, కళాసాహితీ రంగాల్లో వచ్చిన చైతన్య స్రవంతి కలిగించే భౌతిక, మానసిక వికాసాన్నే సాంస్కృతిక అభ్యుదయంగా కానీ, వికాసంగాకానీ అవుతోందని చెప్పుకుంటున్నాం. అయితే సాంస్కృతిక కార్యక్రమం కానీ, సాంస్కృతిక అంశం అనికానీ అంటే వెంటనే మనోల్లాసం కలిగించే కళాప్రదర్శన అని మనం అర్థం చేసుకుంటున్నాం. ఆ కళా ప్రదర్శనల్లో కూడ అభిరుచుల మేరకు సినిమా మినహాయించి సంగీతం, నృత్యం, నాటకం, అవధానం అప్పుడప్పుడూ ధ్వన్యనుకరణం, ఇంద్రజాలం మొదలైనవే ప్రముఖంగా చోటు చేసుకుంటున్నాయి. జాబితా అని అనుకోకపోతే అరవైనాలుగు కళలంటే ఏమిటో చూద్దాం-

1) అక్షరలక్షణ
2) అలంకార
3) ఇతిహాస
4) మీమాంస
5) తర్కశాస్త్ర
6) స్త్రీలక్షణ
7) పురుషలక్షణ
8) అశ్వలక్షణ
9) గజలక్షణ
10) గోలక్షణ
11) కన్యావాద
12) విషవాద
13) బిలవాద
14) రసవాద
15) ధాతువాద
16) బ్రహ్మవాద
17) మృషావాద
18) ముద్రారక్షక
19) క్షాత్రకర్మ
20) భూతశిలాపాత
21) అశ్వవైద్య
22) గజవైద్య
23) పశువైద్య
24) నరవైద్య
25) ఇంద్రజాల
26) మహేంద్రజాల
27) గోకర్ణ
28) గజకర్ణ
29) తృణావధాన
30) శబ్దావధాన
31) భుజావధాన
32) ఘంటావధాన
33) హస్తచలన
34) నయనసంజ్ఞ
35) భాషావిశేష
36) భ్రమణ
37) పోషణ
38) విద్వేషణ
39) ఉచ్చాటన
40) ఆకర్షణ

41) అంజన
42) అదృశ్య
43) భృగుమత
44) భేతాళమత
45) ఆయుధాభ్యాస
46) వాస్తుశాస్త్ర
47) శిల్పశాస్త్ర
48) భరతశాస్త్ర
49) యోగశాస్త్ర
50) చిత్రక్రియ
51) రథారోహణ
52) గజారోహణ
53) అశ్వారోహణ
54) మోహ స్తంభన
55) వయ స్తంభన
56) అగ్ని స్తంభన
57) జల స్తంభన
58) ఖడ్గ స్తంభన
59) ఘటికాసిద్ధి
60) పాదుకాసిద్ధి
61) మంత్రసిద్ధి
62) పరకాయప్రవేశ
63) దూరదృష్టి
64) దూరశ్రవణ.

ఈ అరవై నాలుగు కళల్లోనూ ఈనాడు ప్రదర్శిస్తున్న కళలు చాలా తక్కువ. కొన్ని వృత్తులుగా మాత్రమే కనిపిస్తాయి. మరికొన్ని క్రీడలుగా గుర్తింపు పొందాయి. మరి కొన్ని అసలే కనిపించవు. లలితకళల పేరిటవున్న విభజనకూడా ఇందులో భాగంగానే చెప్పుకోవచ్చు. ప్రస్తుతం అతి తక్కువ అంశాల్ని ప్రదర్శించడానికి కారణం మన రాజకీయ, ఆర్థిక, సాంఘిక, నైతిక, విద్యా, వైజ్ఞానిక కళాసాహితీ రంగాల్లో వచ్చిన అనూహ్యమైన మార్పులే. చాలా కళల్ని తంగేడుపూవుల్లాగా సంవత్సరంలో ఒకటి రెండు సార్లయినా చూసే భాగ్యం మనకి లేదు.

ఈ మాత్రం కళలైనా సజీవంగా వుండడానికి పత్రికలే ప్రధాన కారణం. వార్తలుగానో, సమీక్షలుగానో కళా ప్రదర్శనల వివరాలను ఎప్పటి కప్పుడు ప్రచురించడం ద్వారా ప్రదర్శకులకు ఉత్సాహం, స్ఫూర్తి కలుగుతున్నాయి. ప్రచారం లభిస్తోంది. ఆదరణ లభిస్తోంది. ఇవి కళాకారుడు ఎదగడానికి తోడ్పడుతున్నాయి. అలాగే ఎక్కువ సంఖ్యలో కళాకారులు రావడానికి ప్రేరకాలవుతున్నాయి. ఉదాహరణకు మన సాహితీ చరిత్రను చూస్తే పత్రికలవల్లే ఈరోజు ఇంటికో రచయిత తయారవుతున్నాడని చెప్పకతప్పదు. పత్రికా ప్రచారంవల్లే నాటకానికి, సంగీతానికి కూడ భౌగోళిక సరిహద్దులు చెదరి ఒక ప్రాంతం కళాకారులు మరో ప్రాంతంలో ప్రదర్శన లివ్వగలిగే

అవకాశం పొందుతున్నారు. రష్యన్ బేలే కళాకారులు హైదరాబాదులో ప్రదర్శనలిచ్చినా, మేండలిన్ శ్రీనివాస్ జర్మనీలో ప్రదర్శన ఇచ్చినా వారిటు రావడానికి, వీరటు పోవడానికి పత్రికలు ఎంత తోడ్పడి వుంటాయో ఊహించ వచ్చు. గత పాతికేళ్ళలో నృత్య సంగీతాలకు పత్రికలు కల్పించిన ప్రచారం వల్లే తల్లిదండ్రులు తమ పిల్లలకు వీటిని నేర్పించడానికి ముందుకు రాగలిగారు. ఉదాహరణకు 'శంకరాభరణం' సినిమా విడుదలైన సందర్భంగా మన రాష్ట్రంలోనేకాక ఇతర రాష్ట్రాలలో సైతం పత్రికలు ప్రచురించిన అనేక వ్యాసాలు, సమీక్షలు ప్రజల దృక్పథాన్నే మార్చాయనడం అతిశయోక్తికాదు. ఒకనాడు దేవాలయాలకు, రాజాస్థానాలకు మాత్రమే పరిమితమై, భోగం మేళంగా మాత్రమే గుర్తింపు పొందిన నృత్యం ఇప్పుడు మూడు పువ్వులు, ఆరు కాయలుగా విలసిల్లుతోంది. సంగీతజ్ఞుల గొప్పదనాన్ని చాటడమే కాక, సంప్రదాయ సంగీతం ఔన్నత్యాన్ని చాటుతూ, దానికోసం కృషి చేస్తున్న వారి మీద, వారి కచేరీలమీద విపులమైన వ్యాసాలు, సమీక్షలు రావడంవల్ల అవి ఎందరికో మార్గదర్శకంగా, ఉత్తేజంగా మారిన ఉదంతాలు చాలా వున్నా యనడం అతిశయోక్తి కాదు. సంగీతం పేరుతో పెడత్రోవ తొక్కినవారిని విమర్శించడం, దానివల్ల వారు తమ మార్గాన్ని మార్చుకోవడం మనకు తెలిసి నదే. అలాగే మిమిక్రీ, హిప్నాటిజమ్‌వంటి వాటిమీద వ్యాసాలు, వార్తలు, ప్రచురించడంవల్ల యువకుల్లో ఆసక్తి ఏర్పడిందన్నది నిర్వివాదాంశం.

సమీక్షకులు శాస్త్రజ్ఞానంతో సంశ్లిష్టమైన కళల్ని విశ్లేషణచేస్తూ రాయడం వల్ల, కళాకారులు అనుకరణ, కల్పన, అభివ్యక్తిలోని లోపాలను గ్రహించి సరి దిద్దుకునేందుకు అవకాశం కలుగుతోంది. సంపూర్ణ శాస్త్ర విజ్ఞానం లేకున్నా, కళా సౌందర్యాన్ని ఆస్వాదించగలిగే అనుభవ పూర్వకమైన 'రసచేతన'ను కలిగివున్నపుడే ఒక కళాప్రదర్శనలోని బాగోగులు వివేచించే వీలు కలుగు తుంది. ఎంత జటిల సమస్యనైనా చిక్కుముడి విడదీసే వారే నేర్పరులు. అలాగే ఎంత క్లిష్టమైన కళారూపాన్నయినా సునాయాసంగా ప్రదర్శించగలవారే గొప్ప కళాకారులు. కళాకారులు సృజనాత్మక చింతనలోని ఆయోజనం, ఉద్భ వనం, సందీపనం, సత్యాపనం అనే నాలుగు దశలను దాటేరా లేదా తెలుసుకో గలిగివారే విమర్శకులు కానీ సమీక్షకులు కానీ కాగలుగుతారు. బాహ్యజగత్తులో అనేక సంఘటనలు, హృదయాల్ని కదల్చే సన్నివేశాలు, కళాకారుణ్ణి మేల్కొ

ల్పడమే ఆయోజనం. సాధారణంగా ఈ దశలో ఎవరూ సృజనకు పూనుకోరు. కళాకారుడు తన హృదయాన్ని కదల్చిన సంఘటనల్ని మననం చేసుకుంటూ ఆలోచనలోపడితే అది రెండో దశ అయిన 'ఉద్భవనం' అవుతుంది. మూడో దశ అయిన 'సందీపనం'లో తనలో నిద్రాణమైన సృజనాత్మకత జాగరితమవు తుంది. తనను కదల్చిన సంఘటనకు రూపం కలిగించాలని ఆరాటపడడం జరుగుతుంది. చివరిదశ అయిన 'సత్యాపనం'లో తనకు కలిగిన అనుభవం, అనుభూతి ఏ మేరకు సృజనార్హమైనవో వివేచన ప్రారంభమవుతుంది. ఈ దశ తర్వాతే రచయిత అయినా, గాయకుడయినా, నర్తకుడైనా, కళాసృజనకు పూనుకోవడం జరుగుతుంది. ఈ నాలుగు దశలు పూర్తికాకమునుపే కళాసృజ నకు పూనుకొన్నవారు మెప్పించడం, రాణించడం అసంభవం. సమీక్షకుడికి దీన్ని గ్రహించగల జ్ఞానం తప్పనిసరిగా వుండాలి.

ఏ కళనయినా దర్శించి అనుభవించడానికి అందరూ స్వయంగా కళా స్రష్టలు కానక్కరలేదుకానీ భరతముని ప్రతిపాదించిన నవరసాల స్థాయీ భావాల్ని ఆకళింపు చేసుకునే శక్తి మాత్రం కనీస ముండాల్సిన అవసరముంది.

శృంగారానికి రతి, కరుణకు శోకం, శాంతానికి నిర్వేదం, రౌద్రానికి క్రోధం, వీరానికి ఉత్సాహం, అద్భుతానికి విస్మయం, హాస్యానికి హాసం, భయానకానికి భయం, బీభత్సానికి జుగుప్స - ఈ విధంగా తొమ్మిది రసాలకు తొమ్మిది స్థాయీ భావాలున్నాయి. ఏయేరసం ఏయేసందర్భాల్లో సము చితమో, ఎక్కడ ఏది అనుచితమో కళాకారులతో పాటు కళలపై వ్యాఖ్యా నించేవారు, సమీక్షకులు, విమర్శకులు గుర్తుంచుకోవలసిన విషయం. అలాగే అభినవగుప్తుడు ప్రతిపాదించిన 'భావ సమన్వయం' కూడా అన్ని కళాప్రక్రియ లకు వర్తించే విషయం కనుక దీన్నికూడా దృష్టిలో వుంచుకోవాలన్నది మన పూర్వీకుల అభిప్రాయం.

శాస్త్ర సాంకేతిక, క్రీడారంగాల వార్తలు రాయడానికి మన పత్రికలకు ప్రత్యేక సిబ్బంది, వసతులు, సదుపాయాలున్నాయి. సాంస్కృతికరంగ విష

యాలకు కూడ అంత ప్రాధాన్యత నివ్వగలిగిన రోజు పత్రికా రచనలో ప్రమాణాలు తప్పక పెరుగుతాయి. ఒక విమర్శకుడన్నట్లు 'నేటి తెలుగు పత్రికా రచన సరైన పద్ధతుల్లో ముందుకు సాగాలంటే విలేఖరులవీ, ఉప సంపాదకులవీ, న్యూస్ ఎడిటర్లవీ సగటు ప్రమాణాలు పెరగాల్సిన అవసరముంది. వారుపయోగించే సాధనాలు, పద్ధతులు ఇంకా విస్తృతం కావాలి. దీనికి శిక్షణ, పరిశోధన, కృషి ఎంతో అవసరం'. నిజమే దీనితో అందరూ ఏకీభవిస్తారు. పత్రికల్లో సాంస్కృతికాంశాలను 'స్పేస్ ఫిల్లర్స్'గా ఉపయోగించడం పరిపాటయింది. అందుకే ఈ అంశాల పట్ల కొన్ని పత్రికలు మినహా చాలా పత్రికలు శ్రద్ధవహించడంలేదు. ఆ కారణంగానే ప్రతిభలేనివారు, సాంస్కృతికాంశాల పట్ల ఆసక్తిలేనివారు, ఏ మాత్రం అభిరుచిలేనివారు వార్త రాయడం విధిగా నిర్వహించడంచేత యాంత్రికత చోటుచేసుకుంటోంది. అంతేకాక సాంస్కృతిక ప్రదర్శనల ముందో వెనుకో జరిగే సభలకి ప్రాధాన్యతనిస్తూ కళా ప్రదర్శనలను నామమాత్రంగా పేర్కొనే పద్ధతి ప్రారంభమైంది.

నేటి పత్రికలు అనుసరిస్తున్న విధానాలు కూడా సాంస్కృతిక రంగానికి గొడ్డలి పెట్టుగా తయారవుతున్నాయి. పదేళ్ళక్రితం వరకు సాంస్కృతిక ప్రదర్శనల వార్తలు, సమీక్షలు రాష్ట్రమంతటా అన్ని ఎడిషన్లలోనూ ప్రచురణకు నోచుకునేవి. ఎనభైలలో (1980 తర్వాత) వాటిని ఆయా ప్రాంతాల సంచికల్లో మాత్రమే ప్రచురించడం మొదలెట్టారు. తొంభైలలో (1990 తర్వాత) ఆయా నగర/నగరంలోనైతం బస్తీలు, జిల్లా సంచికల్లో మాత్రమే ప్రచురిస్తున్నారు. అన్ని రంగాల వార్తలు పెరిగిన మాట వాస్తవమే. అయితే క్రీడలకు మాత్రం అన్ని పత్రికలు ప్రత్యేక పేజీలు కేటాయించాయి. అలాగే సాంస్కృతిక వార్తలకు కూడా ప్రత్యేక పేజీలు కేటాయించాల్సిన అవసరముందనీ, కేటాయించాలనీ అనేక సభల్లో కోరినవారు లేకపోలేదు.

సాహిత్యాంశాలకు ఆంధ్రజ్యోతి, ఆంధ్రప్రభ, ఆంధ్రభూమి ప్రత్యేక పేజీలు కేటాయించి వారానికోసారి అనేకాంశాల మీద వ్యాసాలు, కవితలు, చర్చలు ప్రచురిస్తూ పాఠకుల్లో సాహిత్యాభిరుచిని పెంపొందిస్తున్నాయి. ఈ పత్రికల ఆదివారం అనుబంధాలతోపాటు ఈనాడు, ఉదయం ఆదివారం అనుబంధాలలో కూడా సమీక్షలు, సాహిత్యాంశాలు చోటు చేసుకుంటున్నాయి.

అయితే ఇతర కళలకు సంబంధించిన విషయాలను ప్రచురిస్తున్నా ఒక శీర్షికలా ప్రచురించడం లేదు. సాహిత్యాంశాలవలెనే ఇతర కళలకు సంబంధించిన అనేకాంశాలను వారానికోసారైనా ప్రచురించడంవల్ల సాంస్కృతికరంగం అభివృద్ధి చెందడానికి అవకాశముంటుంది. వార, మాసపత్రికల్లో కూడా సాంస్కృతికాంశాలకు అంత ప్రాధాన్యత నివ్వడంలేదు. ఈ విషయాన్ని ఆయా రంగాలకు చెందిన విజ్ఞులు గుర్తించి పత్రికల సహకారాన్ని కోరవలసిన అవసరం ఎంతైనా వుంది. ఇది జరిగిననాడు సాంస్కృతికాంశాలకు సరైన ప్రచారం, ఆదరణ ఏర్పడుతుంది.

మనిషిని మనిషిగా తీర్చిదిద్దే కళలకు ఇకనైనా అగ్రస్థానం లభిస్తుందని ఆశించడం అత్యాశ కాదనుకుంటాను.

అనుబంధం :

# పత్రికలు–రాజకీయాలు–పరస్పర ప్రభావం

—శ్రీ పొత్తూరి వెంకటేశ్వరరావు

పత్రికలు పుట్టక ముందునుంచి రాజకీయాలు ఉన్నాయి. అప్పుడవి నాయకులను, అధికార పీఠాలను ఆశ్రయించుకుని ఉండేవి. వార్తా పత్రికల ప్రచురణ మొదలై, ప్రచార సాధనాలుగా స్థిరపడిన తరువాత అవికూడా రాజకీయాలకు పట్టుగొమ్మలైనాయి. పత్రికలు ప్రజాజీవితాన్ని, ప్రత్యేకించి రాజకీయరంగాన్ని ప్రభావితం చేయడం, ఆధునిక ప్రజాస్వామ్య వికాసానికి దోహదం చేసిన అనేక ఇతర వ్యవస్థలకువలెనే, ఇంగ్లాండులో మొదలైంది. నాలుగు శతాబ్దుల బ్రిటిష్ పత్రికల చరిత్ర పరిశీలిస్తే అక్కడ అవి క్రమంగా తమ గౌరవాన్ని, పలుకుబడిని పెంచుకోవడం కనిపిస్తుంది. బ్రిటిష్ నమూనాను అనుసరించి ప్రజాస్వామ్యాన్ని పాటిస్తున్న ఇతర దేశాలలో పత్రికల ఎదుగుదల ఒకేరీతిలో లేదు. కొన్ని దేశాలలో పత్రికలు మరింత ఆరోగ్యప్రదమైన వాతావరణాన్ని సృష్టించుకొంటే మరికొన్ని దేశాలకు అవి అనారోగ్యాన్ని కలిగించుకొన్నాయి.

పత్రికలున్న ఏదేశంలోనైనా పత్రికలు రాజకీయాలను, రాజకీయాలు పత్రికలను ప్రభావితం చేయకపోవడమనే ప్రసక్తేలేదు. ఏవి, వేటిని, ఎంత వరకు ప్రభావితం చేస్తున్నాయన్నది ఆయాదేశాల రాజ్యాంగ, సాంఘిక, ఆర్థిక పరిస్థితులనుబట్టి జరుగుతున్నది. నియంతృత్వం నెలకొన్న దేశాలలో సైతం పత్రికలు రాజకీయాలను, రాజకీయాలు పత్రికలను ప్రభావితం చేయకపోలేదు. తరతమ భేదాలు ఉన్నాయి అంతే.

బ్రిటిష్ రాజ్యాంగ సంప్రదాయంలో "లార్డ్స్ స్పిరిచ్యువల్" "(మతాధికారవ్యవస్థ), "లార్డ్స్ టెంపొరల్" (లార్డ్స్ సభ), "కామన్స్" (కామన్సు సభ)

వ్యవస్థలకు మాత్రమే "ఎస్టేట్స్"గా అధికార పరిగణన ఉండేది. మహావక్తగా, గొప్ప రాజనీతిజ్ఞుడుగా పేరొందిన ఎడ్మండ్ బర్క్ ఒక సందర్భంలో (వెట కారంగానే కావచ్చునుగాని) పత్రికలను "ఫోర్త్ ఎస్టేట్"గా అభివర్ణించాడు. అప్పటినుంచి పత్రికలకు ఒక గొప్ప అంతస్తు వచ్చింది. లార్డ్స్ స్పిరిచ్యువల్, లార్డ్స్ టెంపొరల్, కామన్స్ వ్యవస్థల తరువాత గౌరవ స్థానం పత్రికలకు కలిగింది.

మన దేశంలోనూ స్వాతంత్ర్యోద్యమ కాలంలో పత్రికల అవసరాన్ని, ప్రాముఖ్యాన్ని గుర్తించి మన నాయకులు సొంతంగా పత్రికలను స్థాపించడం, డబ్బున్న వాళ్ళచేత పత్రికలు పెట్టించడం చేశారు. మహాత్మాగాంధీ స్వయంగా పత్రికను నడపడం, పత్రికకు సంపాదకత్వం వహించడం మనకు తెలుసు. మోతీలాల్ నెహ్రూ, గోఖలే లాంటి నాయకులు పత్రికలను ఎంతగానో ప్రోత్స హించారు. ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలోనూ, అవిభక్త హైదరాబాద్ సంస్థా నంలోనూ మన ఆంధ్ర నాయకులు తమ ఉద్యమాలకోసం, లక్ష్యాలను, ఆదర్శా లను ప్రచారం చేసుకోవడం కోసం పత్రికలను నడిపారు.

ప్రజాస్వామ్య వికాసానికి, అంతకంటే మౌలికంగా దాని మనుగడకూ పత్రికలు ముఖ్యావసరమనే విషయంలో ఎవరికి ఎలాంటి సందేహమూ ఉండ నక్కరలేదు. పత్రికలవల్ల జనబాహుళ్యానికి జరిగే మంచి గురించి ప్రత్యేకించి వివరించమనవలసిన పనిలేదు. మనదేశంలో స్వాతంత్ర్యానంతరం పత్రికా రంగంలో వచ్చిన కొన్ని అవాంఛనీయ ధోరణులను గురించి మాత్రమే ప్రత్యే కించి చెప్పవలసి ఉంది.

స్వాతంత్ర్యం వచ్చాక రాజకీయ సోపానాలను అధిష్ఠించడానికి పత్రికలు ఉత్తమ సాధనాలని చాలామంది నాయకులు విశ్వసించారు. కనుక స్వయంగా పత్రికలు పెట్టారు. ఇతరులచేత పెట్టించారు. ఐతే, కాలక్రమాన ఆధునిక సాంకేతిక విజ్ఞానం పత్రికా వ్యవస్థ స్వరూప స్వభావాలను మార్చివేసింది. చిన్న పరిశ్రమగా, పత్రికను కొద్దిపాటి పెట్టుబడితో నడుపుకునే రోజులు పోయాయి. పత్రికలు భారీ పరిశ్రమ స్థాయికి ఎదిగాయి. వాటికి కోట్ల రూపాయల పెట్టుబడి కావలసివచ్చింది. అలా కోట్ల రూపాయల పెట్టుబడి

పెట్టే పత్రికలే బ్రతకగలుగుతున్నాయి. పారిశ్రామికవేత్తల సహాయ సహకారాలను ఏదో ఒక విధంగా పొందని పత్రికలు కొన్ని ఉన్నా యని గమనిస్తే అవి బహు తక్కువని తెలిసిపోతుంది. భారీ పెట్టుబడులు పెట్ట లేని రాజకీయ నాయకులు పారిశ్రామిక వేత్తలను, పత్రికలకు కోట్లను పెట్టు బడి పెట్టే ధనాఢ్యులను ఆశ్రయించడం మొదలైంది. తత్ఫలితంగా పత్రికలు, రాజకీయాలు, పెట్టుబడుల మధ్య కొత్త బాంధవ్యాలు ఏర్పడ్డాయి. పెట్టుబడి దారులు పత్రికలను ధర్మ సంస్థలుగా నడపరని, ఏదో ఒక ప్రయోజనాన్ని ఆశిస్తారని, లాభార్జన చేస్తారని తెలియనివారు ఉండరు. పరిశ్రమలు, పత్రికలు, రాజకీయాలమధ్య ప్రత్యక్షంగానో పరోక్షంగానో నెలకొన్న సంబంధాలు జన జీవితాన్ని ప్రభావితం చేస్తున్నాయి. ఈ సంబంధాల పరిధిలోకి రాని పత్రికలు ఉన్నాయి, రాజకీయ నాయకులూ ఉన్నారు. కాని వారిది అల్పసంఖ్యాకవర్గం. పార్టీలకు పార్టీలే పత్రికలను ఆశ్రయించుకొంటున్న ఈ కాలంలో అది తప్పు అని ఎవరూ అనరు, అనడానికి జంకుతారు.

పత్రికాస్వేచ్ఛ అనే మాట తరచూ మన దేశంలోనూ వినిపిస్తూం టూంది. పత్రికలు నిష్పక్షపాతంగా రాగ ద్వేష రహితంగా, జనహితాన్ని మాత్రమే దృష్టిలో పెట్టుకొని వ్యవహరిస్తాయనుకోవడం కేవలం భ్రమ. పత్రికా స్వేచ్ఛ అంటే పత్రికలకు పెట్టుబడి పెట్టి నడుపుతున్న వారి స్వేచ్ఛే గాని, వాస్తవానికి పత్రికలలో రాస్తున్నవారి స్వేచ్ఛకాదన్న సంగతిని జన సామాన్యం తెలుసుకొనవలసిన అవసరం ఉంది. తమ అభిప్రాయాలకు, అభిరుచులకు అనుగుణంగా పత్రికలను నడిపే సంపాదకులను యజమానులు సహించడం, భరించడం అరుదైన విషయం. అక్కడొకరు ఇక్కడొకరు అలాంటి యజ మానులెవరైనా ఉంటే వారికి చేయెత్తి నమస్కరించవచ్చు. పెట్టుబడి పెట్టి పత్రికలను నడుపుతున్నవారే ఎందుకైనా మంచిదని తామే సంపాదకులు కావడం ఇటీవల ప్రారంభమైన ధోరణి. చట్టరీత్యా చూస్తే అందులో అభ్యంతరం చెప్పవలసినదేమీ లేదు. రచనా సామర్థ్యం లేనివారు సంపాదకులు కావడాన్ని జన సామాన్యం ఒప్పుకొంటున్నారు. అలాంటి పత్రికలను ప్రోత్స హిస్తున్నారు. కొన్ని పత్రికల విషయాలలో సంపాదకు లెవరన్నదానిని పాఠ కులు పట్టించుకోవడమేలేదు.

పత్రికల రాజకీయ విధానాలను పెట్టుబడిదారులు నిర్ణయిస్తున్నప్పుడు వారికీ రాజకీయ నాయకులకూ మధ్య అవగాహనలు ఏర్పడడం సహజ పరిణామం. అధికారంలోకి వచ్చిన వారికి రేడియో, దూరదర్శన్ సాధనాలు ఎలానూ "చేతిలోనివి" గనుక సహజంగా వాటినే ప్రోత్సహిస్తారు. గడచిన పది సంవత్సరాల కాలంలో పత్రికల ధరలు అసాధారణంగా పెరగడానికీ, రేడియో, దూరదర్శన్ సౌకర్యాలు అతివేగంగా విస్తరించడానికీ అధికారంలో ఉన్నవారి వ్యూహరచనలే కారణమని విజ్ఞులందరికీ తెలుసు.

పార్టీల పెద్దలు పత్రికల యజమానులను ఆశ్రయించుకొంటుంటే తక్కువస్థాయి నాయకులు కొందరు పత్రికా సిబ్బంది ప్రాపుకోసం ప్రయత్నిస్తుంటారు. తమ ప్రకటనలు వేయించుకొనడానికో తమను గురించి నాలుగు మంచి ముక్కలు రాయించుకొనడానికో కొందరు నాయకులు పడేపాట్లు అన్నీ ఇన్నీ కావు. నయాన కార్యసాధన జేసుకోవాలనుకొనేవారు కొందరైతే భయాన సాధించుకోవాలనుకొనేవారు ఇంకొందరు. జర్నలిస్టులపై దౌర్జన్యం జరిగిన సందర్భాలు, హత్యా సంఘటనలూ పత్రికలలో ప్రచురితమవుతూనే ఉన్నాయి.

నాయకుల ఒత్తిడికి జర్నలిస్టులు తలొగ్గే సందర్భాలు ఎడనెడ ఉన్నాయి గాని, అత్యధిక సందర్భాలలో అనేక కారణాలవల్ల అలాంటి ఒత్తిడులు పనిచేయవు. వార్తలను రిపోర్టు చేసేవారికి నాయకులు చెప్పే విశేషాలు "ఏకపక్షం"గా ఉంటాయన్న సంగతి క్షుణ్ణంగా తెలుసు. రాజకీయ విశేషాలను వార్తలుగా రాసే జర్నలిస్టులు సాధారణంగా వాస్తవాలను వక్రీకరించరు. వ్యాఖ్యానాలుచేయడంలో వివరణలుఇవ్వడంలో సొంత అభిప్రాయాలు చొప్పించవచ్చు. అది విషయాంతరం.

కొన్ని కొత్త ధోరణులు పత్రికారంగానికి ప్రాముఖ్యాన్ని తగ్గిస్తున్నప్పటికీ మన దేశంలో ప్రజాస్వామ్య ప్రమాణాలు ఇప్పుడున్నంత మాత్రమైనా ఉన్నాయంటే అందుకు పత్రికలు చేస్తున్న కృషే ముఖ్యకారణం.

పరిశోధనాత్మక వార్తల విషయంలోను మన పత్రికలు ముందడుగు వేస్తున్నాయి. కాని, ఆరోపణలు మాత్రం చేసి నిరూపణకు వచ్చేసరికి వెనకడుగు

వేస్తుండటంవల్ల రాజకీయాలలో అనూహ్య పరిణామాలు ఉత్పన్నమవుతున్నాయి. బోఫోర్స్ వ్యవహారంలో ముడుపులు ఎవరికి ముట్టాయో నిరూపించలేకపోవడం వల్ల ఆరోపణ అనుమానంగానే మిగిలిపోయి ఎవరిపైన ఆరోపణలు వచ్చాయో వారు ప్రజలమధ్య హీరోలుగా తిరగగలిగారు. ఇలాంటి దృష్టాంతాలు తక్కువ స్థాయిలో ఎన్నో ఉన్నాయి.

(పత్రికలు, రాజకీయాలు - పరస్పరప్రభావం - సమావేశం అధ్యక్షప్రసంగం నుంచి)



తెలుగు ఎదలో తెలుగుతనం
వెల్లువలా పారాలని
తెలుగింటిలో తెలుగుదీపం
అఖండంగా వెలగాలని
ఈ జాతి నిద్రలేచి
మహోన్నత మానవాదర్శాల వైపు
నిరంతర కృషితో
పయనం కొనసాగించాలనే ధ్యేయంతో
ఉడుతాభక్తిగా యువభారతి కృషి చేస్తున్నది
భాషాభిమానం కలగాలంటే
మాతృభాషా సాహిత్య పఠనమే
ప్రథమ కర్తవ్యం అనే భావం
బలంగా మనసులో నాటుకోవడానికి గాను
వీలైనంత ఎక్కువ మందికి వీలైనంత తక్కువ వెలకు
ఉత్తమసాహిత్యం అందించేందుకు
యువభారతి పూనుకున్నది
ప్రతి తెలుగింటిలో
కనీసం పదయినా తెలుగు పుస్తకాలు ఉండేందుకు
మనందరం ఉద్యమ వేగంతో కృషిచేద్దాం
ఆ పదిమంచి పుస్తకాలలో ఏ ఒక్కటిగానైనా
యువభారతి ప్రచురణ ఏ ఒక్కటైనా
ఉండాలనే ధ్యేయంతో కృషిచేద్దాం

# యువభారతి

కడచిన పాతికేళ్లకు పైగా యువభారతి (సాహితీ సాంస్కృతిక సంస్థ) చేస్తున్న కృషి మనకందరికి తెలిసిందే. ప్రాచీన - ఆధునిక సాహిత్యాలను గురించి సమాజంలో సదవగాహనను పెంపొందించడం లోనూ, ఉత్తమ సాహిత్యపు విలువలను ప్రజలకు చాటి చెప్పడంలోనూ యువభారతి సాగిస్తున్న సాహిత్యోద్యమం అభినందనీయం. ఆ సంస్థకు రజతోత్సవం చేయటం తెలుగుసాహితీ సహృదయత్వాన్ని సమ్మానించడంగా భావిస్తున్నాం. మాతో మీరూ అంగీకరించి ఈ వెండి పండుగ వేడుకలకు మీ చేయూత నందిస్తున్నందుకు కృతజ్ఞులం.

రజతోత్సవాలలో భాగంగా **'పాతికేళ్ళ పత్రికా రచన'** అనే ఒక సదస్సును రూపొందించాం. పత్రికారంగంలో పేరు పొందిన ఎందరో ప్రముఖులు యువభారతి మీది అభిమానంతో ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. ఎన్నో నిజాలను నిజాయితీతో చెప్పారు. నేటి మన సామాజిక, సాంస్కృతిక, సాహిత్య రంగాలపై పత్రికా రచనా ప్రభావం అనంతం. ఒక్క మాటలో చెప్పాలంటే - పత్రిక ప్రభుత్వాలను మార్చగలదు, చరిత్రను సృష్టించగలదు. ఇంతటి శక్తిమంతమైన ప్రచారసాధనకు ప్రాణం పత్రికా రచన. పాతికేళ్లుగా దానిలో వచ్చిన పరిణామాలను, మంచి చెడులను, వాటి కారణాలను, ఫలితాలను, వాటి వర్తమానాన్ని, భవిష్యత్తును గూర్చి నిర్భయంగా, నిర్మాణాత్మకంగా సమీక్షించుకొన్న ఒక సదవకాశం ఈ సదస్సు. దాని లోని ముఖ్య పత్రాల సంకలనం ఈ గ్రంథం.

చీకటిని తిట్టుకుంటూ కూచోకుండా చిరుదివ్వె వెలిగించే ప్రయత్నం ఇది. సమకాలీన పత్రికా ప్రపంచం లోని సజీవ సమస్యల సమగ్ర పరిశీలనం చేసిన వ్యాస సంకలనం ఇది. ఒక శక్తిమంతమైన వార్తా వాహికను గురించిన శక్తిమంతమైన వాఙ్మయ చర్చ !